# ఓ మహిళా తెలుసుకో నీ హక్కులు

(స్త్రీలు : శాసన పరమైన అవగాహన)

రచన :

మల్లాది సుబ్బమ్మ

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు
9, ఎం.ఐ.జి.హెచ్. మెహిదీపట్నం,
హైదరాబాద్-500 028.

మల్లాది సుబ్బమ్మ ట్రస్టు నం. 10
ఓ మహిళా తెలుసుకో నీ హక్కులు
గ్రంధకర్త మల్లాది సుబ్బమ్మ

ప్రథమ ముద్రణ - 1995

ప్రతులు 1000



9, ఎం.ఐ.జి. హెచ్. మెహిదీపట్నం
హైదరాబాద్-500 028.

ఫోన్లు : 35429 & 220156

ప్రతులకు వికాసకేంద్రం
9, ఎం.ఐ.జి. హెచ్, మెహిదీపట్నం,
హైదరాబాద్-500 028.

ఇందులో
ఓ మహిళా తెలుసుకో నీ హక్కులు
వరకట్న మరణాలు, చట్టాలు, శిక్షలు

వెల రూ. 20=00

ముద్రణ

లక్ష్మి ప్రింటర్స్
11-6-868, బేగ్ ఐలాండ్, లక్డీకాపూల్,
హైదరాబాద్-500 004.

# స్త్రీలకు తమ హక్కులు ఎందుకు తెలియాలి?

"స్త్రీలు: చట్టాలు" అనే అంశాన్ని గురించి తెలియాలంటే దానికి కొంత పూర్వ చరిత్ర తెలియాలి. అంటే శాసన నిర్మాణ కాలానికి ముందు దేశపరిస్థితి, శాసనాలనాటి ఆచారాలు, అనుభవాల అవగాహనలాంటివి అందులో వున్నాయి. ఇంకా మతధర్మ శాస్త్రాల ఆధారాలు వున్నాయి. ప్రవక్తల నిర్దేశాలు వున్నాయి. ఆచారాల ప్రసక్తి వుంది. పురుష ప్రపంచ భావన వుంది. ఇలా అనేకానేక సంస్కృతుల సమ్మేళనమే మన మతధర్మ శాసనాలుగా రూపొందాయి. అందువల్ల మన దేశంలోని మహిళల హక్కులు, స్థితి గతులు వారు అనుసరించే మతంమీద ఆధారపడి వుంటాయని ముందుగా మనం గ్రహించాల్సిన విషయం.

మనచట్టాలు స్త్రీలపట్ల చూపుతున్న వైఖరి గమనిస్తే కొన్ని ప్రశ్నలు ఉదయిస్తాయి. చట్టాలు స్త్రీలకు పూర్తి న్యాయం చేస్తున్నాయా లేదా? చట్టాల వ్యాఖ్యానంలో చట్టం దృష్టిలో స్త్రీ పురుష సమానత్వాన్ని అవి నిరూపిస్తున్నాయా అంటే లోపాలు కొన్ని వున్నాయి. ధర్మశాస్త్ర నిర్దేతలు పూర్తిగా పురుషులు కావటం వివక్షకు ఒక కారణమైతే, తమ హక్కులు గురించిన పరిజ్ఞానం స్త్రీలలో లోపించటం లేక వాటికొరకై పోరాటాలు జరపకపోవటం మరో కారణముంది. ఏదైనా మొత్తం మీద మన పూర్వీకులైన శాస్త్రకారుల అసమానత్వ భావాల ఫలమే మనచట్టాలలో బీజరూపం దాల్చివున్నాయి. అనాడు స్త్రీలపై వారికున్న దృష్టి దోషమే ఈనాటి శాసన కర్తలలో కాని, న్యాయశాస్త్ర నిర్దేతల్లో కాని, న్యాయవాదల్లో కాని ప్రతిఫలించి వున్నాయి. ధర్మశాస్త్ర ప్రతిపాదితమైన హైందవ ధర్మ సూత్రాలను బ్రిటీష్ పాలనలో శాసనాలద్వారా కొంత మార్పు చేయడం జరిగింది. అలాంటి మార్పులు ఇతర మతాలలో కొద్దిగా మాత్రమే జరిగాయి. 1857లో సిపాయి తిరుగుబాటు జరిగాక బ్రిటీష్ ప్రభుత్వ వైఖరిలో మార్పు వచ్చి వారు పట్టించుకోలేదు. విక్టోరియా రాణి తన ప్రకటనలో భారత ప్రజల మత విషయాలలో ప్రభుత్వం జోక్యం కలుగజేసుకునేది లేదని ప్రకటించింది. తరువాత సంస్కరణోద్యమానికి బ్రిటిష్ ప్రభుత్వం యొక్క మద్దతు మనకు లభించలేదు. కాని వారు దానిని ఏనాడూ వ్యతిరేకించ లేదు. సిపాయి తిరుగుబాటుకు పూర్వం అధిక సంఖ్యాకులైన హిందువుల విషయంలో కొంతగా కొంత జోక్యం చేసుకున్న ఫలితంగా 1829లో సతిసహగమనం చట్టం 1856లో విధవ వివాహ శాసనం వచ్చాయి. 19వ శతాబ్దపు శాసనాల నిర్మాణం బ్రిటిష్‌వారి పట్టుదలవల్ల జరిగింది. "శారదా

యాక్టు" (బాల్య వివాహ నిరోధ శాసనం) 1929లో వచ్చింది. ఇది కేంద్ర శాసనసభలో శారదా అనే ఒక సభ్యుని కృషివల్ల జరిగింది. తర్వాత 1946లో వివిధ శాఖలకు చెందిన వివాహాలు అంటే ఒకే కులం, ఒకే గోత్రం, లేక ప్రవరలో జరిగినా చెల్లుతాయి అనే చట్టం వచ్చింది. అలాగే 1946లో ఆమోదింపబడిన మనోవర్తి శాసనం అమలుజరిగింది. ఇంకా 1949లో భిన్నమతాల, కులాల, వర్ణాలకు చెందిన వివాహం చట్టసమ్మతం చేశారు. ఇవన్నీ దేశ స్వాతంత్ర్య సముపార్జన సమయంలో శాసన రూపం దాల్చాయి. 1947లోని బొంబాయి విడాకుల చట్టం, 1946లోని బొంబాయి బహుభార్యాత్వ నిషేధ చట్టం, 1949లోని మద్రాసు బహుభార్యాత్వ నిషేధం విడాకుల చట్టం 1935 భారత ప్రభుత్వ చట్టంలో నిర్దేశించబడిన రాష్ట్ర స్వపరిపాలనా ఫలితాలు. 1936లోని పార్శీ వివాహ విడాకుల చట్టం ఈ వైఖరికి నిదర్శనం. ముస్లిం స్త్రీకి విడాకుల హక్కును ప్రసాదించే చట్టం ఈ వైఖరికి నిదర్శనం. ముస్లింస్త్రీకి విడాకుల హక్కును ప్రసాదించే చట్టం 1939లో జరిగిందే ఈనాటికి అమల్లో వుంది. 1956, 60, 64, 76,78లలో మార్పు చేయబడిన హిందూ వివాహశాసనం ఇవన్నీ అభ్యుదయ కరమైనవి ప్రజాభిప్రాయానికి అనుగుణంగా హిందూ శాసనాలను మార్చటానికి మన ప్రభుత్వం వెనుకాగలేదని మనం గ్రహించవచ్చు. కాని 1872లో క్రోడీకరింపబడిన క్రైస్తవ వివాహ శాసనంలో 1869 నాటి క్రైస్తవ విడాకుల శాసనాలలో సవరణలు జరుగకపోవటం చాలా శోచనీయం. పార్శీ వివాహం మరియు విడాకుల శాసనం 1936లో చట్టం రూపం ధరించినది. అలాగే నిలిచిపోయాయి. 1939 నాటి ముస్లింల విషయం కూడా జరిగింది. అలాగే ఒక వైపున స్వప్రయోజనపరులు, రెండవ వైపున పాలకవర్గాలు ఇద్దరూ కలిసి అల్పసంఖ్యాక వర్గాల వ్యవహార శాసనాలను (సివిల్ లాస్) మార్చే విషయంలో కుట్ర చేసి జోక్యం కలిగించుకోవటం లేదనేదానికి ఇవి గీటురాళ్ళు ఈనాడు అమలులో వున్న శాసనాలలో ముఖ్యమైనవి వివాహానికి, వారసత్వానికి, దత్తతకు, మనోవర్తికి, మైనారిటీ మరియు సంరక్షకత్వానికి సంబంధించినవి బాల్య వివాహ నిరోధ శాసనం, వరకట్న నిషేధశాసనం, శిక్షా స్మృతిలో వచ్చిన మార్పులు ద్వితీయ శ్రేణికి చెందినవి వీటి ఫలితంగా స్త్రీల హోదాలో కొంతమార్పు వచ్చినమాట వాస్తవం భారతదేశంలో అనేకమంది పురుషులు తమ భార్యలను గౌరవిస్తామని గొప్పగా చెప్పుకుంటూ వుంటారు. అర్ధాంగులుగా పరిగణిస్తామని పొగుడుకుంటూ వుంటారు.

చట్టాలలో పురుషులకు వున్నన్ని హక్కులు స్త్రీలకు లేవనేది నిర్వివాదాంశం. మహిళా కార్యకర్తలు వారి హక్కులను అవగాహన చేసుకోవటం అవశ్య కర్తవ్యం.

# స్త్రీలు : శాసనపరమైన హక్కులు

1.ప్ర॥ భారత రాజ్యాంగ పరంగా స్త్రీలకు వున్న ప్రత్యేక హక్కులు ఏవి?

జ॥ 1. సమానత్వం:- చట్టం దృష్టిలో స్త్రీ పురుషులు సమానులు (భారత రాజ్యాంగం ఆర్టికల్ 14).

2. చట్టంయొక్క రక్షణను స్త్రీ పురుషులు సమానంగా పొందవచ్చును. (భా.రా.ఆ 14)

3. స్త్రీగా ఆమెపై వివక్షను ప్రదర్శించరాదు, తేడా చూపరాదు (భా.రా.ఆ. 15(1) దుకాణాల్లో, ఫలహార శాలల్లో ప్రజలకు వినోదం కల్గించే ప్రదేశాలలో ప్రవేశాన్ని అటకాయించరాదు. ప్రభుత్వ నిధుల చేత పూర్తిగా కాని కొంతగాని పోషింప బడుచున్న బావులు, చెరువులు, రహదారులు, పార్కులు వీటి వాడకానికి స్త్రీలను నిరోధించరాదు.(భా.రా.ఆ. 15(2)బి) అయితే స్త్రీలకు పిల్లలకు ప్రత్యేకసదుపాయాలు చేయవచ్చును (భా.రా.ఆ.15(3) ఉదాహరణకు వారికి ప్రత్యేక పాయిఖానాలు, మూత్రశాలలు, స్నానపు గదులు, విశ్రాంతిశాలలు ఏర్పాటు చేయవచ్చు.

4. ప్రభుత్వ ఉద్యోగాలు పొందటానికి స్త్రీలు అర్హులు. వాటిని పొందటానికి స్త్రీలకు సమానావకాశాలు వుండాలి. (భా.రా.ఆ.16(1) ఉద్యోగాలలో తగిన ప్రాతినిధ్యం లేని వెనుకబడిన తరగతి చెందిన పౌరులకు ఉద్యోగాలలో ప్రత్యేకంగా కేటాయింపు (భా.రా.ఆ.16/4) వుండవచ్చును. స్త్రీలు వెనుకబడిన తరగతి ప్రజలు కనుక వారికి యిలాంటి సౌకర్యం కలిగించవచ్చును.

2.ప్ర॥ రాజ్యాంగపు ఆదేశిక సూత్రాలంటే ఏమిటి?

జ॥ ప్రభుత్వం పరిపాలనా విషయంగా పాటించవలసిన సూత్రాలు అవి. వాటిని శాసనాలుచేసే సందర్భంగా ప్రభుత్వాలు తప్పనిసరిగా దృష్టిలో వుంచుకోవాలి. అయితే వాటిని న్యాయస్థానాలద్వారా (కోర్టులు) అమలు చేయించటానికి వీలు లేదు. (భా.రా.ఆ 37)

3.ప్ర॥ మార్గదర్శక సూత్రాలలో స్త్రీలకు మాత్రమే సంబంధించినవి ఏవి?

జ॥ 1. స్త్రీ పురుషులకు సమానంగా తగిన జీవనోపాధిని సమకూర్చాలి (భా.రా.అ.39(ఎ) (2) స్త్రీ పురుషులకు సమానమయిన పనికి సమానమయిన వేతనం(జీతం, కూలి) వుండాలి (భా.రా అ 39,డి) (3) స్త్రీ పురుష శ్రామికుల ఆరోగ్యం, బలం ఏదీ దుర్వినియోగం పనికిరాదు (భా రా.అ.39 (ఇ) (4) స్త్రీలకు ఉచితమయిన పని పరిస్థితులను కల్పించాలి ఉ॥ గనులలో స్త్రీల చేత పనిచేయించరాదు. తల్లి అయ్యే స్త్రీకి సౌకర్యాలు యివ్వాలి(భా.రా.అ 42) 5) భారతదేశంలో అన్ని ప్రాంతాల ప్రజలకు ఒకే రకపు సివిల్ శాసనాల సంపుటి (Common Civil Code) ఉండాలి. (భా.రా.అ 44) వేరు వేరు మతాల వారికి వివాహం, విడాకులు సంరక్షకత్వం వగైరాలకు సంబంధించి వేరు వేరు మతధర్మశాసనాలు వున్నందువల్ల స్త్రీలు కష్టనష్టాలకు లోనవుతున్నారు. కనుక ఇది స్త్రీలకు అత్యవసరం. (6) బలహీన వర్గాల ప్రజల ఆర్థిక, విద్యా విషయక ప్రయోజనాలను శ్రద్ధగా కాపాడాలి. (భా.రా అ. 46) స్త్రీలు బలహీన వర్గాల క్రిందకు వస్తారు. (7) పౌరుల పోషకాహారం జీవనప్రమాణం, ప్రజారోగ్యం పీటిని విధిగా ప్రభుత్వం పెంపొందించాలి. (భా.రా.అ. 47). ఈ మూడు విషయంలో స్త్రీలు నిర్లక్ష్యానికి గురి అవుతున్నారు కదా!

నిర్వచనాలు : 4.ప్ర॥ నేరమంటే ఏది?

జ॥ శాసనాలలో పేర్కొనబడిన శిక్షలకు లోనయ్యేవన్నీ నేరాలే. మంచీ, చెడూ అనేవి మనిషి మనస్సుకు, సమాజానికి సంబంధించినవి చెడ్డ వన్నీ నేరాలు కాకపోవచ్చును. అసత్యమాడటం చెడ్డది. కాని అన్ని అసత్యాలకు నేర స్వభావం లేదు. ఉ॥ మోసగించటంలో అసత్యముంటే అది నేరమే. అదేపనిగా పలువురు పురుషులతో స్త్రీ లైంగిక సంబంధం పెట్టుకోవడం చెడ్డదే. అయితే అది డబ్బుకోసం అలా చేస్తే ఆమె పడుపు వృత్తిని చేపట్టినట్లు లెక్క. కొన్ని సందర్భాలలో అది నేరమవుతుంది. ఉ॥ వ్యభిచార గృహంలో పడుపువృత్తి సాగించటం, విటులను ఆకర్షించటానికి ప్రజలు తిరిగే బహిరంగ ప్రదేశాలలో సైగలు చేయటం లాంటివి నేరాలు).

5 ప్ర॥ స్త్రీ వివాహం చేసుకోకుండా వుండటానికి ఆమెకు హక్కు వుందా?

జ॥ చట్టప్రకారం ఆమెకు ఆ హక్కు వున్నది. కాని ఆమె తల్లిదండ్రులు, అన్న

తమ్ముళ్ళు, అక్కచెల్లెళ్ళు, దగ్గర బంధువులు, సమాజం ఆమెకున్న ఆ హక్కును వాడుకోనీయటం లేదు.

6 ప్ర॥ 18 సంవత్సరాలు నిండిన స్త్రీ తన యిష్టం వచ్చిన పురుషుని పెళ్ళాడవచ్చా?

జ॥ హిందూ క్రైస్తవ పార్సీ మతధర్మ శాసనాలలో పేర్కొనబడి నిషేధింపబడిన దగ్గర బంధువయిన పురుషుని, భార్య వున్నవానిని పెళ్ళాడ రాదు. ఇతర్రతా ఎవరినయినను ఆమె వివాహమాడవచ్చును. ముసల్మాను పురుషుని విషయంలో అతనికి ముగ్గురు భార్యలున్నను అతనికి నాలుగవ భార్యగా పెళ్ళాడవచ్చును. మేజరు అయిన స్త్రీకి వున్న యీ హక్కును ఎవరూ కాదనటానికి వీలులేదు. కాని చుట్టాలు, సమాజం ఆమెకు హక్కును అనుభవించనీయకుండా చేస్తున్నవి. శాఖాంతర, కులాంతర, మతాంతర, జాత్యంతర వివాహాలలో స్త్రీలు యీ అస్వతంత్రతకు గురి అవుతున్నారు.

7. ప్ర॥ పెళ్ళాడే స్త్రీ పురుషులకు వయస్సు నియమం ఉందా ?

జ॥ స్త్రీకి 18 సంవత్సరాలు పురుషునికి 21 సం॥ నిండాలి. ఆ వయస్సులోని హిందూ ముసల్మాను మతాల పిల్లలకు తల్లిదండ్రులు పెళ్ళి చేస్తే ఆ పెళ్ళి చెల్లుతుంది. అయితే హిందూ స్త్రీ 18సం॥నిండేలోగా తన యీ పెళ్ళి అక్కర లేదని అన వచ్చును. ఆమె భర్తతో కాపురం చేసినా, చేయకపోయినా ఆమెకు యీ హక్కు వుంటుంది. ముసల్మాను స్త్రీ విషయం వేరు. ఆమె 15 సం॥ నిండేలోగా జరిగిన తన పెళ్ళిని 18 సం॥ నిండేలోగా తిరస్కరించావచ్చును. అయితే ఈ హక్కును వాడుకోవటానికి భర్తతో కాపురం చెయ్యని అంటే భర్తతో లైంగిక సంపర్కం లేని స్త్రీకి అవకాశముంటుంది పార్సీ క్రైస్తవ స్త్రీ పురుషులకు వయస్సు విషయంలో ఏ మినహాయింపులూ లేవు.

8 ప్ర॥ పెళ్ళికి మతతంతు తప్పని సరా ?

జ॥ హిందూ వివాహ శాసనం ప్రకారం పెళ్ళి వధూవరులలో ఏ ఒకరి ఆచార ప్రకారం, తంతుతో జరగాలి. అంతే కాని మత ప్రసక్తి పేర్కొనబడలేదు. (హిందూ వివాహ శాసనం సెక్షను7). అయితే ఈ ఆచారం సహేతుకమైనదీ, చాల కాలంనుండి వుంటున్నదీ, ఎడతెగకుండా సాగుతున్నదీ కావాలి. మత తంతుకు అలాంటి హోదా ఎప్పటినుంచో వున్నది. కాగా ఇతర ఆచారాలకు పైస్వభావాలు వున్నాయని రుజువు కావాలి. కమ్యూనిస్టులు, రాడికల్ హ్యూమనిస్టులు, నాస్తికులు వగయిరాలు ఏబది ఏండ్ల పైనుండి పెద్దల సమక్షంలో

2 సంవత్సరాలు మించని జైలు శిక్ష అదనంగా జరిమానా వేయవచ్చు
(సెక్షను 376 ఎ).

32. ప్ర। మానభంగం కాని సంభోగం కేసులలో శిక్షలు ఎలా వుంటాయి ?

జ। జైలు, రిమాండు హోం, స్త్రీల సదనం, బాలికల సంస్థ పర్యవేక్షణాధికా
నిర్వాహకుడు(సె. 376 సి), ఆస్పత్రి పరిపాలక వర్గసభ్యుడు, ఉద్యోగ వ
సభ్యుడు (సె.376డి) తమ అధికారాలను వినియోగించి తమ అధీనంలో
వున్న స్త్రీని తనతో సంభోగం చేయడానికి పురికొల్పి, శీల విషయం
ఆమెను వక్ర మార్గాన పట్టించి, ఆమెతో సంభోగం చేస్తే ముద్దాయికి 5 సం
మించకుండ జైలు, జరిమానా రెండూను శిక్షలు.

33. ప్ర। నేరానికి గురి అయిన స్త్రీ ఎలా ప్రవర్తించాలి ?

జ। 1) నేరం జరిగిన వెంటనే పోలీసు రిపోర్టు యివ్వాలి. 2) స్త్రీవైద్యునిచేత త
శరీరాన్ని పరీక్ష చేయించుకోవాలి. పోలీసులే ఆమెను ప్రభుత్వవైద్యాలయాని
పంపుతారు. 3) వైద్యులు పరిశీలించేదాకా తన దేహాన్ని, దేహావయవాలన
కడుగరాదుప పరిశుభ్ర పరచరాదు. 4) నేరం జరిగిన సమయంలో తన
ధరించిన దుస్తులను రసాయనిక పరీక్షకు పంపేట్టు చూచుకోవాలి. 5
నేరస్తుడు పట్టు బడితే అతని శరీరాన్ని పోలీసులు వైద్యునిచేత పరీక్ష చేయించేటట్టు
చూచుకోవాలి. 6) నేరస్తుని దుస్తులను పోలీసువారు రసాయనిక పరీక్షకు
పంపేలాగు చూచుకోవాలి. 7) సాక్షులు వుంటే వారిని ముద్దాయి
భయపెట్టకుండా, లోభపెట్టకుండా చూడాలి.

34. ప్ర। నేరానికి గురి అయిన స్త్రీతో ఎలా ప్రవర్తించాలి ?

జ। ఆమెకు ధైర్యం చెప్పి మనోనిబ్బరం కల్గించాలి. ఆమెలో దోషభావ
నశించేటట్టు చూడాలి. ఆమె తప్పు చేసిన వ్యక్తి కాదని ఆమెకు నమ్మకం
కలిగించాలి. కేసు విచారణలో ఆమె నిబ్బరంగా సాక్ష్యం చెప్పేట్టు చూచుకోవాలి.

## స్త్రీని ఎత్తుకుని పోవుట(కిడ్నాపింగు), బలవంతంగా లేక మోసవిధంగా ఎత్తుకునిపోవుట(అబ్‌జక్షన్)

35. ప్ర। స్త్రీని ఎత్తుకుని పోవుట ఎన్ని రకాలు ?

జ॥ బలవంతం చేయటానికి ఎవరికీ హక్కు లేదు. ఆమెను కాళ్ళూ చేతులు కట్టేసి లేక బెదిరించి కాపురానికి తీసుకొని వెళ్ళరాదు. గ్రామాలలో యీ న్యాయానికి భంగం కలుగుతున్నది.

11 ప్ర॥ మైనరు (18సం॥నిండని) బాలిక తనంత తాను పెళ్ళాడ వచ్చా? అది చెల్లుతుందా?

జ॥ పెళ్ళాడరాదు. అది చెల్లదు. పైగా వరుడు ఆ అమ్మాయిని తమవారి అధీనం నుండి ఎత్తుకొని వచ్చారని అతనిపై ఆమె తల్లిదండ్రులు వగయిరాలు కేసు పెట్టి అతనికి 10సం॥ శిక్ష వేయించవచ్చును. (భారత శిక్షాస్మృతి సెక్షను 366) (ప్రేమించినవానిని జైలుకు పంపే పని చేయటం తప్పుకాదా? అలా చెయ్యటం బాలికకు ధర్మం కాదు; న్యాయం కాదు. ప్రేమ పేరుతో యిలాంటి వ్యవహారాలు ఎక్కువ జరుగుతున్నాయి. కనుక హెచ్చరించడమయినది.)

12 ప్ర మైనరు బాలికకు తల్లిదండ్రులు లేక అన్న ఆమెకు యిష్టంలేని పెళ్ళిచేయతలపెట్టు కుంటే ఆ పెళ్ళిని ఆపటానికి ఆమెకు హక్కు వుందా?

జ॥ ఆ పెళ్ళిని ఆపించమని ఆమె తన బంధువులద్వారా, కోర్టు సాయం పొంది ఆపించవచ్చును. లేక తనే సరాసరి మేజిస్ట్రేటు దగ్గరకు వెళ్ళి ఆపించుకో వచ్చును. పెళ్ళి ఆపమని ఉత్తరువు యిచ్చి ఆమెను ప్రభుత్వ బాలికా సదనానికి పంపుతాడు మేజిస్ట్రేటు.

13 ప్ర॥ 15సం॥ నిండని భార్య తన దేహాన్ని భర్త వాడుకోరాదని అనవచ్చునా?

జ॥ అనవచ్చును. అతడు ఆమె మాటలను లెక్కచేయకుండా ఆమెతో సంభోగిస్తే నేరమే

14 ప్ర॥ 15సం॥ నిండిన వయస్సువున్న భార్య తన భర్తను సంభోగించవద్దని ఆమె అనవచ్చునా?

జ॥ అనవచ్చును. కాని అతడు ఆమె కోరికకు మన్నించకపోయినా అతడు నేరం చేసినట్లుగాదు. కాకపోతే అతని చర్యను క్రూర హింసక్రింద లెక్కకట్టి ఆమె అతనినుండి విడాకులు కోరవచ్చును.

15 ప్ర॥ పెండ్లిని రిజిష్టరు చేసుకోవాలా?

జ॥ హిందూ వివాహం తప్పని సరిగా రిజిష్టరు చేయించుకోనవసరం లేదు రిజిష్టరు చేసుకోవడం వధూవరుల యిష్టా యిష్టాలపై ఆధారపడుతుంది. ముస్లిం,

క్రైస్తవ, పార్సీ వివాహాలలో పెళ్ళిళ్ళను రాతపూర్వకంగా రిజిష్టరుచేస్తారు.

16ప్ర॥ భార్య జీవించివున్న పురుషుడు మరొక స్త్రీని పెళ్ళాడితే, భర్తజీవించి వున్న స్త్రీ మరొక పురుషుని పెళ్ళాడితే ఆ తరువాతి పెళ్ళి చెల్లుతుందా?

జ॥ చెల్లదు. ఆ వివాహం జరగనట్లే లెక్క. అయితే యీ సూత్రం భార్య జీవించివున్న ముసల్మాను పురుషుని మరో పెళ్ళాం విషయంలో వర్తించదు. ముస్లిం పురుషుడు ఏక కాలంలో నల్గురు భార్యలను పెళ్ళాడ వచ్చు. ఏ మత ధర్మ శాస్త్రం ప్రకారం కూడా ఏస్త్రీ భర్త బ్రతికి వుండగా మరో భర్తను స్వీకరించరాదు.

17ప్ర॥ ఎప్పుడు హిందూ వివాహం చెల్లదు?

జ॥ వధూవరులు, నిషిద్ధ సంబంధాలలోవుంటే చెల్లదు. కోర్టు అలా ప్రకటించ గలదు. అయితే దక్షిణాదిన తెలుగువారిలో మేనమామ మేనకోడళ్ళ పెళ్ళిళ్ళు మేనమామ మేనత్తం సంతానాల పెళ్లిళ్ళు ఆచార ప్రకారం చెల్లుతవి. మేనత్త కొడుకును స్త్రీ పెళ్ళాడడం తప్పు కాదు. (నిజానికి యింతదగ్గర రక్త సంబంధంవున్న పెళ్లిళ్ల మంచివి కావు. వారికి వికలాంగులు, మానసిక రోగులు సంతానంగా కలిగే అవకాశాలు జాస్తి )

18ప్ర॥ ఎప్పుడు హిందూ వివాహం చెల్లదని కోర్టువారిని కోరవచ్చును?

జ॥ 1) పిటీషను పెట్టినవారుకాక రెండవ వారి నపుంసకత్వం వల్ల శోభనం జరుగక పోతే,

2) రెండవ వారికి మానసిక అస్వస్థత, వివాహానికి సంతాన ప్రాప్తికి పనికి రాకుండా చేసే మానసిక రుగ్మత పెళ్ళినాడే వుంటే,

3) పిల్ల సమ్మతి, పిల్ల తల్లిదండ్రుల సమ్మతి, సంరక్షకుల సమ్మతిని 2వ వారు మోస విధంగాకాని బలవంతంగా కాని పొందితే

4) వధువు పెళ్లి నాటికి యితరులవల్ల గర్భంతోవుంటే, యివి ఋజువయితే కోర్టు వారు పెళ్ళిని రద్దుచేయగలరు (హిందూ వివాహ శాసనం సెక్షను 12(11) బలవంతం, మోసం, వధువు గర్భం ఏదీ విషయంగా పెళ్ళి రద్దు చేయించు కునే సందర్భంగా కొన్ని షరతులు వున్నాయి. వాటిని పాటించాలి. (హి వి.శా. సెక్షను12).

19ప్ర॥ ప్రత్యేక వివాహ శాసనం క్రింద పెళ్లి ఎప్పుడు చెల్లదని కోర్టు ప్రకటించ వచ్చును ?

జ॥ (1) వరుసగా భర్త,భార్య జీవించివుండగా(2)వయస్సు నిబంధనలకు వ్యతిరేకంగా వుంటే (3) వధూవరులు నిషేధపు సంబంధాంలో వుంటే (4) వివాహానికి వధూ వరులు సమ్మతి యివ్వలేని స్థితిలో వుంటే, (5)వివాహమయినపుడు దావా వేసినప్పుడు ఎదిరి పార్టీ నపుంసక స్థితిలోవుంటే, కోర్టు యీ పెళ్ళి జరగనట్టేనని తీర్పు యివ్వవచ్చును (హి.వి.శా. సెక్షను24)

20 ప్ర॥ హిందూ వివాహంలో ఏ (మత) తంతు ముఖ్యం ?

జ॥ కన్యాదానం, పాణి గ్రహణం, తాళి కట్టడం ముఖ్యం కాదు. వధూవరులు కలిసి ఏడడుగులు వేయటం ముఖ్యం. ఏడో అడుగు వేసేలోగా వరుడు చనిపోయినా, అతడు ఏడవ అడుగు వేయకపోయినా పెళ్ళి కానట్లే.

21 ప్ర॥ ఇంతకూ హిందువులు అంటే ఎవరు ?

జ॥ 1) మతరీత్యా హిందువులు 2) ఈదేశంలో స్థిరనివాసం కలిగి ముసల్మానులు, క్రైస్తవులు, పార్సీలు, యూదులు కాని వారు; వీరంతా హిందువులే.

22 ప్ర॥ అన్ని మతాలవారికి భార్య సామాన్య విధులు ఏవి?

జ॥ 1) ఆమె భర్తతో కాక యితరులతో లైంగిక సంపర్కం నెరపరాదు.

2) ఆమె ఆరోగ్యానికి, సభ్యతకు భంగం కలగని రీతిలో హేతుబద్ధమయిన సమయాలల్లో ప్రదేశాలలో భర్తను తనతో సంభోగం చేయనివ్వాలి.

23 ప్ర॥ ముస్లిం భార్యకు వున్న ప్రత్యేక విధులు ఏవి

1) భర్త చనిపోయిన తరువాత 'ఇద్దతు' కాలంలో మరల వివాహమాడరాదు.

2) సహేతుకమయిన కారణం వుంటేతప్ప భర్తవున్నచోట కాపురం చెయ్యాలి

3) భార్య సంచార స్వాతంత్ర్యంపై భర్త పెట్టే హేతుయుతమయిన అదుపులు ఆమె అంగీకరించాలి.

24 ప్ర॥ భార్య హక్కులు ఏవి ?

జ॥ 1) పోషణకు హక్కు 2) భర్త నిరాదరణ చేసినా,విడాకులు యిచ్చినా భరణం పొందే హక్కు 3) భర్తను తనతో కాపురం చెయ్యమనే హక్కు 4) ముస్లిం స్త్రీలకు మహరు హక్కు 5) ముస్లిం స్త్రీలకు తనకూ తన భర్తకు వేరేగది (వీలయినంత వరకు) కావాలనే హక్కు 6) ముస్లిం స్త్రీలకు బంధువులను చూచి వచ్చే హక్కు, బంధువులు ఆమెని చూచిపోయేహక్కు యివన్నీ భార్యలకు వున్నాయి.

25ప్ర॥ స్త్రీలు విడాకులు పొందటానికి కారణాలు ఏవి?

జ॥ హిందూస్త్రీ 1) భర్త మరొక స్త్రీతో సంభోగించుట 2) క్రూర హింస 3) 2స
పైకాలం భర్త ఆమెను నిరాదారణ చేయుట 4) భర్త మతం మార్చుకొను
5) భర్త మానసిక అస్వాస్థ్యం లేక మానసిక వ్యాధివల్ల అతనితో ఆమె కాపుర
చేయటం సహేతుకం కానపుడు 6) భర్త కుష్టువ్యాధి 7) భర్తకు యితరులను
సంక్రమించే సుఖవ్యాధులు 8) ప్రపంచం నుండి సన్యాసం 9) 7సం॥ పైగా అతి
జాడ తెలియకపోవటం 10) భార్యాభర్తలు కలసి ఉండాలని కాని విడిగా వుం
లని కాని కోర్టుతీర్పు యిస్తే తరువాత 1 సం కాలంలో ఇరువురు కలిసి కాపు
చేయనప్పుడు 11) తన పెళ్ళి అయిన తరువాత భర్త మాన భంగం, పురు
సంపర్కం, పశు సంపర్కం లాంటి నేరాలలో దోషి అయితే 12) క్రిమిన
కోర్టులో భార్యకు మనోవర్తి యిస్తే ఆ ఉత్తరువు తదుపరి ఒక సంవత్స
లేక సంవత్సరం పైగా యిద్దరి మధ్య లైంగిక సంపర్కం లేకుం
13) ఆమెకు 15 సం॥ నిండేలోగా వివాహం అయితే 18సం॥ నిండేలోగా ఆ
ఆ వివాహాన్ని తిరస్కరిస్తే 14) 1955 నాటికి అతనికి ఇద్దరు భార్యలు
రెండవ ఆమె జీవించివుంటే భార్య విడాకులను కోరవచ్చును. (హి.వి.
సెక్షను 13) అంతేకాక 1) సం॥ పైగా విడిగాయున్నామని 2) కలసి జీవి
లేకపోయామని 3) వివాహం రద్దుకు యిద్దరూ అంగీకరించారని ఉభయు
సమ్మతించి విడాకులు పొందవచ్చును. (హి.వి.శా. సెక్షను 13 బి)

ముసల్మాను స్త్రీ : భార్య విడాకులు పొందటానికి కారణాలు :- 1) భర్తజా
4సం॥ తెలియకపోతే 2) 2సం॥ పోషించకపోతే, ఆమెను నిర్లక్ష్యం చేస్తే 3) భర్త
7సం॥ గాని అంతకు పైగాని జైలు శిక్ష పడితే 4) సహేతుకమయిన కారణం లేకుం
ఆమెతో సంసారం చెయ్యకపోతే 5) పెళ్ళినాడు, దావానాడు అతడు నపుంసకుడు
వుంటే 6) 2సం॥ కాలం పిచ్చివాడుగా వుంటే లేక కుష్టు, సుఖవ్యాధులకు లోనయి
7) భార్యకు 15 సం॥లోగా పెండ్లి అయితే, శోభనంకాని పరిస్థితిలో 18 సం॥ నిం
లోగా ఆమె పెళ్ళిని కాదంటే 8) ఆమెను క్రూరంగా హింసిస్తే 9) ముస్లిం శాస్త్రప్రకా
విచ్ఛిత్తికి అవకాశమిచ్చే యితర కారణాలుంటే ఆమె విడాకులు కోరవచ్చును
(ముసల్మాను వివాహరద్దు శాసనం సెక్షను

స్త్రీ : విడాకుల విషయంలో ఆమె పట్ల వివక్షవుంది. అమె వ్యభిచా
కారణాన భర్త ఆమెనుండి విడాకులు పొందవచ్చు. కాని ఆమె

25ప్ర॥ స్త్రీలు విడాకులు పొందటానికి కారణాలు ఏవి?

జ॥ హిందూస్త్రీ 1) భర్త మరొక స్త్రీతో సంభోగించుట 2) క్రూర హింస 3) 2స॥ పైకాలం భర్త ఆమెను నిరాదారణ చేయుట 4) భర్త మతం మార్చుకొనుట 5) భర్త మానసిక అస్వాస్థ్యం లేక మానసిక వ్యాధివల్ల అతనితో ఆమె కాపురం చేయటం సహేతుకం కానపుడు 6) భర్త కుష్టువ్యాధి 7) భర్తకు యితరులనుంచి సంక్రమించే సుఖవ్యాధులు 8) ప్రపంచం నుండి సన్యాసం 9) 7సం॥ పైగా అతని జాడ తెలియకపోవటం 10) భార్యాభర్తలు కలసి ఉండాలని కాని విడిగా వుండాలని కాని కోర్టుతీర్పు యిస్తే తరువాత 1 సం కాలంలో ఇరువురుకలిసి కాపురం చేయనప్పుడు 11) తన పెళ్ళి అయిన తరువాత భర్త మాన భంగం, పురుష సంపర్కం, పశు సంపర్కం లాంటి నేరాలలో దోషి అయితే 12) క్రిమినల్ కోర్టులో భార్యకు మనోవర్తి యిస్తే ఆ ఉత్తరువు తదుపరి ఒక సంవత్సరం లేక సంవత్సరం పైగా యిద్దరి మధ్య లైంగిక సంపర్కం లేకుంటే 13) ఆమెకు 15 సం॥నిండేలోగా వివాహం అయితే 18సం॥ నిండేలోగా ఆమె ఆ వివాహాన్ని తిరస్కరిస్తే 14) 1955 నాటికి అతనికి ఇద్దరు భార్యలుండి రెండవ ఆమె జీవించివుంటే భార్య విడాకులను కోరవచ్చును. (హి.వి.శా. సెక్షను 13) అంతేకాక 1) సం॥ పైగా విడిగాయున్నామని 2) కలసి జీవించలేకపోయామని 3) వివాహం రద్దుకు యిద్దరూ అంగీకరించారని ఉభయులు సమ్మతించి విడాకులు పొందవచ్చును. (హి.వి.శా. సెక్షను 13 బి)

ముసల్మాను స్త్రీ: భార్య విడాకులు పొందటానికి కారణాలు :- 1) భర్త జాడ 4సం॥ తెలియకపోతే 2) 2సం॥ పోషించకపోతే, ఆమెను నిర్లక్ష్యం చేస్తే 3) భర్తకు 7సం॥గాని అంతకుపైగాని జైలుశిక్ష పడితే 4) సహేతుకమయిన కారణం లేకుండా ఆమెతో సంసారం చెయ్యకపోతే 5) పెళ్ళినాడు, దావానాడు అతడు నపుంసకుడుగా వుంటే 6) 2సం॥ కాలం పిచ్చివాడుగా వుంటే లేక కుష్టు, సుఖవ్యాధులకు లోనయితే 7) భార్యకు 15 సం॥లోగా పెండ్లి అయితే, శోభనంకాని పరిస్థితిలో 18 సం॥ నిండే లోగా ఆమె పెళ్ళిని కాదంటే 8) ఆమెను క్రూరంగా హింసిస్తే 9) ముస్లిం శాస్త్రప్రకారం వివాహ విచ్ఛిత్తికి అవకాశమిచ్చే యితర కారణాలుంటే ఆమె విడాకులు కోరవచ్చును.

(ముసల్మాను వివాహరద్దు శాసనం సెక్షను 2)

క్రైస్తవ స్త్రీ : విడాకుల విషయంలో ఆమె పట్ల వివక్షవుంది. ఆమె వ్యభిచరించిందనే కారణాన భర్త ఆమెనుండి విడాకులు పొందవచ్చు. కాని ఆమెకు

4) ప్ర. వివాహం చేసుకున్న స్త్రీ: జిల్లాకోర్టుతో పిటీషను

5) ఎక్కడ? హిందూ స్త్రీ: వివాహమయిన ప్రదేశం, భర్తకాపురముంటున్న చోటు, చివరిసారిగా భార్యాభర్తలు కాపురముంటున్న ఊరు ఇవి ఏ కోర్టు పరిధిలో వుంటే ఆ కోర్టులో.

ప్ర.వి.శాసనం: హిందూ స్త్రీలవలె 3 చోట్లుకాక ఆ భర్త మరో దేశంలోవుంటే లేక 7 సం॥ జాడ తెలియక పోతే భార్య నివసించే చోట కోర్టులో పిటీషను దాఖలు చేయవచ్చును.

28ప్ర॥ నిరాదరణ చేసిన భర్తనుండి భార్య ఎలా మనోవర్తి రాబట్టుకోగలదు?

జ॥ రెండు విధాలుగా మనోవర్తి రాబట్టుకోగలదు క్రిమినలు కోర్టుద్వారా సెక్షను 125 క్రిందను, సివిలు కోర్టులో పిటీషనుద్వారా రాబట్టుకోవచ్చును.

29ప్ర॥ నిరాదరణ చేయబడిన భార్య తన మనోవర్తికోసం క్రిమినలు కోర్టు సెక్షను125 క్రింద దరఖాస్తు పెట్టుకోవచ్చునా?

జ॥ విచారించి కోర్టువారు నెలకు రు. 500 లకు మించకుండా మంజూరు చేయవచ్చును.

30ప్ర॥ ఏ పరిస్థితులలో హైందవ స్త్రీ మనోవర్తి కోరతగును?

జ॥ 1. సహేతుకమయిన కారణం లేకుండా, ఆమె సమ్మతి లేకుండా లేక ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా భర్త ఆమెను వదలివేసినా, లేక బుద్ధిపూర్వకంగా నిరాదరణ చేసినా;

2) తన భర్తతో కాపురం చేయటం ప్రమాదకరమనిగాని లేక నష్టదాయకమని ఆమెకు భావం కలిగేటట్లు భర్త ఆమె యెడ క్రూరంగా ప్రవర్తిస్తే

3) తీవ్రమయిన కుష్టు వ్యాధితో అతడు బాధపడుతుంటే;

4) అతనికి మరో భార్య జీవించి వుంటే;

5. ఆమె కాపురం వున్న ఇంటిలోనే భర్త తన ఉంపుడు కత్తెను తెచ్చిపెడ్తే లేక తన ఉంపుడు కత్తెతో మరో చోటఅలవాటుగా కాపురముంటే;

6. అతడు మతాంతరీకరణకు లోనయి హిందువుగా వుండక పోతే;

7. ఆమె వేరుగా ఉండటానికి దోహదం చేసే మరే ఏ ఇతర కారణం అయినా వుంటే భార్య భర్తనుండి మనోవర్తిని అడగవచ్చును. ఆమె శీలరహితురాలయినా లేక వేరొక మతాన్ని స్వీకరించినా ఆమెభర్త ఆమెకు మనోవర్తి చెల్లించనక్కరలేదు. (సెక్షను18 హిందూ దత్తత మరియి మనోవర్తి శాసనం)

ప్ర॥ ఏ లెక్కన హిందూ స్త్రీకి మనోవర్తిని కోర్టు యిస్తుంది?

జ॥ సమాజంలో పార్టీల హోదా, అంతస్తు వీటిని గమనించి, మనోవర్తి కోరేవారి అవసరాలను గుర్తించి, ఆమె భర్తనుండి వేరుగా వుంటుంటే అది సమర్థనీయమా అనే అంశాన్ని పరిగణనలోకి తీసుకొని, ఆమెకు ఆస్తిపైరాబడి, సంపాదన లెక్కకట్టుకొని భర్తవద్దనుండి భరణం పొందగలవారి సంఖ్యను సరిచూచికొని ఆమెకు చెల్లించవలసిన మనోవర్తిని కోర్టు నిర్ణయిస్తుంది.
(సెక్షను 23పై శాసనం).

31 ప్ర॥ కోర్టు వారు యిచ్చిన మనోవర్తి హైందవ మహిళకు ఎంతకాలం వస్తుంది?

జ॥ ఆమె హిందువుగా వున్నంతవరకు (సెక్షను 24) లేక కోర్టువారు ఉత్తరువును మార్చే వరకు (సెక్షను 25) వస్తుంది.

32 ప్ర॥ ముస్లిం భార్య ఎన్ని విధాలుగా మనోవర్తి పొందగలదు?

జ॥ మూడు రకాలుగా. 1) మత ధర్మ శాస్త్ర ప్రకారం 2) భర్తతో చేసుకున్న ఒప్పందం ప్రకారం 3) క్రిమినలు కోర్టులో.

1) ధర్మ శాస్త్ర ప్రకారం: తనను పోషించుకోటానికి సొంత సంపత్తి లేనపుడు ఆమె పోషింపబడాలి. అయితే యీ దిగువ షరతులను ఆమె పూర్తిచేయగలిగి వుంటేనే ఆమెకు ఆ హక్కు వుంటుంది 1) తన భర్తకు లైంగిక సంపర్కం ప్రసాదించగల వయస్సులో ఆమెవుండాలి. 2) సహేతుకమయిన కారణం వుంటే తప్ప ఆమె భర్త లైంగిక సంపర్కానికి అందుబాటులో వుండాలి. 3) సహేతుకమయిన కారణం వుంటే తప్ప ఆమె భర్తతో కాపురం వుండి అతని సహేతుక ఆజ్ఞలను పాటించాలి.

2) ఒప్పందం: భరణాన్ని గురించి ముందుగానే ఒప్పందం చేసుకుంటే ఆమె ఆ ప్రకారం మనోవర్తి పొందగలదు.

3) క్రిమినల్ కోర్టులో: హైందవ మహిళ వలె ఆమె క్రిమినలు ప్రొసీజర్ కోడ్ 125 వ సెక్షను క్రింద మనోవర్తి పొందవచ్చు.

32ప్ర॥ క్రైస్తవ స్త్రీ ఎలా మనోవర్తి పొందుతుంది?

1) హైందవ స్త్రీవలె క్రిమినలు కోర్టులో మనోవర్తి పొందవచ్చును.

2) భర్తనుంచి వేరుగా కాపురం వుండే హక్కును పొందేటప్పుడు, విడాకులు తీసుకునేటప్పుడు తాత్కాలిక లేక శాశ్వత మనోవర్తిని ఆమెకు కోర్టు వారు మంజూరు చేయవచ్చును.

33ప్ర॥ విడాకులు పొందిన భార్యకు మనోవర్తి వస్తుందా?

ఈమెకు కూడా క్రిమినల్ ప్రొసీజరు కోడు క్రింద మనోవర్తి వస్తుంది. అయితే యీ మాత్రం ముస్లిం స్త్రీలకు వర్తించదు. వారిని తల్లిదండ్రులు, సోదరులు, ఆమె ఆస్తిని వారసులు వీరెవరికి సాధ్యం కాకపోతే మతధర్మ సంస్థ అయిన 'వక్ఫ్' బోర్డు పోషించాలి.

34ప్ర॥ తల్లిని ఎవరు పోషించాలి?

జ॥ మతాలను బట్టి వేరు వేరుగా పరిశీలిద్దాం.(ఎ)హిందూసంఘంలో i)హిందూశాస్త్ర ప్రకారం ఎంతదరిద్రుడయినా తల్లిని పోషించాలి. కుమారుడు లేక కుమార్తెపై ఆధారపడి జీవించేవారి జాబితాలో తల్లి కూడా వుంది. కుమారుడు, కుమార్తె చనిపోయినా వారి ఆస్తులను వారసత్వ రీత్యా పొందిన వారు ఆ ఆస్తి యొక్క ఆదాయంలోనుండి పోషించాలి. (సెక్షను22 హిందూ దత్తత మరియు మనోవర్తిశాసనం)

ii) క్రిమినల్ కోర్టులో తల్లి కుమారుని నుండి కుమార్తెనుండి మనోవర్తి కోరటానికి ఆమెకు హక్కువుంది. (సెక్షను 125 సి.ఆర్.పి.సి).

బి) ఇస్లాం: తల్లిదండ్రులను కుమారులు, కుమార్తెలు తాము బీదవారయినా, దరిద్రంలో లేకపోయినా పోషించాలి. తల్లి బీదదయితే-ఆమె అశక్తురాలు కాకపోయినా-కుమారుడు పోషించాలి. తల్లిదండ్రులను పోషించాల్సిన బాధ్యత కుమారులకు కుమార్తెలకు సమానంగా వుంది.

సి॥ క్రిమినల్ కోర్టుద్వారా తనను పోషించుకోలేని తల్లి సంతానం మనోవర్తిని తీసుకోగలదు,

వ తల్లికి కూడా అందరిలాగా క్రిమినలు కోర్టుద్వారా మనోవర్తి ది.

35ప్ర॥ 'మైనరు' అంటే ఎవరు? 'మేజరు' అంటే ఎవరు.

జ॥ 18సంవత్సరాలు నిండని స్త్రీకాని పురుషుడుకాని మైనరు క్రిందలెక్క. 18సంవత్సరాలు నిండితే మేజరుగా పరిగణింపబడతారు. కోర్టు ఒక మైనరుకు సంరక్షకుని నియమిస్తే ఆమైనరుకు 21సంవత్సరాలు నిండితేగాని ఆస్తి విషయంలో అతనిని మేజరుగా చూడరు.

36ప్ర॥ భారత మెజారిటీ శాసనం ఏ విషయాలకు వర్తించదు?

జ॥ దత్తత, వివాహం, విడాకులు యీ విషయాలలో ఆ శాసనం వర్తించదు.

37ప్ర॥ సంరక్షకులు ఎన్ని రకాలవారు.

జ॥ 1) సహజ సంరక్షకులు 2) వీలునామాద్వారా నియమింపబడినవారు 3) కోర్టు ద్వారా నియమింపబడినవారు 4) ఇతరుల నియామకం లేకపోయినా అనుభవంలో ఆచరణలో సంరక్షకునిగా సంచరించే వారు.

38ప్ర॥ హిందువులలో తండ్రి జీవించి వుండగా తల్లి సంరక్షకురాలుగా వుండగలదా?

జ॥ తండ్రికి పిచ్చిలేనపుడు తండ్రియే సంరక్షకుడు. తల్లి పిల్లను, పిల్లవానిని కని పెంచినా ఆమెకు హక్కులేదు.

39ప్ర॥ హిందువులలో తండ్రి, తల్లి ఇద్దరూ లేకపోతే మైనరుకు ఎవరు సంరక్షకులు?

జ॥ కోర్టువారు సంరక్షకుని నియమిస్తారు.

40ప్ర॥ హిందువులలో మైనరు బాలికకు పెళ్ళి అయితే ఎవరు సంరక్షకులు?

జ॥ 18సం॥ నిండిన భర్త సంరక్షకుడు

41ప్ర॥ హిందువులలో తండ్రి మతం మార్చుకుంటే మైనరు పిల్లలకు సంరక్షకుడుగా వుండగలడా? మరి తల్లి విషయంలో ఏర్పాటు ఏమిటి?

జ॥ తండ్రి మతం మార్చుకున్నా సంరక్షకుడుగానే వుంటాడు. తల్లి మతం మార్చుకుంటే సంరక్షకురాలిగా వుండే హక్కు కోల్పోతుంది.

42ప్ర॥ హిందూ సమాజంలో భార్యాభర్త విడిపోతే తల్లి తన పిల్లకు, పిల్లవానికి సంరక్షరాలుగా అవుతుందా?

జ॥ కాదు. తండ్రియే సహజ సంరక్షకుడు. కాగా సర్వసామాన్యంగా మైనరుకు 5సం॥ నిండేవరకు పిల్లకాని పిల్లవాడు కాని తల్లిదగ్గర వుండవచ్చును. తల్లి నడత సరిగా వుంటే, 5సం॥లోపు సంతానాన్ని తనకు యిమ్మని తల్లి కోర్టు వారిని కోరవచ్చును.

48ప్ర॥ హిందూ సంఘంలో వీలునామా ద్వారా సంరక్షకుని ఎపుడు నియమిం వచ్చును ?

జ॥ తల్లి చనిపోయిన దరిమిలా తండ్రి తన వీలునామా ద్వారా తన మైనరు సం నానికి సంరక్షకులను నియమించవచ్చును. తల్లి బ్రతికివుండగా అలా వీలునా ద్వారా సంరక్షకుని ఏర్పాటు చేసినా అది చెల్లదు.

44ప్ర॥ కోర్టువారు సంరక్షకుని నియమించేటప్పుడు ఏ అంశాన్ని దృష్టిలో పెట్టుకోవా

జ॥ బిడ్డ శ్రేయస్సును గమనంలో వుంచుకోవాలి. కాస్త ఊహ తెలిసిన పిల్లలు వారి యిష్టా యిష్టాలను కోర్టు వారు లెక్కలోకి తీసుకుంటారు.

45ప్ర॥ అక్రమ సంతానానికి సంరక్షకులెవరు?

జ॥ తల్లి

46ప్ర॥ ముస్లింలలో సంరక్షకత్వ విషయమై ఎలా వుంది?

జ॥ సంరక్షకత్వం రెండు రకాలు 1) పిల్లల స్వాధీనానికి( హిజ్నత్ ) సంబంధించి 2) ఆస్తికి సంబంధించినది. (i) సున్నీలలో బాలుడు 7 సం॥లు నిండేవర బాలిక రజస్వల అయ్యేవరకు వివాహిత అయినా కాకపోయినా తల్లి యిం బంధువుల ఆధీనంలో వుండాలి. ఆ బంధువులు తల్లి, తల్లితల్లి, తండ్రిత సోదరి, సోదరి కుమార్తె, పిన తల్లులు పెదతల్లులు; మేనత్తలు, తల్లితండ్ర మేనత్తలు - వీరు వరుస క్రమంలో సంరక్షకులుగా వుండటాని హక్కుదారులు.

వీరెవరూ లేకపోతే తండ్రి, తండ్రి తాలూకు బంధువులు సంరక్షకులుగా వుం గలరు. ఈడేరిన బాలిక వివాహిత అయితే భర్త ఆమెకు సంరక్షకుడ అక్రమ సంతానం విషయంలో 7సం॥ వరకు తల్లి, తరువాత మైనరు కోరిక అనుసరించి తల్లిదండ్రులలో ఒకరు

పైన పేర్కొనబడిన సంరక్షకులు లేకపోతే కోర్టువారు సంరక్షకుని నిం మిస్తారు. షియాలలో 2సం॥లోపు బాలునికి 7సం॥ బాలికకు తల్లి అధిక హక్కు కల వ్యక్తి.

47ప్ర॥ ముస్లింలలో ఆస్తి విషయంలో సంరక్షత్వం విషయంగా ఏర్పాట్లు ఏవి?

జ॥ 1) లా ప్రకారం సంరక్షకులు. 2) కోర్టులో నియమింపబడేవారు 3) వా. వానికి సంరక్షకులు. లా ప్రకారం సంరక్షకులు రెండు రకాలు 1) సహ సంరక్షకులు 2) వీలునామా వల్ల నియమింపబడేవారు.

తల్లి సహజ సంరక్షకుల జాబితాలో లేదు. తండ్రి, తండ్రివీలునామాలో పేర్కొనబడినవారు అలాంటి వారు. తల్లికి స్థానంలేదు. ఆమె కోర్టుద్వారా మాత్రమే సంరక్షకురాలు కాగలదు.

48ప్ర॥ క్రైస్తవులకు వర్తించే శాసనం ఏది?

జ॥ గార్డియన్ అండ్ వార్డ్సు ఆక్టు. తండ్రి, తల్లి లేనపుడు, ఉన్నవారిని తొలగించ వలసి వచ్చినపుడు, ఈ శాసనంక్రింద సంరక్షకులను నియమించవచ్చును.

49ప్ర॥ ముస్లింలు, క్రైస్తవులు దత్తత చేసుకోవచ్చునా?

జ॥ ముసల్మానులు, క్రైస్తవులు పిల్లలను దత్తు చేసుకొనటానికి వీలు లేదు. వారి సమాజాలలో దత్తు అనేదలేదు.

50ప్ర॥ హిందువులు ఎవరిని దత్తుచేసుకోవచ్చు.

జ॥ బాలుని గాని బాలికను గాని దత్తుచేసుకోవచ్చును.

51ప్ర॥ ఎవరు దత్తుచేసుకోవచ్చును.

జ॥ పురుషుడు భార్య సమ్మతితో తనకు బాలుని / బాలికను దత్తుచేసుకోవచ్చును. భార్య భర్త సమ్మతితో తనకు దత్తుచేసుకోరాదు. సన్యాసి అయినవాని భార్య, మతాంతరుని భార్య, మతి స్థిమితం లేనివాని భార్య అవివాహితస్త్రీ, విడాకులు పొందినస్త్రీ, వితంతువు బాలునిగాని బాలికనుగాని దత్తుచేసుకోవచ్చును.

52ప్ర॥ ఎట్టి పరిస్థితుల్లో దత్తు చేసుకోవచ్చును?

జ॥ కుమారుడు లేక కుమారుని కుమారుడు కుమారుని కుమారుని కుమారుడువున్న వ్యక్తి బాలుని దత్తుచేసుకోరాదు 15 సం॥ వయస్సు పూర్తికాని బాలుని, అవివాహితుని దత్తుచేసుకోవచ్చును. కులాచారం, వంశాచారం వుంటే యీ షరతులు పాటించనక్కరలేదు పురుషుడు స్త్రీని దత్తుచేసుకో దలిస్తే ఆమె కన్న అతనికి 21సం॥ ఎక్కువ వయస్సు వుండాలి. స్త్రీ పురుషుని దత్తు చేసుకోదలిస్తే ఆ పురుషునికన్న ఆమెకు 21సం॥ ఎక్కువ వయసు వుండాలి.

53ప్ర॥ ఎవరు తమ సంతానాన్ని దత్తు యివ్వవచ్చును?

జ॥ తల్లి సమ్మతి లేకుండా ఏ తండ్రి తన సంతానాన్ని దత్తు ఇవ్వరాదు. తండ్రి మరణించినపుడు, తండ్రి సన్యాసి అయినపుడు తల్లి తన సంతానాన్ని దత్తు యివ్వవచ్చును. దత్తత చేసుకోబడిన వ్యక్తి హిందువయి వుండాలి.

౭౬ ప్ర॥ దత్తు ఎలా జరగాలి ? ౯

జ॥ జనక తల్లిదండ్రులు పిల్లవానిని లేక పిల్లను దత్తుతల్లిదండ్రుల చేతిలో పెట్టాలి దత్తు యిస్తున్నామని జనక తల్లి తండ్రులు, తీసుకుంటున్నామని దత్తుతల్లి దండ్రులు చెప్పాలి. నలుగురు దస్కతు చేసిన దత్తపత్రిక రిజిష్టరు కావాలి.

౭౭ ప్ర॥ దత్తు ఫలితం ఏమిటి ?

జ॥ దత్తుడు దత్తు కుటుంబంలోకి వస్తాడు. దత్త పుత్రికకు జనక కుటుంబంలో సంబంధం తెగిపోతుంది.

# ఆస్తి: వారసత్వం

## హిందువులలో

౭౮ ప్ర॥ స్త్రీకి వుండే ఆస్తి ఎన్ని రకాలు

జ॥ 1) స్త్రీ ధనం 2) వారసత్వ రీత్యా వచ్చేది అని రెండురకాలు 3) ఇతరుల హక్కులకు వ్యతిరేకంగా నిర్ణీత కాలం అనుభవంలో వున్నది. స్త్రీ ధనం స్త్రీకి ఏర్పాటు చేసిన ఘనత హిందువులది. స్త్రీ ధనం అనేక రకాలుగా వుంది. 1)తల్లి, తండ్రి, బంధువులు, భర్త, పెళ్ళికిముందు, పెళ్ళి సమయంలో యిచ్చే నగలు, వస్తువులు బహుమతులు 2) స్త్రీధనపు వృద్ధివల్ల వచ్చేది 3) ఆమె సంపాదించుకున్నది. 4) ఇతరలు ఆమెకు దాన పూర్వకంగా యిచ్చినది.

2) వారసత్వ రీత్యా వచ్చే ఆస్తిపై యీనాడు ఆమెకు సంపూర్ణహక్కులు వుంటున్నాయి.

3) అలాగే ఇతరుల హక్కులకు వ్యతిరేకంగా 12సం॥ స్థిరాస్తి స్వాధీనము కలిగి వుంటే ఆ ఆస్తి ఆమెది అవుతుంది.

...లి యందు వివాహ స్త్రీకి హక్కువుందా?

... అది ఆమె తండ్రికి చెందుతుంది.

...పు ఆస్తి అంటే ఏమిటి?

...తండ్రినుండి, తండ్రి తండ్రినుండి వచ్చే ఆస్తి.

... ఏమిటి ?

...పాదించుకున్నది.

...తని స్వార్జితపు ఆస్తిలో అతడు బ్రతికి వుండగా ఆమెకు

31 ప్ర॥ తరువాత ఆమెకు ఎంత వస్తుంది.

జ॥ ఆయన తల్లి, భార్య (ఆమె), కుమార్తెలు, కుమారులు, సమానంగా వాటాలు తీసుకుంటారు. కుమారుడు కాని కుమార్తె కాని అతడు చనిపోయేనాటికే చని పోయి వుంటే ఆ కుమారులు లేక కుమార్తె సంతానం, భార్యలేక భర్త కలసి చనిపోయిన కుమారుడు లేక కుమార్తె వాటా తీసుకుంటారు.

32 ప్ర॥ ఒక పురుషునికి స్వార్జితపు ఆస్తి వుంటే, అతడు బ్రతికి వుండగా, అందులో అతని కుమారునకు కుమార్తెలకు వాటాలు ఉంటాయా?

జ॥ లేవు కాకపోతే మైనర్లయితే మనోవర్తి పొందే హక్కు వుంటుంది.

68 ప్ర॥ పురుషుని పిత్రార్జితపు ఆస్థిలో అతడు బ్రతికి వుండగా ఎవరికి హక్కులు వున్నాయి?

జ॥ భార్యకులేదు. ఆంధ్రప్రదేశ్‌లో అయితే కుమారులకు కుమార్తెలకు అతనితో సమానంగా జన్మతః హక్కువుంది. ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు వుంటే వారు మొత్తం ఆరుగురు, అతడు కలసి ఏడుగురు సమానవాటాలు కలిగి వుంటారు. అతడు జీవించివుండగానే వారు పంపిణీ చేసుకోవచ్చును.

64 ప్ర॥ ఒక పురుషునికి పిత్రార్జితపు ఆస్తివుంది. అతడు వీలునామా వ్రాయకుండా చనిపోయాడు, అతడు చనిపోయే నాటికి అతనికి ముగ్గురు కుమారులు ముగ్గురు కుమార్తెలు, భార్య, తల్లి వున్నారు. వారికి వాటాలు ఎలా వస్తాయి?

జ॥ అతని పేరనున్న పిత్రార్జితపు ఆస్థిలో జన్మతః కుమార్తెలకు, కుమారులకు, అతనికి వాటాలున్నాయి. అంటే ఒక్కొక్క కూతురుకు, లేక కుమారునికి 1/7 వంతు జన్మతః వాటా. అతడు చనిపోయేనాడు అతడు వారితో విభక్తు డంటూ చనిపోయినట్లు ఎంచుకోవాలి. అతని 1/7 వంతు వాటాను మరల కుమారులు, కుమార్తెలు, భార్య, తల్లి సమానంగా పంచుకుంటారు. ఒక్కొక్కరికి $1/7 \times 1/8 = 1/56$ వంతు వస్తుంది. కనుక ప్రతి కుమారునికి లేక కుమార్తెకు $1/7 + 1/56 = 8 + 1/56 = 9/56$ వాటా ముగ్గురు

కుమార్తెలకు $= 3 \times 9/56 = 27/56$

అలాగే ముగ్గురు కుమారులకు $= 3 \times 9/56 = 27/56$

తల్లికి $1/7 \times 1/8 = 1/56$

భార్యకు $1/7 \times 1/8 = 1/56$

65ప్ర॥ భార్యకన్నా అతని సంతానానికి ఎక్కువ వాటా రావడం అన్యాయం కాదా?

జ॥ నిస్సందేహంగా. ఏ భార్య అయితే అతని పిత్రార్జితపు ఆస్తి పెంపుదలకు సాయపడిందో, ఏ భార్య లేకపోతే సంతానమేలేదో ఆమెకు కుమారుని కన్నా, కుమార్తెకన్నా వాటా విపరీతంగా తక్కువ. పై ఉదాహరణలో కుమారునికి లేక కుమార్తెకు 9/56 వంతువస్తే ఆమెకు 1/56 వంతు వస్తుంది.

66ప్ర॥ పైన యిచ్చిన ఉదాహరణలో కేంద్ర వారసత్వశాసనం ప్రకారం ఎవరికి ఎంత వస్తుంది?

జ॥ కేంద్ర శాసనం ప్రకారం కుమారులకు మాత్రమే తండ్రి పిత్రార్జితపు ఆస్తిలో పుట్టుకతో వాటావుంది. అంటే ముగ్గురు కుమారులకు, చనిపోయిన పురుషునికి సమాన వాటాలు వున్నట్లు లెక్క.

అంటే ప్రతి కుమారునికి జన్మతః 1/4 వాటా
అతడు చనిపోయేనాటికి అతడు విభక్తుడయినట్లు లెక్క.
అతడు చనిపోయిన పురుషుని వాటా = 1/4
దానిని ముగ్గురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు, అతని భార్య, తల్లి మొత్తం 8 మంది పంచుకుంటారు.

అంటే ప్రతి కుమారునికి లేక కుమార్తెకు $1/4 \times 1/8 = 1/32$ వస్తుంది.

జన్మతః వచ్చింది 1/4
వారసత్వంగా వచ్చింది 1/32
$1/4 + 1/32 = (8+1)/32 = 9/32$
ముగ్గురు కుమారులకు $= 3 \times 9/32 = 27/32$
ముగ్గురు కుమార్తెలకు $3 \times 1/32 = 3/32$
తల్లికి = 1/32
భార్యకు 1/32

మార్తెలకు ఆంధ్రప్రదేశ్ సవరణ శాసనం ప్రకారం జన్మతః హక్కులు భార్య వాటా తగ్గుతున్నది కదా?

తగ్గుతున్నది. పై ఉదాహరణలో కేంద్ర శాసనం ప్రకారం భార్యకు 1/32 వస్తే ఆంధ్రప్రదేశ్ సవరణ శాసనం ప్రకారం 1/56 మాత్రమే వస్తుంది. భార్య పరిస్థితి మరీ క్షీణించింది. ఇది అన్యాయమే.

68ప్ర॥ దీనిని ఎలా సమర్థిస్తున్నారు?

జ॥ భార్య తన పుట్టింటిలో కూతురుగా వాటా తెచ్చుకుంటుంది కదా అని వాదన చేస్తారు. పుట్టింటివారు బీదవారు, ఆస్తి లేని వారు అయితే భర్తకు పిత్రార్జితపు ఆస్తి ఎంత వున్నా ఆమెకు చెప్పుకోతగ్గ వాటా రాదు. అందుకే యిది ఘోరమంటున్నాం.

69ప్ర॥ హిందూ స్త్రీ వీలునామా రాయకుండా చనిపోతే ఆమె ఆస్తి ఎలా ఎవరికి సంక్రమిస్తుంది?

జ॥ ఆమె ఆస్తిని కుమారులు, కుమార్తెలు, భర్త సమానంగా పంచుకుంటారు. ముందుగా చనిపోయిన కుమార్తె సంతతి, ముందుగా చనిపోయిన కుమారుని సంతతి వరుసగా ముందుగా చనిపోయిన కుమార్తె లేకముందుగా చనిపోయిన కుమారుని వాటాను పొందుతారు. ఉదాహరణకు ఆమె చనిపోయేనాటికి ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, భర్తవుండి అంతకు ముందు సంతానంవున్న కుమారుడు, సంతానంవున్న కుమార్తె చనిపోతే ఆమె ఆస్తిని భర్త ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, చనిపోయిన కుమార్తె సంతానం అంతా కలసి ఒక వాటా, చనిపోయిన కుమారుని సంతానం అంతాకలసి ఒక వాటా అందరూ వాటాలు తీసుకుంటారు.

బ్రతికి వున్న ప్రతికుమారునికి 1/7 వాటా వస్తుంది.

,, ఇద్దరు కుమారులకు $2 \times 1/7 = 2/7$

,, ప్రతి కుమార్తెకు 1/7

,, ఇద్దరు కుమార్తెలకు $2 \times 1/7 = 2/7$

చనిపోయిన కుమార్తె సంతానానికి కలసి 1/7

,, కుమారుని సంతానానికి కలసి 1/7

,, భర్తకు = 1/7

70ప్ర॥ స్త్రీకి తండ్రి వద్ద నుండి వచ్చిన ఆస్తివుండి ఆమెకు సంతానం లేకుండా చనిపోతే ఆమె ఆస్తి ఏమవుతుంది?

జ॥ ఆస్తి ఆమె భర్తకు రాదు ఆమె తండ్రి వారసులకు పోతుంది.

71ప్ర॥ స్త్రీకి భర్త వద్దనుండి లేక భర్త తండ్రివద్దనుండి వచ్చిన ఆస్తివుండి ఆమెకు ఆమెకు సంతానం లేకపోతే ఆమె ఆస్తి ఏ వారసులకు పోతుంది?

జ॥ భర్తవారసులకు పోతుంది.

## ముసల్మానులలో

72ప్ర॥ మహమ్మద్ ప్రవక్త స్త్రీలకు మేలు చేశాడా?

జ॥ ఆయనకాలం నాటికి ఆడపిల్లలను పుట్టగానే చంపేవారు. అలా చంపవద్దు కట్టడిచేసి వారికి వారసత్వ రీత్యా వాటాలు యిచ్చాడు. ఇది గొప్పవిషయం

73ప్ర॥ ముసల్మానులందరికి ఒకే ధర్మ శాస్త్రమా?

జ॥ సున్నీలకు, షియాలకు వారసత్వ విషయంగా తేడాలున్నాయి.

74ప్ర॥ ముసల్మాను పురుషుడు చనిపోతే ఆస్తి ఎలా సంక్రమిస్తుంది?

జ॥ ముసల్మాను పురుషుడు చనిపోతే భార్యకు, తల్లికి, తండ్రికి నిర్ణీత వాటా ఉంటాయి. అవిపోను మిగతా దానిని తతిమ్మా వారసులు పంచుకుంటారు.

సున్నీలలో పిల్లలువుంటే భార్యకు 1/8 పిల్లలు లేకపోతే భార్యకు 1/4, ఎక్కువ మంది భార్యలుంటే అందరికీ కలిపి 1/8 వంతు.
తల్లికి: చనిపోయిన అతనికి సంతానం వుంటే 1/6వంతు

చనిపోయిన అతనికి సంతానం/కుమారుని సంతానం/కుమారుని కుమారు సంతానం/ఇద్దరు సోదరులు/ఒక సోదరుడు/సోదరి లేకుంటే మరియు భార్య భర్త, తండ్రి వుంటే భార్య భర్త వాటా పోను మిగతా దాంట్లో 1/3 వంతు

1) తండ్రి: కుమారుడు, కుమారుని కుమారుడు, కుమారుని కుమారుని కుమారుడు ఉంటే తండ్రికి 1/6 వంతు వాటా వుంటుంది.

2) కుమార్తెలు ఉన్నా, కుమారుని కుమార్తెలు, కుమారుని కుమారుని కుమార్తెల వగయిరాలు వున్నా తండ్రికి 1/6 వాటా వస్తుంది.

మిగతాదానిని కుమార్తెలు తమ అన్నదమ్ములతో కలసి పంచుకుంటారు.
కుమారుని వాటా = ఇద్దరు కుమార్తెల వాటా.

పురుషుడు = ఇద్దరు స్త్రీలతో సమానం.
...డు లేకుండా ఒక్క కుమార్తె ఉంటే ఆమెకు 1/2
ఇద్దరు కుమార్తెలు వుంటే అందరికి కలిపి 2/3
...నులు, భర్త, సంతానం వుంటే 1/4
లేక భర్త మాత్రమే వుంటే 1/2

## క్రైస్తవం

75ప్ర॥ వారసత్వం ఏ శాసనం ప్రకారం నడుస్తుంది?

జ॥ భారతీయ వారసత్వ శాసనం 1925

వీలునామా రాయకుండా క్రైస్తవ పురుషుడు చనిపోతే అతనికి సంతానం, భార్యవుంటే భార్యకు 1/3, కుమారులకు కుమార్తెలకు 2/3వస్తుంది. కుమారులు కుమార్తెలు సమానంగా పంచుకుంటారు. సంతానం లేక భార్య దగ్గర బంధువులు వుంటే ఆమెకు 1/2 వంతు మిగతా సగం బంధువులకు పోతుంది. సమీప బంధువులు లేకపోతే మొత్తం ఆస్థి భార్యకు చెందుతుంది.

## గర్భస్రావం

76ప్ర॥ స్త్రీకి బిడ్డలు కనడానికి కనకుండా వుండడానికి హక్కు వుందా?

జ॥ ఉంది. నవ మాసాలు బిడ్డను గర్భంలో మోసేది ఆమె. కనిన తరువాత పాలిచ్చి పెంచేది ఆమె.

77ప్ర॥ మరి అలా అయితే గర్భస్రావం నేరంగా ఎందుకు పరిగణించారు.

జ॥ ఇది పురుషాధిక్య సమాజం. అందువలన మానవజాతి మనుగడకోసం ఆమె పిల్లలను కనవలసిందేనని సమాజం స్త్రీని ఆదేశించింది. శిశువును కన్న స్త్రీని మాతృమూర్తి అని పొగిడింది. గొడ్రాలు అయిన స్త్రీని విరసించింది. ఆమె కోరుకొనని గర్భం వచ్చినా, అత్యాచారానికి గురి అయి గర్భం దాల్చినా గర్భాన్ని ఆమె వదిలించుకోరాదని ఆజ్ఞ జారీ చేసింది. అందువల్ల శాసనం రీత్యా గర్భస్రావాన్ని నిషేధించింది

78ప్ర॥ స్త్రీ గర్భ స్రావం చేయించుకోడానికి ప్రభుత్వం అవకాశం యిచ్చిందా?

జ॥ 'గర్భాన్ని వైద్యపరంగా అంతమొందించే శాసనాన్ని' భారత దేశం 1971లో ఆమోదించింది. జనాభా పెరుగుదల విపరీతం అవుతుండే జనాభా నియంత్రణకు సాయం చేసేదిగా యీ శాసనాన్ని రూపొందించారు. కుటుంబ నియంత్రణ కొరకు దీనిని ఉద్దేశించి రూపకల్పన చేశారు. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో, కొన్ని ప్రదేశాలలో అర్హత కలిగిన వైద్యులు గర్భస్రావాలు చేయటానికి యీ శాసనం ద్వారా అవకాశం కల్గింది. ఏ పరిస్థితుల్లో, ఏ దశలో వున్నపుడు వైద్యులు గర్భస్రావం చేయగలరో యీ శాసనంలో వివరించడం జరిగింది.

79ప్ర॥ ఈ శాసనం ప్రకారం వైద్యుడు స్త్రీకి గర్భస్రావం చేస్తే అది నేరమా?

జ॥ కాదు. మామూలు గర్భస్రావ నేరాలు అతనిని బాధించవు. (సెక్షను3(1))

80ప్ర॥ ఎవరు గర్భస్రావం చేయగలరు ?

జ॥ 12వారాలకు మించని గర్భం అయితే ప్రభుత్వ ఆమోదాన్ని పొంది రిజిష్టరులో నమోదయిన ఒక వైద్యుడు, 12వారాలకు మించి 20వారాలకు మించని గర్భం అయితే ఇద్దరు ప్రభుత్వ ఆమోదాన్ని పొంది నమోదు అయిన వైద్యులు గర్భిణీ స్త్రీని పరీక్ష చేసి శ్రద్ధాజాగ్రత్తలతో యీ దిగువ అభిప్రాయాలకు వచ్చినపుడు గర్భస్రావ ప్రయత్నానికి పూనుకోవచ్చును అయితే ఆ వైద్యులకు ప్రసవశాస్త్రంలోను, స్త్రీల వ్యాధుల పరంగాను శిక్షణ అనుభవం వుండాలి. 1) గర్భిణీని కొనసాగనిస్తే స్త్రీ జీవితానికి ప్రమాదం సంభవిస్తుందని, 2) ఆమె శారీరక మానసిక ఆరోగ్యాలకు తీవ్రమయిన హాని కలుగుతుందని, 3) శిశువు జన్మించిన తరువాత ఆ బిడ్డ శారీరక మానసిక అస్వస్థకు లోనవుతుందని. వైకల్యం వలన తీవ్రమయిన ఇబ్బందికి లోనవుతుందని వైద్యులు అభిప్రాయ పడితే గర్భస్రావం చేయవచ్చును. (సెక్షను 3 (2)). మానభంగానికి గురి అయిన స్త్రీ గర్భం ధరిస్తే, ఆ గర్భంవల్ల ఆమె మానసిక వ్యధకు లోనయితే అది తీవ్రమయిన హానిని ఆమెకు కల్గించేదిగా ఎంచబడును (3వ సెక్షను వివరణ 1). ఒక వివాహిత స్త్రీగాని ఆమె భర్తగాని జన్మ నిగ్రహ సాధనాలు వాడుతున్నపుడు ఆసాధనాలు విఫలమయి ఆమెకు గర్భం వస్తే ఆమెకు కల్గే మానసిక వ్యధ ఆమె మానసిక ఆరోగ్యానికి భంగకరమని భావించవచ్చు. (3వ సెక్షను వివరణ 2). గర్భిణీ స్త్రీ చుట్టూవున్న పరిసరాలను, ఆమె పరిస్థితులను, వాతావరణాన్ని, ముందు ముందు ఏర్పడబోయే పరిణామాలను లెక్కలోనికి తీసుకోవలెను (సెక్షను 3 (3). 18సం॥ నిండిన వయస్సు కల స్త్రీ సమ్మతిని పొందవలెను. ఆమె మనస్చాంచల్యం కల వ్యక్తి అయినా, మైనరయినా ఆమె సంరక్షకుని సమ్మతిని వైద్యులు పొందవలెను (సెక్షను3(4)ఎ). పైన ఉటంకించబడిన పరిస్థితుల్లో తప్ప ఆమెకు గర్భ విచ్ఛిత్తి చేయరాదు (సెక్షను 3 (4) బి) ఆస్పత్రులలో. ప్రభుత్వం ఆమోదించిన స్థలాల్లో అంటే ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో తప్ప యితర చోట్ల గర్భస్రావ ఆపరేషనులు చేయరాదు [సెక్షను 4 (ఎ) మరియు సెక్షను 4 (బి)] గర్భిణీ స్త్రీ గర్భాన్ని అంతం చేయకపోతే ఆమెకు ప్రమాదమని రిజిష్టరు చేయించుకున్న వైద్యుడు తలిస్తే ఆమెకు గర్భస్రావం చేయటం తప్పుకాదు [సెక్షను 5 (1)]. రిజిష్టరు కాని వైద్యుడు గర్భస్రావం చేస్తే అది నేరమే [సెక్షను 5 (2)]. సెక్షను 5లో చెప్పబడిన పరిస్థితుల్లో గర్భస్రావం చేసే వైద్యుడికి ప్రసవ శాస్త్రం,

స్త్రీల వ్యాధులు వీటిని గురించిన శిక్షణ అనుభవం ఉండనవసరం లేదు. అపుడు స్త్రీ ప్రాణాన్ని కాపాడటమే ముఖ్యం.

81ప్ర॥ గర్భస్రావం చేయించుకోడానికి 18సం॥ నిండిన వివాహిత యువతికి భర్త సమ్మతి కావలెనా?

జ॥ అక్కరలేదు. కాని స్త్రీ చదువు, అనుభవం లేనిదనే భావంతో వైద్యులు భర్త సమ్మతిని కోరుతున్నారు అది వారు తీసుకునే జాగ్రత్త చర్య మాత్రమే.

82ప్ర॥ భర్త సమ్మతి లేకపోయినా ఆమె సమ్మతితో వైద్యులు ఆమెకు గర్భస్రావం చేయవచ్చునా?

జ॥ చేయవచ్చును.

83ప్ర॥ చాల సందర్భాలలో వారు అలా చేయటం లేదు. ఎందువల్ల?

జ॥ ఇది పురుషాధిక్య సమాజం కనుక, పురుష ప్రాధాన్య సమాజం కనుక ఆ సమాజపు విలువలు యింకా అమలులో వున్నవి. అందుచేత భర్త సమ్మతి కావాలని వైద్యులు గర్భిణీ స్త్రీని ఒత్తిడి చేస్తున్నారు.

## వెట్టి చాకిరి

84ప్ర॥ స్త్రీలు భూస్వాముల యిళ్ళల్లో, యజమానుల యిళ్ళల్లో జీతం లేకుండా కూలి లేకుండా చాకిరీ చెయ్యాలా ?

జ॥ అక్కరలేదు. ఎవరూ ఎవరినీ బలవంతంగా, జీతంలేకుండా, కూలిలేకుండా, చాకిరీ చెయ్యమనటానికి హక్కులేదు. పూర్వం భూస్వాముల ఇళ్ళల్లో 'అడ పాపలు' వుండేవారు. అపద్ధతి పోయింది. 1976లో వెట్టి చాకిరీ నిర్మూలన చట్టంవచ్చిన తరువాత తాతతండ్రులు తాము చేసిన అప్పులకు బదులుగా కూలీలుగా,పాలేర్లుగా,కమతగాళ్ళుగా ఎవరూ పనిచేయనవసరం లేదు.

## ఉద్యోగాలు

85ప్ర॥ ఉద్యోగాల విషయంలో స్త్రీపురుషులందరికీ వర్తించే శాసనాలు ఏవి ?

జ॥ 1966లో వచ్చిన దుకాణాలు మరియు సంస్థలచట్టం, 1936లో వచ్చిన వేతనా చెల్లింపు చట్టం, 1948లో వచ్చిన కనీస వేతనాల చట్టం, 1952లో వచ్చిన ఉద్యోగుల ప్రావిడెంటు శాసనం, 1972లో వచ్చిన గ్రాట్యూటీ చెల్లింపుశాసనం స్త్రీపురుషులందరికీ వర్తిస్తాయి. ఫ్యాక్టరీల శాసనం, కార్మికుల నష్ట పరిహార శాసనం కూడా స్త్రీలకు కూడా వర్తిస్తాయి.

86ప్ర॥ భర్త ప్రభుత్వోద్యోగం లేక స్థానిక సంస్థల్లో, ప్రభుత్వ సంస్థల్లో ఉద్యోగం చేస్తుండే భార్యకు భర్త జీతంమీద హక్కు వుంటుందా ?

జ॥ భర్తపై మనోవర్తికి కోర్టు ఉత్తరువునుకాని డిక్రీనికాని పొందితే తప్ప ఆమెకు భర్త జీతంపై హక్కు వుండదు, తన జీతంలో కొంతభాగం తన భార్యకు యిమ్మని ఉద్యోగంచేసే పురుషుడు కోరితే యజమాని అంగీకరించి యిస్తే యివ్వవచ్చుగాని ఆమె హక్కుగా కోరటానికి (డిమాండు) వీలులేదు.

87ప్ర॥ భర్త గ్రాట్యూటీ భార్యకు వస్తుందా ?

జ॥ అతడు 5సంవత్సరాలు పనిచేస్తేగాని అతనిని ఉద్యోగ విరమణ చేసిన తరువాత వచ్చే గ్రాట్యూటీని ఇవ్వరు. ఫలానివారికి దానిని చెల్లించమని అతడు పేర్కొన వచ్చును. దానిని 'నామినేషను' అంటారు. అలా అతను పేర్కొనకుండా చనిపోతే భార్య,కుమారులు, కుమార్తెలు సమానంగా పంచుకుంటారు. భార్య పేరున నామినేషను చేయించుకోవటం భార్యచేయవలసినపని.

88ప్ర॥ ఉద్యోగం చాలించిన తరువాత ప్రభుత్వోద్యోగం వచ్చే (పెన్షను) భార్యకు వస్తుందా ?

జ॥ అతడు బ్రతికి వుండగా రాదు.

89ప్ర అతడు చనిపోయిన తర్వాత ఎవరికి వస్తుంది ?

జ॥ వయస్సు నిండిన సందర్భంలో పింఛను, ఉద్యోగ విరమణ పింఛను. 'అసమర్ధత పింఛను', 'నష్ట పరిహారపు పింఛను',దయతలచి యిచ్చే అలవెన్సు భృతి ఉద్యోగికి చెల్లింపబడుతుండే అవి భార్యకు యీదిగువ పరిస్థితిలో వస్తుంది. 1) వారివివాహం 29-10-79కి పూర్వం జరిగివుండాలి. 2) అది కుటుంబానికి వస్తుంది. భార్యకు, 21 సం॥ నిండని కుమారునికి, 24 సం॥ నిండని అవివాహిత కుమార్తెకు వస్తుంది. భార్య పునర్వివాహం చేసుకుంటే కుటుంబ పింఛను ఆమెకు ఆగిపోతుంది.

90ప్ర॥ భర్త భవిష్యనిధి (ప్రావిడెంటుఫండు) భార్యకు వస్తుందా ?

జ॥ అతడు ఎవరిని పేర్కొంటే (ఎవరిని నామినేటు చేస్తే) వారికి వస్తుంది. చేయకపోతే అది అతని వారసులకు చెందుతుంది. భార్య వారసులలో ఒకతే కనుక ఆమె పేర నామినేషను చేయించుకొనుట ఆమెకు శ్రేయస్కరం.

## ఉద్యోగాలు

91 ప్ర॥ స్త్రీలు ఏ ఉద్యోగాలను చేయడానికి అర్హులు ?

జ॥ సైన్యంలో పదాతి దళంలో యుద్ధంచేసే ఉద్యోగాలు, నౌకాదళంలో కొన్ని ఉద్యోగాలు స్త్రీలకు అందుబాటులో లేవు. తతిమ్మా అన్ని ఉద్యోగాలు చేయటానికి వారు తగినవారే

## షెడ్యూలు కులాల స్త్రీలు

92 ప్ర॥ షెడ్యూలు కులాల స్త్రీల హక్కులేవి ?

జ॥ 1956 పౌరహక్కుల రక్షణ శాసనం క్రింద అంటరానివారుగా పరిగణించటం నేరం. ప్రజలందరికీ ప్రవేశం కల స్థలాలలోకి షెడ్యూలు కులాలవారికి ప్రవేశం వుంటుంది. ప్రజలు వాడుకునే చెరువులు, బావులు వగయిరాలను వారూ వాడుకోవచ్చును. పూజలలో ఉత్సవాలలో వారు పాల్గొనవచ్చును. ఈ హక్కులు షెడ్యూలు కులాల స్త్రీ పురుషులందరికీ వర్తిస్తాయి.

93 ప్ర॥ షెడ్యూలు కులాలవారికిచ్చే ప్రత్యేక సదుపాయాలు, సౌకర్యాలు (రిజర్వేషన్లు) షెడ్యూలు కులాల స్త్రీలకు వర్తిస్తవా ?

జ॥ వర్తిస్తాయి ఉద్యోగాలు పొందటంలో, పై ఉద్యోగానికి ఎంపిక చేయబడటంలో (ప్రొమోషన్లలో), విద్యాలయాల్లో, శాసనసభల్లో వర్తించే ప్రత్యేక సౌకర్యాలు, సదుపాయాలు షెడ్యూలు కులాల స్త్రీలకు కూడా ఉంటాయి.

## ఉచిత న్యాయ సహాయం

94 ప్ర॥ ఉచిత న్యాయ సహాయం స్త్రీలకు వుంటుందా ?

జ॥ ఉచిత న్యాయ సహాయ నియమాలు స్త్రీపురుషులందరికీ ఒకే విధంగా వున్నాయి. 1987లో వచ్చిన న్యాయ సేవా సంస్థల శాసనం స్త్రీపురుష తేడా చూపదు.

95 ప్ర॥ ఆ సహాయం ఎవరికి ?

నెలకు 800 రూపాయలకు లోబడిన ఆదాయం, ఆరువేల రూపాయలలోపు ఆస్తి వున్నవారికి ఆ సహాయం యిస్తుంది ప్రభుత్వం.

96 ప్ర॥ ఈ సహాయాన్ని ఎవరు నిర్ణయిస్తారు ?

జ॥ రాష్ట్రస్థాయి బోర్డు, హైకోర్టు కమిటీ, జిల్లాకోర్టు కమిటీ నిర్ణయిస్తాయి.

సం॥ కఠిన శిక్ష, జరిమానా రెండూనూ విధించవచ్చు. (సెక్షను 493 భా.శి.స్మృతి) ఎవరికయినా భర్త లేక భార్య బ్రతికి వుండి వివాహమాడితే ఆ వివాహం చెల్లనిదయితే ఆ మనిషికి 7 సం॥లు ఖైదుగాని కఠినశిక్షగాని జరిమానా గాని వేయవచ్చు. (సెక్షను 494 భా.శి.స్మృతి) ఆంధ్రప్రదేశ్‌లో ఈ నేరాన్ని ఒకటవ క్లాసు మేజిస్ట్రేటు విచారించవచ్చు(1987 ఆం.ప్ర. ఆక్టు 46) సెక్షను 494 (భా.శి.స్మృతి).. నేరాన్ని రెండవసారి పెళ్ళాడిన వ్యక్తికి తెలియకుండా దాచిపెట్టే నిందితునికి 10 సం॥ మించని ఖైదు, జరిమానా, రెండు శిక్షలు (సెక్షను 495 భా.శి.స్మృతి)

ఒక మనిషి అవతలి వ్యక్తికి నష్టం లేక తనకు లాభం అక్రమంగా కలుగచేయాలనే ఉద్దేశించి లేక అవతలి మనిషిని మోసం చేయాలని ఉద్దేశించి అవతలి వ్యక్తితో వైవాహిక తంతులో పాల్గొంటే, తద్వారా శాసనసమ్మతమయిన వివాహం తనకు జరగటంలేదని అప్పుడు తెలిసివుంటే సెక్షను 496 (భా.శి.స్మృతి) క్రింద నేరం చేసినట్లు. ఇది రాజీపడటానికి వీలులేని నేరం.. శిక్ష 7 సం॥ జైలు, జరిమానా రెండూను. సెక్షను 497 (మరొకని భార్యతో వ్యభిచారం) ఏ స్త్రీ అయినా మరొకరి భార్య అయితే, మరొకరి భార్య అని అతడు నమ్మటానికి కారణం వుంటే ఆ స్త్రీని ఆమె భర్త వద్ద నుండి లేక ఆమె భర్త తరపున ఆమెను అధీనంలో వుంచుకున్న వ్యక్తి నుండి తీసుకొని వెళ్ళినా, లేక ఆకర్షించి ఎత్తుకొని పోయినా ఆమె ఇతరునితో అక్రమ లైంగిక సంపర్కం పొందాలని ఉద్దేశంతో లేక ఆమెను రహస్య స్థావరంలో దాచిపెట్టటం లేక ఆమెను కదలనీయకుండా చేయటం సెక్షను 498 భా.శి.స్మృతి క్రింద నేరం. శిక్షలు 2 సం॥మించని ఖైదు, జరిమానా రెండూను.

111.ప్ర॥ సెక్షను 498 లోని 'భర్త అధీనం', 'భర్త తరఫున ఇంకొకరి అధీనం' అనే పదజాలాలు వున్నాయి. అవి పాతకాలపు భావాలు కావా?

జ॥ అవును పాతకాలపు భావాలే, భార్య భర్త సొత్తు అనే భావం వాటిలో కన్పడుతున్నది.

112.ప్ర॥ సెక్షను 498(ఎ) (భా.శి.స్మృతి) స్వభావం ఏమిటి?

జ॥ ఎవరయినా ఒక స్త్రీ భర్త అయి యుండి లేక భర్త బంధువు అయి యుండి ఆ స్త్రీని క్రౌర్యానికి లోనుచేస్తే వారు శిక్షాపాత్రులు. శిక్ష 3 సం॥ మించని ఖైదు.

## స్త్రీ సంక్షేమం

101ప్ర॥ స్త్రీల సంక్షేమానికి ఉపయోగపడే సంస్థలు ఏవి ?

జ॥ ప్రభుత్వ మహిళా ప్రాంగణాలు, స్త్రీల ఆర్థిక కార్పొరేషను, స్త్రీలకు ధన సహాయంచేసే నిధులు, బాధిత మహిళలకు సెలవులు యిలాంటివి, స్త్రీలకు సాంకేతిక నైపుణ్యాన్ని అందించే విద్యాలయాలు, బీదరికనిర్మూలన పథకాలు, గ్రామపునర్నిర్మాణ పథకాలు, సామాజిక సంక్షేమ శాఖ అధ్వర్యాన నడిచే బాలికల వసతిగృహాలు, కేంద్ర సంక్షేమ బోర్డు సహాయాన్ని పొందే ప్రాజెక్టులు యివన్నీ స్త్రీలకు చేయూత నిస్తాయి. మహిళా సంఘాల భవనాల నిర్మాణానికి, చేతివృత్తులు అవలంబించే స్త్రీలకు పంచాయితీరాజ్ వ్యవస్థలోని సంస్థలు తోడ్పడతాయి.

## కార్మికుల నష్టపరిహార శాసనం

10 ప్ర॥ కొన్ని ఫ్యాక్టరీలలో పనిచేసే కార్మికులకు వర్తించే కార్మికుల నష్టపరిహార శాసనం స్త్రీ కార్మికులకు కూడా వర్తిస్తుందా ?

జ॥ వర్తిస్తుంది.

## మాతృత్వ సౌకర్యం (1961 శాసనం)

103ప్ర॥ ఇది ఎవరికి లభిస్తుంది ?

జ॥ గనులకు, ఫ్యాక్టరీలకు వర్తిస్తుంది. ప్రభుత్వం దీనిని వ్యాపార, పారిశ్రామిక, వ్యవసాయ సంస్థలకు, యితర సంస్థలకు వర్తింప చేయవచ్చును.

104ప్ర॥ ఎపుడు ఆమె యీ మాతృత్వ సౌకర్యం పొందగలదు ?

జ॥ ప్రసూతి తేదీకి ముందు 12 నెలలలో ఆమె 160 రోజులు పనిచేస్తేనే ఆమె యీ సౌకర్యాన్ని పొందగలదు.

105ప్ర॥ ఆమెకు కల హక్కులు ఏవి ?

జ॥ 1) ఆమె ఆరువారాల జీతం లేక కూలి మాతృత్వభృతిగా పొందగలదు. ఆమె ఆరువారాలు పనిచేయనక్కరలేదు గర్భస్రావం జరిగితే ఆరువారాలకు ఆమె జీతంతో సెలవు పొందవచ్చును. ప్రసవం తరువాత ఆమె పనిలోకి వస్తే పిల్లకు 15 నెలలు నిండేవరకు రోజుకు 2 సార్లు పిల్లకు పాలిచ్చే నిమిత్తం ఆమెకు నిర్ణీతమైన వ్యవధి యివ్వాలి ఇంకా శాసనంలో ఎన్నో నిబంధనలు వున్నాయి. శాసనాన్ని అన్ని యాజమాన్యాలకు, సంస్థలకు వర్తింప చేయటం అవసరం.

## కుటుంబ న్యాయస్థానాలు

106 ప్రశ్న 1984లో కుటుంబ న్యాయ స్థానాల శాసన వచ్చిందట దానిని మనరాష్ట్రంలో అమలు చేశారా ?

జ చెయ్యలేదు. చెయ్యమని మహిళోద్యమ కార్యకర్తలు, మహిళా సంస్థలు, స్త్రీలు కోరటం అవసరం ఆశాసనం స్త్రీలు ఎంతో మేలు కలిగించనది 'మహిళా కోర్టు గా పేర్కొనబడింది కుటుంబ న్యాయస్థానాల శాసనం క్రింద ఏర్పడి ది కాదు' కేవలం హైకోర్టు చర్యవల్ల పుట్టింది. అందులో మహిళ న్యాయమూర్తి గా ఉంటుంది. అంతకనా యితర న్యాయస్థానాలకూ, యీ మహిళాకోర్టుకూ తేడా లేదు. అధనపు అధికారాలు కల కోర్టు కాదు,

## బాలల శాసనం (1966)

107ప్రశ్న ఎంత వయస్సు వున్న స్త్రీ బాల క్రింద లెక్క ?

జ॥ 18 సం॥ నిండని స్త్రీ యీ శాసనం క్రింద బాలిక క్రిందలెక్క.

108ప్రశ్న ఏ బాలికలను నిర్బంధించవచ్చు ?

జ॥ 1) బిచ్చ మెత్తుకుంటున్న ఆడపిల్ల 2) అనాధ కాకపోయినా యిల్లు / స్థిర నివాసం/జీవనాధారం/దిక్కు లేక నిరాదరణకు గురి అయిన బాలిక, షరా॥ i) తల్లి, తండ్రి వున్నా పిల్లలను అదుపులో పెట్టలేక వారి భద్రతను గురించి పట్టించుకోని వారయితే ఆపిల్లలు నిర్లక్ష్యానికి గురి అయిన వారిక్రింద లెక్క ii) పడుపు గృహంలో నివసిస్తున్నా, వ్యభిచారులతో కలిసి తిరుగుతున్నా, లేక జీవిస్తున్నా, వ్యభిచారానికి వాడే ప్రదేశానికి తరచు వెళ్తున్నా, ఆ బాలిక లేక బాలుడు నిరాదరణకు గురి అయిన పిల్లలే.

9ప్రశ్న ఏ సంస్థలను యీ శాసనం క్రింద వదుపుతారు ?

జ॥ బాల బాలికల సంక్షేమ గృహాలు, ప్రత్యేక పాఠశాలలు, పరిశీలక గృహాలు, తరువాత జాగ్రత్త వహించే సంస్థలు నెలకొల్పబడినవి.

ప్ర॥ 18 సం॥ నిండని బాలిక నేరంచేస్తే కోర్టు ఏమి చేయవచ్చును ?

1) మందలించి యింటికి పంపవచ్చును. 2) 8 సం॥ సరిగా ప్రవర్తించే షరతుతో తల్లి / తండ్రి / సంరక్షకులు వీరివద్ద ఉండేటట్లు ఉత్తరువు యివ్వవచ్చును.

3) 14సం॥ నిండిన బాలికను లేక 16సం॥ నిండిన బాలుని 3 సంవత్సరాలకు తగ్గని కాలం ప్రత్యేక పాఠశాలకు పంపవచ్చును.

4) ఇతరత్రా వయస్సు వున్నవారికి కూడా ప్రత్యేక పాఠశాలకు పంపవచ్చును.

111ప్ర॥ ఎంత వయస్సు వచ్చేవరకు ప్రత్యేక పాఠశాలలో వుంచవచ్చును.

జ॥ బాలునికి 16 సం॥లు నిండిన తర్వాత, బాలికకు 20 సం॥లు నిండిన తర్వాత అక్కడ వుంచరాదు.

112ప్ర॥ ఈ శాసనపు అమలును ప్రభుత్వం శాసన సమ్మతంగా చేస్తున్నదా ?

జ॥ లేదు. వయస్సు నిండిన బాలబాలికలను ప్రత్యేక పాఠశాలలనుండి బయటకి పంపటంలేదు. దీనిని గురించి పౌరహక్కుల సంస్థలవారు, ఆ సంఘ సేవకులు ఆందోళన చేస్తున్నారు.

## జైళ్ళు

113 ప్ర॥ జైళ్ళలో వున్న స్త్రీలకు హక్కులున్నవా ?

జ॥ ఉన్నాయి. జైలులో వున్నంత మాత్రాన మనుష్యులుగా, పౌరులుగా వారికి వున్న హక్కులు పోవు. ఇలా సుప్రీంకోర్టు తీర్పు చెప్పింది.

114 ప్ర॥ స్త్రీఖైదీలకు జైలు నియమావళి ప్రకారం సౌకర్యాలు సరిగా అందుతున్నాయా ?

జ॥ కొన్ని సందర్భాలలో అందటంలేదు. బహిరంగజైలులో వుండే అవకాశం ఆడ ఖైదీలకు ఈనాడు లేదు.

115 ప్ర॥ ఖైదీలు న్యాయస్థానాలకు న్యాయం కోసం దరఖాస్తు చేసుకోవచ్చునా ?

జ॥ చేసుకోవచ్చును? ఖైదీ ఉత్తరాన్ని 'రిట్'గా హైకోర్టు సుప్రీకోర్టు స్వీకరించిన సందర్భాలు వున్నాయి. న్యాయం పొందడానికి ప్రజలందరికి (ఖైదీలకు, ఆడఖైదీలకు కూడా) వున్నది.

## ప్రజాహితవ్యవహారం

116 ప్ర॥ ప్రజాహిత వ్యవహారం అంటే ఏమిటి ?

జ॥ ప్రజాసమస్యలకు సంబంధించిన శాసనాల గురించి, ప్రభుత్వ చర్యల గురించి ప్రభుత్వసంస్థలు వగయిరాల కార్యనిర్వహణ గురించి న్యాయవాదులతో సహా పౌరులు 'రిట్'లు వేయవచ్చును. అలాంటి అవకాశాన్ని సుప్రీంకోర్టు కలుగ

చేసింది. ఇది సంతోషించ తగినదర్య, అయితే యిలా వ్యాజ్య గ్రంథం జరిపే చిత్తశుద్ధి కలవారయి ఉండాలి.

## పోలీసుశాఖ వారి స్త్రీల రక్షణ కేంద్రం (ఉమన్ ప్రొటెక్షను సెల్)

117 ప్ర॥ దీనిని ఎలా నెలకొల్పారు ?

జ॥ స్త్రీలకు సహాయం చేసేందుకు ప్రభుత్వ ఉత్తరువు ద్వారా పోలీసుశాఖ వారి స్త్రీల రక్షణ కేంద్రం హైదరాబాదులో నెలకొల్పబడింది. రాష్ట్రంలో ఇలాంటి కేంద్రం మరొకటి లేదు.

118 ప్ర॥ ఏ ఏ నేరాలను గురించి యీ కేంద్రం పట్టించుకుంటుంది ?

జ॥ కేవలం వైవాహిక సంబంధమైన నేరాలను యీ కేంద్రం చేపడుతుంది. అవి

1. వరకట్న వేధింపులు మరియు చిత్రహింసలు.
2. వరకట్న హత్యలు 3 వివాహ విషయమైన ఇతర నేరాలు ఆత్మ హత్యలకు ప్రేరేపించారనే నేరారోపణకు సంబంధించినవి.

'9 ప్ర॥ "సెల్" ఎలా పనిచేస్తుంది ?

జ॥ వైవాహిక సమస్యలు పరిష్కారం కాకపోతే భార్యా భర్తలను ఇరువురిని పిలిపించి 'సెల్' వారు రాజీ చేయటానికి ప్రయత్నిస్తారు. కుదరని పక్షంలో నిందితునిపై కేసు పెడతారు. వ్యవహారం 'సివిలు' స్వభావం కలిగి వుంటే న్యాయసహాయ కేంద్రానికి పంపుతారు నేర ప్రవృత్తి కల భర్తకు 'సెల్' బెదురు కల్గించింది.

'సెల్' కేసులను విచారించడానికి వారి ప్రత్యేక దర్యాప్తు సిబ్బంది లేదు. 'సెల్' కు తగినంత అధికారం లేదు. కాగా 'సెల్' అధిపతులకు పోలీసు అధికారులతో వ్యక్తిగతంగా వున్న పరిచయాల వల్ల వారు కొంత వరకు విజయవంతంగా పని చేయకల్గుతున్నది.

## ఆస్తులు సంపాదన

120 ప్ర॥ భార్య సంపాదనతో, ఆమె ఆస్తితో భర్తపేర ఆస్తిని కొనుగోలు చేస్తే భార్యకు హక్కు వుంటుందా ?

జ॥ ఉండదు: ఆస్తి ఎవరి పేరవుంటే వారిదే.

121 ప్ర॥ భార్య ఎలా జాగ్రత్త పడాలి ?

జ॥ భార్య తన సంపాదనతో, తన ఆస్తి మీద వరుమానంతో, తన ఆస్తిని మార్చుచేసి వచ్చేదానితో ఆస్తిని కొనేటప్పుడు తన పేరుతోనే కొనుక్కోవాలి భర్త పేరుతో కొనరాదు.

122 ప్ర॥ ఆస్తి భార్యభర్తల యిద్దరి పేర వుంటే వారి హక్కులు ఎలాగుంటాయి?

జ॥ విక్రయధనాన్ని ఎవరు ఎంత సమకూర్చారు అనే దానిని బట్టి ఆ నిష్పత్తిలో ఆ ఆస్తియందు హక్కులు ఏర్పడతాయి. విక్రయ ప్రతిఫలం ఎవరి వల్ల వచ్చింది అనే విషయమయి సాక్ష్యం లేనప్పుడు ఆ ఆస్తి యందుభార్యా భర్త యిద్దరికి సమానహక్కులు వుంటాయి.

123 ప్ర॥ ప్రభుత్వంచేత, ప్రభుత్వసంస్థలచేత గృహనిర్మాణ సంస్థచేత కేటాయించబడిన "ప్లాట్" లో ఇంటిలో హక్కులు ఎవరిపేర అవి కేటాయించ బడినవో వారికే ఉంటాయి. విక్రయ ధనాన్ని నేను సమకూర్చానని వ్యాజ్యం జరపటానికి యీ నాడు అవకాశంలేదు

జ॥ భార్యా భర్త : భర్త పేరున వున్న యింటిలో అతడు అద్దెక తీసుకున్న యింటిలో కలసి కాపురం చేస్తున్నా ఆమెకు ఆ యింటిలో హక్కు లేదు. భర్త యిల్లు ఖాళీచేసి వెళ్ళితే యింటి యజమాని మంచి వాడయి ఆమెక కిరాయిదారుగా గుర్తిస్తే తప్ప ఆమె ఆయింటిని ఖాళీచేయవలసిందే.

124 ప్ర॥ భర్త పేరనున్న బ్యాంకు అకౌంటులో, ఫిక్సెడు డిపాజిట్‌లో అతడు జీవించి వుండగా భార్యకు హక్కువుందా ?

జ॥ లేదు. అతడు ఆమెపేరన నామినేషన్ రాస్తే, అతని తదనంతరం అ ఆమెకు చెందుతాయి.

125. ప్ర॥ భార్య తన ఆర్థిక ప్రతిపత్తిని పెంచుకోవాలంటే, తన ఆర్థిక పరిస్థితి పదిల పరుచుకోవాలంటే ఏమి చేయాలి ?

జ॥ తన డబ్బును తన పేరుననే అకౌంటులో వేసుకోవాలి. ఫిక్సెడ్ డిపాజిట్‌లో దాచుకోవాలి భర్త సైకముతో అతని పేరనున్న బ్యాంకు అకౌంట్లకు, నిల్వ చేసిన ధనాలకు (ఫిక్సెడు డిపాజిట్లకు) తన భర్తచేత తన పేర నామినేషన్లను వేయించి బ్యాంకులో వాటిని నమోదు చేయించుకోవాలి.

126 ప్ర భార్యా భర్తలు ఎలా సమిష్టి అక్కౌంటును ఫిక్సెడ్ డిపాజిట్లను బ్యాంకుల పెట్టుకోవచ్చును వాటి సందర్భంగా కల్గే హక్కులేమిటి ?

జ॥ ఇద్దరి పేర సమిష్టి (జాయింటు) అకౌంటును పెట్టూ ఒకరుగాని ఒకరు చని పోతే రెండవవారు గాని పైకాన్ని తీసుకునే పద్దతి వుండాలని నమోదు చేస కోవచ్చును భర్తచనిపోతేభార్య, ఆమెచనిపోతేభర్త ఆపైకాన్ని తీసుకోగలరు కాగా ఇరువురు జీవించి వుండగా ఇరువురిలో ఏ ఒకరయిన పైకం తీసుక గలరు. ఖాతా ముగించేటప్పుడు ఇద్దరి దస్కతలు కావాలి.

2) ఖాతా పెట్టేటప్పుడు లేదా డిపాజిటు చేసేటప్పుడు వరుస సంఖ్యలో పేర్లు వ్రాసి 1 వ వారు, 1 వ వారు చనిపోతే రెండవవారు తీసుకొనే లాగున ఏర్పాట చేసుకోవచ్చును. అపుడు 1 వ వారయిన భార్య బ్రతికి వుండగా 2 వ వారుగా నమోదు చేయబడిన భర్తకు ఆ ఖాతాలోని / ఆ డిపాజిటులోని పైకంపై హక్కులేదు. ఖాతా దార్లలో 1వ వారు అక్కౌంటును ముగించవచ్చును.

3) ఖాతాను ఇద్దరు నిర్వహించే పద్దతిలో కాతాను ప్రారంభిస్తే చెక్కుమీద ఇద్దరు దస్కతు పెడితే తప్ప పైకం రాదు. కాతాను ముగించటానికి యిరువురి అంగీకారం కావాలి.

4) కాతాను 1, 2, 3, 4 వరుసలలో అందరి పేరున కాతాపెట్టి 2 వ వారికి, తరువాత బ్రతికి వున్న వారికి పైకం యిచ్చేలాగు రాయవచ్చును. 1 వ వారి పేరు గౌరవం కోసం వ్రాయటం జరుగుతుంది. కాతాను అందురు కలసి ముగింపు చేయాలి.

127 ప్ర స్త్రీకి భద్రత వుండాలంటే ఎలా ఏమి చేయాలి.

జ॥ ప్రాధాన్యతను బట్టి యీ దిగువ సూచింపబడిన పద్ధతులు వరుసగా చూప బడినవి.

1) భార్యతన పేర కాతా/డిపాజిటు వేసుకోవాలి తనభర్తపేరు తన సంతానం పేర/తల్లిలేక నామినేషను వేసి బ్యాంకులో నమోదు చేయించుకోవాలి. అపుడు ఆమె తదనంతరం కోర్టు ద్వారా వారసత్వ సర్టిఫికెట్టు పొంద కుండానే పైకము నామినేషను చేయబడినవారికి దక్కుతుంది.

2) భార్య తనపేరు 1 వ దిగా వ్రాసి తరువాత యితరులది వ్రాసి తనకు, తన తదనంతరం మిగతా వారికి చెందేలాగు కాతా/డిపాజిటు పెట్టుకోవచ్చును.

ఆమె గతిస్తే, అప్పుడు వారసత్వ సర్టిఫికెట్టులేకుండా వారు పైకం తీసుకో గలరు. కాని ఆమె జీవించివుండగా ఆమెదే పైకం.

3) భార్యా భర్తల యిద్దరిపేర ఖాతా/డిపాజిటు పెట్టుకొని సమిష్టిగానిర్వహించడం. ఇలాచేస్తే వారి మధ్య తగాదాలు వస్తే చిక్కులు వస్తని.

4) భార్యా భర్తలిద్దరి పేర ఖాతా పెట్టుకొని యిద్దరిలో ఏ ఒకరుగాని, ఒకరి తదనంతరం మిగతావారుగాని పైకం తీసుకొనేలాగు వ్రాసినా చిక్కు. భార్యా భర్తల మధ్య తగాదా వస్తే వారిలో తెలివి చురుకుదనం గలవారు రెండో వారికి తెలియకుండా మొత్తం పైకం తీసుకోవడానికి వీలు అవుతుంది. మామూలుగా భర్త తెలివిగలవాడున్నూ, చలాకీ వాడున్నూ, అయి వుంటాడు కనుక భార్య మోసపొయ్యే అవకాశం ఎక్కువ.

5) భర్తపేరు మొదటిదిగా భార్యపేరు రెండవదిగా వ్రాసి 1వ వారికి తదుపరి రెండవ వారికి అని ఖాతా/డిపాజిటు పెడితే భర్తదేఖాతాపై/డిపాజిటుపై సర్వాధికారం. అతడు బ్రతికి వుండగా ఆమెకు హక్కులేదు.

ప్ర॥ భార్య ఎందుకు మురిసిపోవాలి ?

జ॥ తన పేర ఖాతా/డిపాజిటు, లేక ఇద్దరి పేర అవి ఉన్నా తనపేరు మొదటిదిగా తన తదనంతరమే భర్తకు చెందేలాగున వుంటేనే ఆమెకు భద్రత, శ్రేయస్కరం. ఇతరత్రా కేవలం తన పేరు కూడా వున్నదని ఆమె మురిసి పోవటం తప్పు.

## జీవిత భీమా

127 ప్ర॥ భర్త జీవిత భీమా చేస్తే తన భద్రతకోసం ఏం చేయాలి?

జ॥ భర్త పాలసీని తనకు చెందేలాగు రాయించుకోవాలి దానిని 'అసైను మెంటు' అంటారు అలా కుదరని పక్షంలో తన పేరు భర్త చేత నామినేషను ద్వారా నమోదు అయ్యేటట్లు చూడాలి అప్పుడు భర్త అనంతరం ఆ పాలసీ మొత్తం 'వారసత్వ సర్టిఫికెట్' అవసరం లేకుండా ఆమెకు వస్తుంది.

## స్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలు

128 ప్ర॥ రైళ్ళలో స్త్రీలకు చేసిన ప్రత్యేక సౌకర్యాలు ఏవి?

జ॥ స్త్రీలకు ప్రత్యేకంగా రైలు పెట్టె, ప్లాట్‌ఫారాలమీద విశ్రాంతి గదులు స్నానాల గదులు పాయిఖానాలు, మూత్రశాలలు ఏర్పాటుచేశారు. వీటిలో పు షులు ప్రవేశించి వాడుకోరాదు.

129ప్ర॥ బస్సులలో ఏమి సౌకర్యాలు ఏర్పాటు చేశారు ?

జ॥ నగరంలోని బస్సులలో ఎక్కువ సంఖ్యలో, జిల్లాలలో తిరిగే బస్సులల తక్కువ సంఖ్యలో సీట్లు కేటాయించారు. కాని స్త్రీల సీట్లలో తరచుగా పు షులు కూర్చొని లేవరు. స్త్రీలు నిస్సహాయంగా నిలబడి ప్రయాణం చేస్తున్నారు

130ప్ర॥ పట్టణాలలో, నగరాలలో స్త్రీలకు ఏమి సౌకర్యాలు ఏర్పాటుచేస్తున్నారు ?

జ॥ పురుషులు వాడుకునే మూత్రశాలలు, పాయిఖానాలు అక్కడక్కడ కన్పిస్తా అలాంటి సౌకర్యాలు స్త్రీలకు అసలు లేవు.

## వృద్ధాప్య ఫించను

131.ప్ర॥ స్త్రీలకు వృద్ధాప్యపింఛను వుందా?

జ॥ ప్రత్యేకంగా లేదు. స్త్రీ పురుషులకు వర్తించే నియమమే అమలులో వుం 70 సం॥లు దాటిన స్త్రీకి వృద్ధాప్యపింఛను నామ మాత్రంగా ప్రభుత్వ యిస్తుంది. కాని అదీ ఆ స్త్రీలకు సంతృప్తిగా దక్కటం లేదు

## ప్రసూతి భృతి

132ప్ర॥ స్త్రీలకు ప్రసూతి భృతిని ప్రభుత్వం యిస్తున్నదా ?

జ॥ నామమాత్రంగా 60 రూ॥లు యిస్తున్నది. తగినంత యివ్వటంలేదు. దాని ఒకేసారి ఇస్తారు. వ్యవసాయ కార్మిక స్త్రీలకు ప్రసూతి భృతి తగినంతగా ముట్టే పథకాన్ని ప్రభుత్వం ప్రవేశపెట్టాలి.

133ప్ర॥ స్త్రీలు హక్కులను తెలుసుకున్నందువల్ల ఏమి లాభం?

జ॥ హక్కులు వున్నవని తెలిస్తే వాటి అమలుకోసం వారు పోరాడగలరు.

134ప్ర॥ హక్కులను అమలు చేయించుకుంటే వారికి ఏమి ప్రయోజనం?

జ॥ వారి సామాజిక ఆర్థిక రాజకీయ సాంస్కృతిక పరిస్థితి మెరుగవుతుంది.

185ప్ర॥ పరిస్థితి మెరుగయితే వచ్చే ఫలితం ఏమిటి ?

జ॥ సమాజంలో పురుషులతో సమాన ప్రతి పత్తిగల వ్యక్తులుగా జీవించ కల్గుతారు. వారి వ్యక్తిత్వం హుందాతనం పరిరక్షింప బడతాయి. వారు సామాజిక వ్యవహారాలలో అర్థవంతుగా, సమర్థంగా పాల్గొన గలరు.

## పంచాయితీ రాజ్ వ్యవస్థలో స్త్రీలకు రిజర్వేషన్లు

186ప్ర॥ పంచాయితీరాజ్ వ్యవస్థ అంటే ఏమిటి?

జ॥ దేశంగా సామాజిక, రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక రంగాలలో ప్రజలు వ్యవహరిస్తున్నారు. రాజకీయరంగం రాజ్యపు అధికారానికి సంబంధించినది గ్రామ పంచాయితీ, మండల ప్రజాపరిషత్, జిల్లా ప్రజాపరిషత్, రాష్ట్ర శాసనసభ, పార్లమెంటులలో అధికారం 5 స్థాయిలలో నెలకొనివుంది గ్రామ పంచాయితీ, మండల ప్రజాపరిషత్, జిల్లా ప్రజాపరిషత్ యీ మూ పంచాయితీరాజ్ వ్యవస్థలో అంచెలు. వీటిని స్థానిక సంస్థలు అంటున్నారు

187ప్ర॥ పట్టణాలలోని మ్యునిసిపాలిటీలు, నగరాలలోని కార్పొరేషన్లు ఇవి కూడా స్థానిక సంస్థలేనా?

జ॥ అవును? అవి కూడా స్థానిక సంస్థల క్రిందనే లెక్క.

188ప్ర॥ పూర్వం స్థానిక సంస్థల్లో స్త్రీలకు స్థానాలు కేటాయించేవారా ?

జ॥ మ్యునిసిపాలిటీలో స్త్రీలకని కొన్ని వార్డులలో సీట్లను కేటాయించేవారు ఉ॥ 20 మంది సభ్యులున్న పంచాయితీలలో సుమారు 2 స్థానాలు స్త్రీ కేటాయించబడినవి. గ్రామ పంచాయితీలలో ప్రతి గ్రామ పంచాయితీలో స్థానాన్ని స్త్రీలకు కేటాయించేవారు. తరువాత పంచాయితీ అధ్య 9 శాతం పదవులను స్త్రీలకు కేటాయించారు.

189ప్ర॥ స్త్రీలకు ప్రత్యేక స్థానాల విషయంగా ఈనాటి స్థితి ఏమిటి?

జ॥ గ్రామ పంచాయితీలలో, మ్యునిసిపాలిటీలలో 30 శాతం మంది స్త్రీలు వుండాలని వరుసగా 73, 74వ భారత రాజ్యాంగ సవరణలు నిర్దేశిస్తున్నా వాటికి అనుగుణంగా గ్రామ పంచాయితీ శాసనాన్ని, మ్యునిసిపాలిటీలశాసన ఆంధ్ర ప్రదేశ్ లో మార్చారు.

140ప్ర॥ ఈ రాజ్యాంగ సవరణలు, ఆంధ్రప్రదేశ్ శాసనాల ఫలితంగా స్త్రీలకు ఏమి లాభం?

జ॥ స్త్రీలకు విధిగా 33.33 శాతం అంటే మూడవ వంతు ప్రాతినిధ్యం వచ్చింది. దేశంలో 5 లక్షల గ్రామాలలో 2 లక్షల గ్రామపంచాయితీలు వున్నాయి. గ్రామ పంచాయితీకి సగటున 9 మంది సభ్యులుంటే 18 లక్షల సభ్యులు ఉంటారు. వారిలో 33.33 శాతం అంటే మూడవ వంతు సభ్యులు స్త్రీలయి గ్రామపంచాయితీలలో 6 లక్షలమంది స్త్రీలు సభ్యులవుతారు. ఆంధ్రప్రదేశ్‌లో 15 వేల పైచిలుకు గ్రామపంచాయితీలు వుంటే, గ్రామపంచాయితీకి సగటున 9 మంది సభ్యులుంటే 1,35000 మంది సభ్యులుంటారు. అందులో స్త్రీల ప్రాతినిధ్యం మూడవవంతు అంటే 45 వేలమంది స్త్రీలు క్రొత్త శాసనం ప్రకారం సభ్యులవుతారు. అలాగే మండల ప్రజాపరిషత్‌తో, జిల్లా ప్రజా పరిషత్‌లో స్థానాలను స్త్రీలు పొందగలరు. ఇంత భారీ ఎత్తున స్త్రీలు పంచాయితీ రాజ్య వ్యవస్థలో అధికార స్థానాలను పొందపోతున్నారు. ఇది చాలా గొప్పవిషయం.

141ప్ర॥ స్త్రీలకు పంచాయితీ సభ్యత్వం వచ్చినందువల్ల జరిగేదేమిటి ?

జ॥ స్త్రీలకు వచ్చేలాభాలు యిలా ఉంటాయి :-

1) మొదటి సారిగా స్త్రీలు అత్యధిక సంఖ్యలో రాజకీయరంగ ప్రవేశం చేస్తారు.
2) స్త్రీలకు రాజకీయాలలో శిక్షణ, అనుభవం వస్తుంది.
3) స్త్రీల విషయాలలో స్త్రీ సభ్యులు ఎక్కువగా జోక్యం కలిగించుకోవడానికి అవకాశం వస్తుంది.
4) మూడవ వంతు స్థానాలు స్త్రీలకు వుంటాయి. కనుక స్త్రీలను, వారి శ్రేయస్సును, వారి ప్రయోజనాలను పంచాయితీలు పట్టించుకోక తప్పదు.
5) గ్రామ పారిశుద్ధ్యం నీటి వసతి, విద్యాలయాలు, రోడ్లు, వైద్యాలయాలు, స్త్రీలకు ప్రసూతి సౌకర్యాలు, పాయిఖానాలు వగయిరా సమస్యలను స్త్రీల పరంగా, స్త్రీలకు అనుకూలంగా అవగాహన చేసుకోవడం, పరిష్కరించడం జరుగుతుంది.

142ప్ర॥ ఈ నాడు గ్రామ పంచాయితీలలో స్త్రీ సభ్యులు, స్త్రీ పంచాయితీ అధ్యక్షులు ఉన్నా పెద్దగా మార్పులేదే? మరి పరిస్థితి ఒక్క సారిగా మారుతుందా?

జ॥ ఈ నాడు పంచాయితీలలో స్త్రీ సభ్యులలో చొరవ, అనుభవజ్ఞానం కొరవడిన మాట వాస్తవం. కొంతమంది స్త్రీ పంచాయితీ అధ్యక్షులు భర్తల, కుమారుల ప్రతినిధులుగా మాత్రమే అధికారాలను చలాయిస్తున్న మాట వాస్తవమే. కాని అత్యధిక సంఖ్యలో స్త్రీలు పంచాయితీరాజ్య వవ్యస్థలో ప్రవేశిస్తే దాని ప్రభావం వేరుగా వుండటానికి అవకాశం వుంది. వారిలో కనీసం 5 వ వంతు మంది అయినా చురుకుగా, చలాకీగా పనిచేయగలవారు ఉండ వచ్చును. ఇది గుణాత్మక మయిన మార్పును తీసికొని రాగలదు

143ప్ర॥ స్త్రీలకు వచ్చిన ఈ అవకాశాన్ని వారు పూర్తిగా వాడుకోవాలంటే ఏమి జరగాలి ?

జ॥ స్త్రీలలో జాగృతి, చైతన్యం ముమ్మందుగా కలగాలి.

144ప్ర॥ స్త్రీలలో జాగృతి చైతన్యాల వ్యాప్తికి ఎవరు పనిచేయాలి ?

జ॥ సమాజంలో విద్యావంతులైన స్త్రీలున్నారు. సమాజం యిచ్చిన వసతులను, అవకాశాలను వారు వాడుకొని కాస్తో కూస్తో చదువుకున్నారు. వీరు సమాజం వలన లాభించారు. కనుక సమాజం ఎడల వారికి బాధ్యతవుంది. వారు తమతోటి స్త్రీలను విద్యావంతులుగా చేయాలి. వారిలో జాగృతి చైతన్యాలను కలుగ జేయాలి. మహిళా సంఘాలకు, మహిళల శ్రేయస్సును కాంక్షించే వారికి యీ బాధ్యత వుంటుంది. మహిళోద్యమ కార్యకర్తలు యీ విషయంలో శ్రద్ధ వహించాలి. ఇది ఒక్కరు చేయలేని పని. సమిష్టిగా కాక పోయినా ఏ వర్గానికి ఆవర్గం కృషిచేయాలి

145ప్ర॥ క్రొత్తగా రంగంలోకి వచ్చే యీ స్త్రీ శక్తిని సద్వినియోగం చేసుకోకపోతే ఆ స్త్రీ శక్తి ఈ నాటి వ్యవస్థను బలపరిచే శక్తిగా రూపొందుతుంది. అపుడు స్త్రీలకు అనుకూలమయిన మార్పు, ప్రయోజనాలను సాధించటానికి అవకాశాలను కల్పించే మార్పురాదు. ఇది ప్రమాదకరం.

## కేంద్రప్రభుత్వ సాంఘిక సక్షేమ పథకాలు

146ప్ర॥ ప్రమాదం జరిగి ఒక వ్యక్తి చనిపోతే ప్రభుత్వం అతని వారసులకు ఏమ మయినా నష్టపరిహారం యిస్తుందా?

జ॥ ఇస్తుంది. దానికొక పథకాన్ని కేంద్రప్రభుత్వం రూపొందించింది. అది 1985 లో ఆమోదించబడింది. దానిని వ్యక్తిగత ప్రమాద సాంఘిక భద్రతా పథకం అంటారు. అయితే అందరు పేదలకూ ఇదిరాదు కొన్ని నియమాలను రూపొందించారు. అవి ఆ వ్యక్తి కుటుంబాన్ని పోషించే వాడుగా వుండాలి. 2) కుటుంబాదాయం సంవత్సరానికి 7,200 అంటే నెలకు సగటున రు॥600లు లోపు ఆదాయం ఉండాలి. 3) ఆ వ్యక్తి వయస్సు 18 సం॥ల నుండి 60 సం॥ల లోపు వుండాలి.

147ప్ర॥ ప్రమాదాలు ఎలాంటివి?

జ॥ అడవి జంతువుల దాడి, పాముకాటు, వరదలు, చెట్లపైనుండి పడటం, కరెంటుషాక్, నేరస్తులు దోపిడీదొంగల నుండి ప్రమాదం, ఆహారంతిని మరణిస్తే ఆహారంలో విషం వున్నదని దరిమిలా తెలిస్తే, యిలాంటివి వ్యక్తి గత ప్రమాదాలకు ఉదాహరణలు.)

148ప్ర॥ ఎంత ఆర్థిక సహాయం యిస్తారు.

జ॥ కుటుంబానికి మూడువేల రూపాయలు సహాయంగా యిస్తారు.

ప్ర॥ ఏ అధికారి వద్ద పరిహారానికి అర్జీ పెట్టాలి ?

జ॥ మండల రెవిన్యూ అధికారి వద్ద.

150ప్ర॥ ఎప్పటిలోగా అర్జీని దాఖలు చేయాలి?

జ॥ ప్రమాదం జరిగిన 6 నెలలు లోగా.

152 ప్ర॥ అర్జీ ఏ రూపంలో వుండాలి?

జ॥ మండల రెవిన్యూ అధికారి (ఎం. ఆర్. ఓ) కార్యాలయంలో దొరికే పత్రంను (క్లైయిము ఫారం) పూర్తిచేసి దరఖాస్తు చేయాలి.

158ప్ర॥ దరఖాస్తుతోపాటు ఏయే కాగితాలు దాఖలు చేయాలి?

జ॥ ప్రమాదం జరుగగానే పోలీసులకు తెలియజేస్తాం కదా. ఆరిపోర్టును ప్రాధమిక సమాచార నివేదిక (ఎఫ్. ఐ. ఆర్) అంటారు. దాని ప్రతిని తప్పక దరఖాస్తుతో జతచేయాలి రేషను కార్డు ప్రతిని కూడా యివ్వాలి. ఈ దర

ఖాస్తు మీద మండల రెవిన్యూ అధికారి దర్యాప్తు చేస్తాడు. అతని నివేదిక, పైన చెప్పిన పత్రాల ఆధారంగా చనిపోయిన అతని కుటుంబానికి సహాయం అందుతుంది.

154ప్ర॥ మరి ఈ పథకం అమలులోవుందా?

జ॥ ఉంది కాని అమలు పరచటంలో కొన్ని లోపాలు జరుగుతున్నాయి. వీటి క్లెయిము ఫారాలు ఎం. ఆర్. ఒ. ఆఫీసులలో దొరకటంలేదు.

## మోటారు ప్రమాదాలకు నష్టపరిహారాలు

155ప్ర॥ గుర్తుతెలియని మోటారు వాహనం ఢీకొని ఏ వ్యక్తి అయినా గాయపడితే లేక చనిపోతే అతని కుటుంబానికి ఏ సహాయం అందుతుంది?

జ॥ మరణిస్తే రు. 8,500 లు, గాయపడితే రెండువేల రూపాయలు వస్తుంది.

156ప్ర॥ ఎవరికి దరఖాస్తు చేయాలి?

జ॥ గ్రామాలలోని ప్రమాదాలకు ఎం. ఆర్. ఒ వద్ద, పట్టణాలలో జిల్లాజడ్జివద్ద.

156ప్ర॥ ఏయే పత్రాలు అవసరం ?

జ॥ పోలీసులకు యిచ్చిన 'రిపోర్టు' ప్రతి, వారసత్వ 'సర్టిఫికిట్' దాఖలు చేయాలి.

158ప్ర॥ ఇతరమైన మోటారు వాహనాల ప్రమాదాలలో ఎలాజరుగుతుంది ?

జ॥ జిల్లా జడ్జి వద్ద దరఖాస్తు పెట్టాలి.

159ప్ర॥ 1989 సమీకృత గ్రామీణాభివృద్ధి పథకం అమలులో వున్నచోట రుణం తీసుకున్న వ్యక్తి మరణిస్తే ఆ కుటుంబానికి ఏమి సహాయం అందుతుంది?

జ॥ అప్పుతీకొనున్న వ్యక్తి సహజంగా మరణిస్తే రు 8 వేలను. ప్రమాదం జరిగి మరణిస్తే రు 6 వేలను భీమాసంస్థ అందచేస్తుంది, జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ అధికారి (డి. ఆర్. డి. ఒ) ద్వారా సహాయం పొందవచ్చును.

## గుడిసెల భీమా పథకము

160ప్ర॥ 1988 గుడిసెల భీమా పథకం వల్లలాభం ఏమిటి?

జ॥ గుడిసె కాలిపోతే రు. 2 వేల ఆర్థిక సహాయం అందుతుంది.

161ప్ర॥ ఎవరికి యిస్తారు ఈ సహాయాన్ని?

జ॥ సంవత్సరానికి రు. 4,800 లకు (అంటే సగటున నెలకు రు. 400) మించని ఆదాయం కల భూమి లేని కూలీలు యీ సహాయం పొందగలరు.

## బాల కార్మికుల పని పద్ధతులు

162ప్ర॥ బాల కార్మికులంటే ఎవరు?

జ॥ 14 సం॥ నిండని బాలుడు, బాలిక.

163ప్ర॥ ఏ యే పనులలో బాలులను పని చేయించరాదు?

జ॥ రైల్వే లైను పనులలో, బీడీ, సిమెంటు, అగ్గిపెట్టెలు, మందుగుండు సామాగ్రి సబ్బులు తయారు చేయటం, ఇల్లు కట్టటం ఇలాంటి పనులలో బాలలచేత పనులు చేయించరాదు.

164ప్ర॥ ఏ ఉద్యోగాలకు నియమములు వర్తిస్తాయి ?

జ॥ దుకాణాలు, కర్మాగారాలు, హోటళ్ళు, వ్యవసాయ భూములు, ఫలహారశాలలు, సినిమా హాలులు వగయిరాలకు వర్తిస్తుంది.

165ప్ర॥ బాలల పని నిబంధనలు ఎలా వుండాలి?

జ॥ రోజుకు 6 గంటలకు మించి పనిచేయరాదు. మొదటి 3 గంటల తర్వాత తప్పని సరిగా ఒక గంట కాలం విశ్రాంతి యివ్వాలి. ఆ గంటకాలం పని చేయించరాదు. రాత్రి 7 గం. నుండి మరునాడు 8 గం॥ వరకు పనిచేయించటంకాని అదనపు పని చేయించటం తప్పు.

7ప్ర॥ పైన చెప్పిన నియమాలను లెక్కపెట్టకుండా బాలలచేత పని చేయించటం నేరమా?

అవును నేరమే. దానికి శిక్షలను పేర్కొన్నారు.

# స్త్రీలు–నేరాలు శాసనాలు

1. ప్ర| నేర విషయంలో ముఖ్యాంశాలు ఏమిటి?

జ| నేరం చేయాలనే ఉద్దేశ్యం 2. నేరాన్ని చేయటానికి తయారవడం. 3. నేరాన్ని చేయడానికి ప్రయత్నించడం 4. నేరానికి సహాయ పడటం. 5. నేరం చేయడం.

2. ప్ర| ఏవి నేరాలు?

జ| ఉద్దేశ్యం దానంతట అదే నేరం కాదు. కుట్రకేసులో తప్ప నేరానికి తయారీ దానంతట అదిగా నేరం కాదు. నేరానికి ప్రయత్నించడం, నేరానికి సహాయపడటం, నేరం చేయడం వాటంతట అవిగా నేరాలు; శిక్షాపాత్రాలు.

3. ప్ర| ప్రత్యేకంగా పేర్కొనక పోతే నేరానికి ప్రేరేపించటం, సహాయం చేయటం వగయిరాలు భారత శిక్షాస్మృతి ఏ సెక్షను క్రింద నేరాలు?

జ| సెక్షను 109 క్రిందకు వస్తాయి. ప్రయత్నం భారత శిక్షాస్మృతి సెక్షను 511 క్రింద నేరం.

4. ప్ర| నేరానికి సహాయం చేయడం అంటే ఏమిటి?

జ| 1) ఏ వ్యక్తినయినా నేరం చేయమని ప్రోద్బలం చేస్తే, ప్రేరేపిస్తే, 2) ఒక ప చేయటానికి మరో వ్యక్తి తోకాని ఎక్కువ మందితోగాని కుట్ర పన్నితే, ఆ కుట్ర ఫలితంగా ఒక నేర చర్య జరిగితే లేక చట్ట విరుద్ధమయిన ఉపేక్ష సంభవిస్తే యివి ఆ పనిని చేసే క్రమంలో జరిగితే, 3) ఏ చర్యవల్లగాని, చట్టవిరుద్ధమయిన ఉపేక్ష వల్లగాని ఏ పనినయినా చేయడానికి ఉద్దేశించి బుద్ధిపూర్వకంగా సహాయంచేస్తే,; ఏవ్యక్తి అయినా ఒక పనికి దోహదం చేసే దానిని ప్రోద్బలం, ప్రేరేపించటం అన్నమాట(సెక్షను 107 భారత శిక్షాస్మృతి).

5. ప్ర| ఎవరు సహాయకారి?

జ| సహాయకారి ఎవరో సెక్షను 108 చెప్తుంది. సెక్షను 107లో చెప్పిన సహాయం చేసిన వ్యక్తి సహాయకారి (సెక్షను 108).

6. ప్ర॥ ఇండియాలో నేరంగా పరిగణించేదానిని భారత పౌరుడు యితర దేశాలలో సహాయం చేస్తే ఏమవుతుంది?

జ॥ అది నేరమవుతుంది (సెక్షను 108 ఎ). దానికి శిక్ష సెక్షను 109లో విశదీకరంచబడింది.

7. ప్ర॥ ఒకనేరానికి ప్రోద్బలపరిస్తే ఇంకొక నేరం జరిగితే ఏమవుతుంది?

జ॥ దాని విషయం సెక్షను 110లో చెప్పటం జరిగింది. అలా ప్రేరేపించిన వ్యక్తి బాధ్యత సెక్షను 111లో వివరించారు.

8. ప్ర॥ మరి అతనికి శిక్ష ఎలా వుంటుంది?

జ॥ ప్రేరేపించినది ఒకటి అయితే, నేర చర్య మరొకటి అయితే రెండు నేరాలకు శిక్ష (సెక్షను 112). ప్రోద్బలం చేసిన వ్యక్తి ఒక ఫలితాన్ని ఆశించి అలా చేస్తే మరొక ఫలితం వస్తే, ప్రోద్బలం పొందిన చర్య యిలాంటి ఫలితాన్ని యిస్తుందని అతనికి తెలిస్తే రెండవ ఫలితాన్ని ఆశించి ప్రోద్బలం చేసినట్లే లెక్క (సెక్షను 113). ప్రోద్బలం చేసిన వ్యక్తి సమక్షంలో ప్రోద్బలం చేయబడిన చర్య లేక నేరం జరిగితే అతడు ఆ చర్యకు, నేరానికి బాధ్యుడు (సెక్షను 114).

9. ప్ర॥ సాధారణంగా స్త్రీలపై జరిగే నేరాలు ఏవి?

జ॥ స్త్రీ మాన మర్యాదలకు సంబంధించిన నేరాలు : 1) అశ్లీల చర్యలు, 2) స్త్రీల వేధింపు, 3) స్త్రీల మాన మర్యాదలపై దాడి లేదా బలప్రయోగం, 4)మానభంగ ప్రయత్నం, 5) మానభంగం. వీటిలో ముందున్న నేరాలు తరువాత వాటికన్న అల్పమయినవి.

10. ప్ర॥ అశ్లీల చర్యలు ఎపుడు నేరాలు ?

జ॥ ఈ నేరాలు భారత శిక్షాస్మృతి సెక్షను 294 క్రిందికి వస్తాయి. ఈ నేరాలను స్త్రీ పురుషులిరువురు చేయవచ్చును. అయితే ఈ నేరాలు సాధారణంగా స్త్రీలకు వ్యతిరేకంగా పురుషులే చేస్తారు. 1) అశ్లీల చర్యలు – సంభోగం లాంటివి – బహిరంగ స్థలంలో చేస్తే, 2) అశ్లీల గీతాలను లేదా పాటలను పాడినా లేక ఇతరులకు వినపడేటట్లు చదివినా, పదాలను పలికినా ఈ

పనులను బహిరంగ స్థలంలో, బహిరంగ స్థల సమీపంలో చేసినా అది నేరమే. 3 నెలలకు మించకుండా జైలు శిక్షలేదా జరిమానా లేక రెంటిని విధించవచ్చును. బహిరంగ స్థలం అంటే ప్రజలు సాధారణంగా తిరుగాడే ప్రాంతం. ప్రజలంటే ఒక వర్గం లేక ఒక ప్రాంతంలో జన సముదాయం. ఒక కులం వారు, మతం వారు, శాఖవారు, ప్రాంతం వారు అందరూ 'జన సముదాయం' అనే మాట క్రిందికి వస్తారు.

11. ప్ర ఈ నేరం చేసిన వారిని ఎలా అరెస్టు చేయవచ్చును ?

జ ఈ నేరం చేసిన వారిని వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చును. అయితే జామీను హక్కుగా పొందగల కేసు యిది.

## స్త్రీల వేధింపు

12. ప్ర ఏవి స్త్రీల వేధింపు చర్యలు ?

జ ఈ నేరాన్ని భారత శిక్షాస్మృతి సెక్షను 509లో వివరించారు. స్త్రీల అందచందాలపై వ్యాఖ్యానం చేయడం, వారికి అసభ్యకరమయిన సైగలు చేయడం, ఈలలు వేయడం, వారికి బాధ, వ్యధ కలిగించే రీతిగా తమదేహాలను, దేహావయవాలను ప్రదర్శించడం, సందర్భం లేకుండా వారిని పలకరించి వా ఏకాంతానికి భంగం కలుగ చేయడం, బస్సులలో, రైళ్ళల్లో ప్రయాః చేస్తున్నపుడు జన సమ్మర్దం లేకపోయినా వారి శరీర భాగాలను తాకడం ఇ నేర చర్యలు. స్త్రీల మాన మర్యాదలకు భంగం కలిగించాలని లేక అవమా పరచాలనే ఉద్దేశ్యంతో ఆకతాయి యువకులు, విద్యార్థులు ఈనేరాః చేస్తున్నారు.

13. ప్ర ఈ నేరానికి శిక్షలు ఏమిటి ?

జ ఒక సంవత్సరానికి మించని జైలు శిక్ష లేదా జరిమానా లేక రెండూను.

14. ప్ర నేరస్తులను ఎలా అరెస్టు చేయాలి ?

జ వారంటు లేకుండా పోలీసు వారు నేరస్తులను అరెస్టు చేయవచ్చును. ముద్దాయి హక్కుగా జామీను పొందవచ్చును.

## స్త్రీ మానమర్యాదలకు భంగం కలిగించే దాడి లేక బలప్రయోగం

15. ప్ర॥ ఏ చర్యలు స్త్రీ మాన మర్యాదలకు భంగం కలిగించేవిధంగా నేరాలు ?

జ॥ ఏ వ్యక్తి అయినా – స్త్రీగాని పురుషుడుగాని – ప్రవర్తిస్తే అది నేరం. భారత శిక్షాస్మృతి సెక్షను 354 దీనిని వివరిస్తుంది. స్త్రీ సమ్మతి లేకుండా ఆమెను అవమాన పరచాలనే ఉద్దేశంతో ఆమె అవయవాలను పీడించడం, పిసకటం, మర్దన చేయడం, ఆమెను గిల్లడం, కొరకడం, ఆమెను బలవంతంగా ముద్దు పెట్టుకోవటం, ఆమెను వివస్త్రను చేయటం, ఆమె తలమీది జుట్టును, కనుబొమ్మలను గొరిగించడం, ఆమె దుస్తులను తొలగించి ఆమెపై పరుండటం యివన్నీ యీ సెక్షను క్రింద నేరాలే. ఈనేరం మాన భంగం ప్రయత్నం కన్న చిన్నది. ఇంతకు ముందు పేర్కొన్న భారత శిక్షాస్మృతి సెక్షను 294, సెక్షను 509 నేరాలకన్న పెద్దది. యోగ్యగమయిన నడత, యోగ్యమయిన పద్ధతి, ఖచ్చితమయిన శీలం, అసభ్యత అంటే నిరాదరణ మర్యాద అనే పదంలో ఇమిడి ఉన్నాయి. సభ్యత అంటే యుక్తమయిన నడత, ఉత్తమాభిరుచికి అనుగుణంగా వుండేది, సున్నితమయిన స్వభావమునకు తగినది అని అర్థం. మాటలో, తీరులో, హుందా తనంలో యుక్తమయిన దానిని ఔచిత్యం అంటాం. సభ్యతకు విరుద్ధమయిన దుష్టగుణాన్న యీ సెక్షను క్రింద నేరంగా చెప్పారు శిక్షాస్మృతి రచయితలు. ప్రజలకు అసహ్యకరమయినదల్లా నేరంకాదు. ప్రజలకు అసహ్యమనిపించిన పనిని బహిరంగ ప్రదేశంలో ప్రజలు చూచేటట్లు చేయటం బహిరంగంగా ఏవగింపు కల్గించడం, అనేవి నేరం క్రిందికి వస్తుంది.

6. ప్ర॥ పోలీసు ఆఫీసరు నేరస్తుని ఎలా అరెస్టు చేయవచ్చును ?

జ॥ వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చును. ముద్దాయి జామీనును విధిగా పొందగల సౌకర్యం వుంది.

ప్ర॥ శిక్ష ఏమిటి ?

జ॥ 2 సంవత్సరాలు నిండని జైలు శిక్ష లేదా జరిమానా లేక రెండునూ శిక్షలు.

ప్ర॥ ఈ నేరానికి యీ శిక్ష స్వల్పం కాదా ?

అవును శిక్షను పెంచాలి.

## మానభంగం (రేప్)

19. ప్ర॥ స్త్రీలపై జరిగే అత్యాచారాలలో పెద్దది ఏది ?

జ॥ మాన భంగం.

20. ప్ర॥ మానభంగం కేసుకులోనయిన స్త్రీ సిగ్గు పడవలసిన విషయమా ?

జ॥ ఆమె సిగ్గు పడవలసిన విషయం ఎంతమాత్రం కాదు. ఆమె నేరస్తునితో లాలూచీ పడలేదు. నేరం ఆమె సమ్మతి లేకుండా జరుగుతుంది కనుక ఆమె ప్రమేయం లేదు. ఆమెను 'భ్రష్ట', 'శీలరహిత', 'చెడింది' అని పిలవడం అన్యాయం. ఈ దుర్మార్గాన్ని అంటే ఈ నేరానికి బలి అయిన స్త్రీని నిందించడం, అపహాస్యం చెయ్యడం, యించుమించుగా వెలివేయడం జరుగుతున్నది. ఇది అన్యాయం. ఆమెకు సానుభూతిని, సహాయాన్ని అందించటం మనుజాలందరి కర్తవ్యం.

21. ప్ర॥ ఈ నేర స్వభావం ఏమిటి ?

జ॥ ఈ నేరాన్ని భారత శిక్షాస్మృతి సెక్షను 375 నిర్వచనం చేసింది. ఒక మగవాడు యీ సెక్షనులో మినహాయింపు చేయబడిన సందర్భంలో తప్ప యితరత్రా యీ క్రింద చెప్పబడిన 5 పద్దతుల్లో ఏ ఒక్కదానితో అయినా ఒక స్త్రీతో లైంగిక సంపర్కంలో పాల్గొంటే దానిని 'మాన భంగం ' అని పిలుస్తాం. 1) ఆమె యిష్టానికి వ్యతిరేకంగా, 2) ఆమె సమ్మతి లేకుండా, 3) ఆమెకుగాని, ఆమె శ్రద్ధచూపే ఏ ఇతర వ్యక్తికి గాని ఘాతం లేక మరణం కలుగుతుందని ఆమెను భయపెట్టి ఆమె సమ్మతి పొందితే, 4) తను స్త్రీ యొక్క భర్త కాదని పురుషునికి తెలిసియుండి, ఆమె ఆ పురుషునితో తనకు సక్రమంగాచట్టరీత్యా వివాహం అయిందని భావించి సంభోగానికి ఆమె సమ్మతిని యివ్వటం జరిగితే, 5) తన సమ్మతిని యిచ్చిన సమయంలో ఆమె చిత్త చాంచల్యంతో బాధపడుతున్నపుడు లేక మత్తు పదార్థాలను సేవించి మత్తులో వున్నపుడు లేక పురుషుని చేత యివ్వబడిన మత్తు పదార్థాలను సేవించి మత్తులో ఉన్నపుడు, అనారోగ్యకరమయిన పదార్థాన్ని ఆమెకు ఎవరయినా యివ్వగా ఆమె ఆలోచనా శక్తి పని చేయనపుడు అందువలన తను సమ్మతించిన చర్య యొక్క స్వభావాన్ని ఫలితాలను ఆమె అర్థం చేసుకోలేని స్థితిలో వుంటే, అ స్త్రీతో

పురుషుని లైంగిక సంపర్కం మానభంగం క్రిందికే వస్తుంది. స్త్రీకి 16 సం॥ నిండనిచో ఆమె సంభోగానికి సమ్మతించినా సమ్మతించక పోయినా అతని లైంగిక సంపర్కం మానభంగం క్రింద లెక్క.

వివరణ :- స్త్రీ మర్మావయవంలో పురుషుడు తన మర్మావయవాన్ని జొనిపితే అతడు సంభోగం చేసినట్లు లెక్క. అ సంభోగం 'మానభంగం' నేరంలో ముఖ్యాంశం.

మినహాయింపు :- భార్యకు 15 సం॥లోపు వయస్సు లేకపోతే ఆమెతో భర్త లైంగిక సంపర్కం నేరం కాదు (సెక్షను 376(1)).

గమనిక :- ఘాత అనే పదం శిక్షాస్మృతి 319 సెక్షనులో చెప్పినదే.

22. ప్ర॥ ఈ నేరానికి శిక్షలు ఎలా ఉన్నాయి ?

జ॥ శిక్షలు శిక్షాస్మృతి 376(1)లో చెప్పబడినయి. సాధారణంగా కనీసం 7 ఏళ్ళ జైలుశిక్ష, పదేళ్లకు మించని జైలు శిక్ష లేక యావజ్జీవ ఖైదు/జరిమాన లేక రెండూను శిక్షలు. ప్రత్యేకమయిన కారణాలుంటే జైలు శిక్షను 7సం॥ కు తక్కువగా వేయవచ్చును. కాని ఆ విషయాన్ని తీర్పులో రాయాలి. మానభంగానికి గురి అయిన స్త్రీ ముద్దాయి భార్య అయి వుండి 12 సం॥లోపు వయస్సు కలది కాకపోతే ముద్దాయికి 2 సం॥ మించని జైలు శిక్ష జరిమానా వేయవచ్చును.

23. ప్ర॥ అరెస్టు, విచారణ విధానాలు ఎలా ఉన్నాయి ?

జ॥ భర్త భార్యను మానభంగం చేస్తే పోలీసు ఆఫీసరు వారంటు లేకుండా అరెస్టు చేయరాదు. ముద్దాయి జామీను పొంద అర్హుడు. స్త్రీని భర్తకాక మరెవరయినా మానభంగం చేస్తే ముద్దాయిని వారంటు లేకుండా పోలీసువారు అరెస్టు చేయవచ్చును. కోర్టువారు అనుమతిస్తే తప్ప ముద్దాయి జామీను పొందనర్హుడు కాదు. మానభంగం కేసులో ఫిర్యాది సాక్ష్యాన్ని మరొకరు బలపరచవలసిన అవసరంలేదు. కాకపోతే మరొక మనిషి సాక్షిగా వుంటే ఆసాక్ష్యం ఫిర్యాది సాక్ష్యాన్ని బలపరుస్తుంది.

ప్ర॥ పోలీసు అధికారి స్త్రీని మానభంగం చేస్తే శిక్ష ఎలావుంటుంది ?

జ॥ తన స్టేషను పరిధిలో, పోలీసు స్టేషనులో లేక తన అధీనంలో వున్న స్త్రీని పోలీసు ఆఫీసరు మానభంగం చేస్తే 10 సం॥ జైలు శిక్షకు తగ్గకుండా కఠిన కారాగారవాసం, జీవిత ఖైదుకు మించకుండా కఠిన శిక్ష, జరిమానా, రెండూ వేయవచ్చును (సెక్షను 376(2)ఎ).

25. ప్ర॥ స్త్రీని తన అధీనంలో వుంచుకొన్న ఆఫీసరు నేరం చేస్తే శిక్ష ఏమిటి ?

జ॥ పైన పోలీసు ఆఫీసరు కేసులో చెప్పిన శిక్షలే (376(2)బి).

26. ప్ర॥ జైలు, రిమాండు హెూం, బాలికల గృహం, వగయిరా వాటికి అధిపతులు నేరం చేస్తే శిక్ష ఏమిటి ?

జ॥ పోలీసు ఆఫీసరుకు పైన చెప్పిన శిక్షలే (సెక్షను 376(2)సి).

27. ప్ర॥ ఆస్పత్రి అధికారులు, ఉద్యోగులు నేరం చేస్తే శిక్షలు ఎలాంటివి ?

జ॥ పోలీసు ఆఫీసరుకు నిర్దేశింపబడిన శిక్షలే (సెక్షను 376(2)డి).

28. ప్ర॥ స్త్రీ గర్భవతి అని తెలిసి మానభంగం చేస్తే శిక్ష ఏమిటి ?

జ॥ పైన పోలీసు ఆఫీసరు విషయంలో చెప్పిన శిక్షలే (సెక్షను 376(2)ఇ).

29. ప్ర॥ 12 సం॥లోపు వయసు బాలికను మాన భంగం చేస్తే, మూకుమ్మడి మానభంగం చేస్తే శిక్షలు ఏవి ?

జ॥ పోలీసు ఆఫీసరుకు పైన చెప్పిన శిక్షలే (సెక్షను 376(2)ఎఫ్), (సెక్షను 376(2)జి).

30. ప్ర॥ మానభంగం కేసులో రుజువు భారం ఎవరి మీద ఉన్నది ?

జ॥ మానభంగానికి గురి అయినదని చెప్పబడుతున్న స్త్రీతో సంభోగం రుజువయితే ఆ స్త్రీ సంభోగానికి తను సమ్మతించలేదని చెప్తే ఆమె సంభోగానికి సమ్మతించినదని ముద్దాయి రుజువుచేసుకోవాలి. ఆమె అలా చెప్పగా రుజువు భారం అతనిపైకి వస్తుంది.

31. ప్ర॥ కోర్టు ఉత్తరువు ప్రకారం సంప్రదాయం లేక ఆచారం ప్రకారం భర్తనుండి కాపురం ఉంటున్న భార్యపై భర్త మానభంగం ద్వారా అత్యాచారం చేస్తే

2 సంవత్సరాలు మించని జైలు శిక్ష అదనంగా జరిమానా వేయవచ్చు. (సెక్షను 376 ఎ).

32. ప్ర॥ మానభంగం కాని సంభోగం కేసులలో శిక్షలు ఎలా వుంటాయి ?

జ॥ జైలు, రిమాండు హెూం, స్త్రీల సదనం, బాలికల సంస్థ పర్యవేక్షణాధికా నిర్వాహకుడు(సె. 376 సి), ఆస్పత్రి పరిపాలక వర్గసభ్యుడు, ఉద్యోగ వ సభ్యుడు (సె.376డి) తమ అధికారాలను వినియోగించి తమ అధీనంలో వున్న స్త్రీని తనతో సంభోగం చేయడానికి పురికొల్పి, శీల విషయం ఆమెను వక్ర మార్గాన పట్టించి, ఆమెతో సంభోగం చేస్తే ముద్దాయికి 5 సం మించకుండ జైలు, జరిమానా రెండూను శిక్షలు.

33. ప్ర॥ నేరానికి గురి అయిన స్త్రీ ఎలా ప్రవర్తించాలి ?

జ॥ 1) నేరం జరిగిన వెంటనే పోలీసు రిపోర్టు యివ్వాలి. 2) స్త్రీవైద్యునిచేత తన శరీరాన్ని పరీక్ష చేయించుకోవాలి. పోలీసులే ఆమెను ప్రభుత్వవైద్యాలయానికి పంపుతారు. 3) వైద్యులు పరిశీలించేదాకా తన దేహాన్ని, దేహావయవాలను కడుగరాదుప పరిశుభ్ర పరచరాదు. 4) నేరం జరిగిన సమయంలో తను ధరించిన దుస్తులను రసాయనిక పరీక్షకు పంపేట్టు చూచుకోవాలి. 5) నేరస్తుడు పట్టు బడితే అతని శరీరాన్ని పోలీసులు వైద్యునిచేత పరీక్ష చేయించేటట్టు చూచుకోవాలి. 6) నేరస్తుని దుస్తులను పోలీసువారు రసాయనిక పరీక్షకు పంపేలాగు చూచుకోవాలి. 7) సాక్షులు వుంటే వారిని ముద్దాయి భయపెట్టకుండా, లోభపెట్టకుండా చూడాలి.

34. ప్ర॥ నేరానికి గురి అయిన స్త్రీతో ఎలా ప్రవర్తించాలి ?

జ॥ ఆమెకు ధైర్యం చెప్పి మనోనిబ్బరం కల్గించాలి. ఆమెలో దోషభావం నశించేటట్టు చూడాలి. ఆమె తప్పు చేసిన వ్యక్తి కాదని ఆమెకు నమ్మకం కలిగించాలి. కేసు విచారణలో ఆమె నిబ్బరంగా సాక్ష్యం చెప్పేట్టు చూచుకోవాలి.

## ఎత్తుకుని పోవుట(కిడ్నాపింగు), బలవంతంగా లేక మోసవిధంగా కునిపోవుట(అబ్‌డక్షన్)

ప్ర॥ స్త్రీని ఎత్తుకుని పోవుట ఎన్ని రకాలు ?

జ॥ 1) మైనరు బాలికను సంరక్షకుని అధీనం నుండి ఎత్తుకుని పోవుట,
2) భారత దేశం నుండి ఎత్తుకుని పోవుట.

36. ప్ర॥ సంరక్షకుని అధీనం నుండి ఎత్తుకుని పోతే శిక్ష ఏమిటి ?

జ॥ సంరక్షకుని అధీనం నుండి ఎత్తుకుని పోవుట (భారత శిక్షాస్మృతి సెక్షన్ 359). సంరక్షకుని అనుమతి లేకుండా మైనరు స్త్రీని ఎత్తుకుని పోవుట లేక ఆకర్షించి ఆశపెట్టి తీసుకుని పోవుట (సె. 361)కు శిక్ష 7 సం॥ మించని ఖైదు, జరిమానా లేక రెండూను(సెక్షన్ 363). మానసిక ఆరోగ్యంలేని స్త్రీని సంరక్షకుని అధీనం నుండి ఎత్తుకుని వెళ్లినా అదే శిక్ష.

37. ప్ర॥ భారత దేశం నుండి ఎవరిని తరలిస్తే నేరం ?

జ॥ ఎవరినయినా వారి సమ్మతి లేకుండా అతడు/ఆమె తరపున అనుమతి యివ్వతగిన వ్యక్తి అనుమతి లేకుండా భారత దేశపు ఎల్లలను దాటించటం నేరం(సెక్షన్ 360).

38. ప్ర॥ మైనరు స్త్రీని ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా ఆమెకు వివాహం చేయించే వగైరా ఉద్దేశాలతో తీసుకొని వెళ్ళితే ఏమి నేరం ? ఏమి శిక్ష?

జ॥ మైనరు స్త్రీని ఆమె అభీష్టానికి వ్యతిరేకంగా వివాహమాడే ఉద్దేశ్యంతో లేక వివాహం చేయించే ఉద్దేశంతో గాని లేక అలా జరుగుతుందని తెలిసి కా ఆమెను బలవంతంగా కాని మరులుగొల్పి కాని లేక మోసవిధంగా వక్రమార్గాన పట్టించి కాని ఆమెతో అక్రమ లైంగిక సంపర్కం కోసం లేక ఆమెను అక్రమ లైంగికానుభవానికి లోను చేస్తారని తెలిసి ఆమెను ఎత్తుకొని పోయినా అపహరించినా నేరమే. ఆమెను బెదరించి అలా చేసినా నేరమే(భార శిక్షాస్మృతి సెక్షను 366) మైనరు స్త్రీని పై విధంగా ఒకచోటినుండి కదలటా ప్రోత్సహించినా నేరమే(భా.శి.స్మృ. సెక్షను 366). దీనికి 10 సం॥ జైలు జరిమానా, రెండూను.(సె.366బి).

39. ప్ర॥ ఎత్తుకొని పోబడిన లేక అపహరింపబడిన వ్యక్తిని దాచిపెట్టితే నేరమా ?

జ॥ అవును. సెక్షను 368.

40. ప్ర॥ ఈ కేసులలో ఎవరు ఫిర్యాదిగా వుండాలి ?

జ॥ మైనరు యొక్క సంరక్షకుడు.

41. ప్ర॥ మైనరు స్త్రీ తన ప్రియునితో ఎలా వ్యవహరించాలి ?

జ॥ అతనిని శిక్షా పాత్రునిగా చేయరాదు. అతనిపై ఎత్తుకొని పోవుట, అపహరించుట అనే నేరాలు రాకుండా చూచుకోవాలి. 16 సంవత్సరాలు నిండని బాలిక పురుషునితో లైంగిక సంపర్కానికి ఒడిగట్టి అతనిపై మానభంగపు కేసు వచ్చేలా చేయరాదు.

## గర్భస్రావానికి సంబధించిన నేరాలు

42. ప్ర॥ స్త్రీ తనకు తానుగా గర్భస్రావం చేసుకోవడం నేరమా ?

జ॥ అవును. నేరమే. (భా. శి.స్మృ. సెక్షను 312).

43. ప్ర॥ స్త్రీకి ఎప్పుడు గర్భస్రావం చేయవచ్చును ?

జ॥ వైద్యులు చేసే గర్భస్రావం 1971 గర్భస్రావ శాసనంలో చెప్పబడింది. తల్లికి ప్రాణాపాయం తప్పించడానికి శ్రద్ధా జాగ్రత్తలతో వ్యవహరించి నిర్ణయించి గర్భస్రావాన్ని కలిగిస్తే తప్పుకాదు. ఇతరత్రా గర్భవతి పిండాన్ని గర్భస్రావం చేస్తే నేరం. శిక్ష 3 సం॥ జైలు మరియు జరిమానా, రెండూను. ప్రసవకాలం సమీపించిన గర్భిణీ స్త్రీకి గర్భస్రావం చేస్తే 7 సం॥ జైలు శిక్ష, జరిమానా, లేదా రెండూను.(భా.శి.స్మృ.సెక్షను 312). తల్లి అయిన స్త్రీసమ్మతి లేకుండా గర్భస్రావం చేసిన వ్యక్తికి 10 సం॥ మించని కారాగార శిక్ష, జరిమానా, రెండూను(సె.313). స్త్రీకి గర్భస్రావం చేసే ప్రయత్నంలో ఆమె మరణిస్తే 10 సం॥ శిక్ష. స్త్రీ సమ్మతి లేకుండా గర్భస్రావం చేపట్టితే ఆ స్త్రీ మరణిస్తే 10 సం॥ జైలు శిక్ష, జరిమానా, లేదా రెండూను(సె.314). తల్లి ప్రాణాన్ని రక్షించే ప్రయత్నంలో శ్రద్ధా జాగ్రత్తలతో వ్యవహరిస్తే తప్ప శిశువు సజీవంగా జన్మించరాదనీ, జన్మించినా చంపవలెనని ఉద్దేశించితే శిశువు సజీవంగా జన్మించకపోతే, పుట్టినా చంపబడితే 10 సం॥ శిక్ష వగయిరాలు (సె.315). గర్భంతో వున్న స్త్రీ మరణించక కష్టనష్టాల పాలయితే, గర్భంలోనుండి వెలికి రావడానికి ఆసన్నమయిన శిశువు మరణించితే అది నేరం (సె.316).

## నేర ప్రయత్నం

44. ప్ర॥ నేర ప్రయత్నానికి ప్రత్యేకంగా శిక్షలు పేర్కొనకపోతే శిక్షలు ఎలా వుంటాయి?

జ॥ జీవిత కాలం ఖైదు శిక్షగా వుంటే, ప్రయత్నానికి సగం కాలం జైలు శిక్ష, కారాగార వాస శిక్షలో ఎంతవరకు శిక్ష వేయవచ్చునో అందులో సగం. నేరానికి ఎంత జరిమానా వేయవచ్చునో అంత జరిమానా వేయవచ్చును. జైలు శిక్ష, జరిమానా రెంటిని విధించవచ్చును. (సెక్షను 509 భా.శి.స్మృ.).

45. ప్ర॥ నిందితుడు నేరం చేయటంలో విఫలుడయినా నేర ప్రయత్నం చేసినట్లేనా ?

జ॥ నిందితుడు తన ప్రయత్నంలో విజయం పొందాడా లేదా అనేది ముఖ్యాంశం కాదు. అతడు నిస్సందేహంగా దోషియే.

## స్త్రీల అసభ్యకర చిత్రీకరణ నిషేధ శాసనం (1986)

46. ప్ర॥ ఈ శాసనం ఎందుకు ఉద్దేశించ బడింది ?

జ॥ స్త్రీల అసభ్య చిత్రీకరణను ఆపడానికి ఉద్దేశించబడినది.

47. ప్ర॥ స్త్రీయొక్క బొమ్మను ఎలా తయారు చేస్తే నేరం ?

జ॥ ఒక స్త్రీయొక్క బొమ్మను, అకారాన్ని, దేహాన్ని, దేహంలో భాగాన్ని ఏరకంగానయినా చూపితే దాని ఫలితంగా అది అసభ్యకరంగా, ఆమె హుందాతనానికి భంగకరంగా, స్త్రీల విలువ తగ్గించేదిగావున్నా లేక ప్రజా నీతిని ప్రజల నైతిక గుణాలను చెరిచేది, భ్రష్టు పట్టించేది, నష్ట పరిచేదిగా వుంటే దానిని 'స్త్రీలను అసభ్యంగా చిత్రించటం' అంటారు(ఆ శాసనం సెక్షను 2 సి). తయారు చేయటం, పంపిణీచేయటం, అమ్మటం, ప్రచురించుటం, ప్రదర్శించటం నేరాలు(సె. 4). సెక్షనులు 3,4లలో నిషేధించ బడిన పనులు చేసినవారికి 2 సంవత్సరాలకు మించని కారాగార శిక్ష, 2 వేలకు మించని జరిమానా రెండునూ శిక్షలు. 2వ సారి నేరం చేసిన వ్యద్దాయికి కనీసం 6 నెలలు జైలు శిక్ష వేయాలి. 5 సం॥ వరకు జైలు శిక్ష వేయవచ్చును.

48. ప్ర ఈ నేరాలలో ముద్దాయిని ఎలా అరెస్టు చేయవచ్చును? జామీను నిబంధన ఎలా వున్నాయి ?

జ వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చును (సెక్షను 7(2)). ముద్దాం జామీను పొంద అర్హుడు.(సెక్షను 8(1)).

49. ప్ర ఈ శాసనం వల్ల వ్యాపార ప్రకటనలలో స్త్రీల ఆసభ్య చిత్రీకరణ తగ్గిందా

జ లేదు. ప్రభుత్వాధికారులు పట్టుదలతో పనిచేస్తే కేసులకు భయప వ్యాపారస్తులు స్త్రీల శరీరాల బొమ్మలను తమ వ్యాపార ప్రకటనలకు వాడుకోవట మానివేస్తారు.

## వ్యభిచారం

50. ప్ర వివాహిత స్త్రీ పరపురుషునితో వ్యభిచరిస్తే ఎవరు అతనిపై కేసు పెట్టవచ్చును

జ భర్త మాత్రమే కేసు పెట్టగలడు. శిక్ష 5 సం॥ జైలు లేక జరిమానా, రెండూను భర్త సమ్మతితో యీ వ్యభిచారం జరిగినా, భర్త చూసీచూడనట్లు వూరకొనినా కేసులేదు. ఏదయినా ఈ నేరం యొక్క ఆంతర్యం ఏమంటే భార్య దేహం ఆమె భర్త సొత్తు అని. ఈ భావం ఆధునిక ప్రపంచంలో సరికాదు. ఈ నేరాన్ని భారత శిక్షా స్మృతి నుండి తొలగించాలి.

51. ప్ర వివాహిత స్త్రీ పరాయి పురుషునితో వ్యభిచరిస్తే భర్త ఏమి చేయాలి ?

జ ఆమెకు అతడు కోర్టుద్వారా విడాకులు యివ్వవచ్చు.

52. ప్ర వ్యభిచారం చేసిన భార్యను భర్త దండించవచ్చా? చంపవచ్చా?

జ భర్త ఆమెను దండించరాదు. చంపరాదు.

53. ప్ర అంటే ఆమె చేసిన పని మంచిదంటారా ?

జ కాదు. ఆమె ఘోరమయిన తప్పిదం చేసింది. వైవాహిక జీవితంలో పరస్పర ప్రేమ, విశ్వాసం, అత్యవసరం. వాటిని వమ్ముచేయడం ధర్మం కాదు. అయితే ఆ తప్పుకు అంతకు ఎన్నోరెట్లు మించిన శిక్ష న్యాయం కాదు.

## జారత్వం

54. ప్రశ్న అవివాహిత స్త్రీ ఒక పురుషునితో లైంగిక సంబంధం పెట్టుకోవటం నేరమా ?

జ॥ అలాంటి నేరాన్ని భారత శిక్షాస్మృతిలో పేర్కొనలేదు. మరి ఏచట్టంలేనూ అది నేరంగా చెప్పబడలేదు. స్త్రీ వివాహిత అయినా కాకపోయినా, ఆమెకు 18సం॥ నిండినా నిండకపోయినా ఆమెకు శిక్షలేదు. వివాహానికి ముందు స్త్రీ సెక్సు అనుభవాన్ని పొందరాదని భారతీయ సమాజం, మతాలు ఘోషించాయి. కొన్ని మతాలు జారత్వాన్ని నేరంగా పరిగణించాయి. అయితే క్రిమినలు వ్యవహారంతో, అంటే నేరాల విషయంగా మతాలు చెప్పినట్లుగా శాసనాలు లేవు. నేరాలకు సంబంధించిన శాసనాలను మన దేశంలో బ్రిటిష్ వారు రూపొందించారు. అవి అన్ని మతాలవారికి వర్తిస్తాయి.

55. ప్రశ్న సమాజం ఎందుకు దానిని నిరసించింది ?

జ॥ పూర్వం స్త్రీ పురుషుల కలయిక మామూలుగా సంతానానికి దారితీసేది. అది పురుషాధిక్య సమాజం కనుక స్త్రీ తనకు చెంది వుండాలని, ఆమె తన ద్వారా సంతానాన్ని కనాలని పురుషుడు ఆశించాడు. అందుకే అలా కట్టడిచేశాడు. ఈనాడు జన్మ నిగ్రహసాధనాలు అందుబాటులోకి రావడంతో పురుషునితో లైంగిక సంబంధం పెట్టుకున్న స్త్రీ విధిగా గర్భవతి కానక్కరలేదు. పరిస్థితి మారింది.

56. ప్రశ్న జన్మ నిగ్రహసాధనాలకు స్త్రీలకు అమ్మటం, స్త్రీలు కొనుగోలుచేయటం నేరమా ?

జ॥ కాదు. ప్రభుత్వమే స్త్రీలకు వాటిని అందిస్తున్నది. బజారులో వాటిని నిర్నిబంధంగా అమ్ముతున్నారు.

57. ప్రశ్న అవివాహిత, విడాకులు పొందిన స్త్రీ, వితంతువు తల్లి అవటం నేరమా ?

జ॥ నేరం కాదు. అయితే సమాజం ఆమె చర్యను గర్హిస్తున్నది; నిరసిస్తున్నది ఆమెను చిన్న చూపు చూస్తున్నది; నిందిస్తున్నది అంతే.

## పడుపు వృత్తి

58. ప్ర॥ పడుపు వృత్తి అంటే ఏమిటి?

జ॥ లబ్ధిపొంది స్త్రీ తన దేహాన్ని పురుషులు వాడుకోవటానికి యివ్వటం పడు వృత్తి. అంటే డబ్బు, వస్తువు, ఆస్తి తీసుకొని వాటిని యిచ్చిన పురుషుని లైంగిక సంపర్కానికి పూనుకోవటం.

59. ప్ర॥ పడుపువృత్తి నిర్మూలనకు శాసనం వుందా ?

జ॥ ఉంది. దానిని అవినీతికర క్రయ విక్రయ నిషేధ శాసనం అంటారు. ఇ 1956లో వచ్చింది. దానిని 1986లో సవరణ చేశారు. దీనిని మామూలు వ్యభిచార నిరోధ శాసనమంటారు.

60. ప్ర॥ ఇది స్త్రీ పురుషులకు యిద్దరికే వర్తిస్తుందా ?

జ॥ పూర్వం స్త్రీలే ఈ శాసనం క్రింద నేరస్తులు. ఇపుడు స్త్రీపురుషులిరువురు నేరస్తులు కాగల నియమాలు ఉన్నాయి.

61. ప్ర॥ వాటి నిబంధనలు ఏమిటి ?

జ॥ లైంగిక దోపిడీకి లేక మరొకరి లాభం కొరకు దుర్వినియోగం చేయటానికి లే యిద్దరు, ఇద్దరిరికి మించిన వేశ్యల పరస్పర ప్రయోజనాలకు వాడబడే ఇల్లు గది లేక వాహనం లేక వాటిలో భాగాలు లేక ప్రదేశము, పడుపు గృహ అనబడును (సెక్షను 2ఎ). లైంగిక దోపిడీ లేక మనుష్యులను అక్రమంగ వినియోగించటం అనేవి వ్యాపారం కొరకు చేస్తే దానిని వేశ్యా వృత్తి లేక పడుపు వృత్తి అంటాం (సెక్షను 2 ఎఫ్). వేశ్యావృత్తిని చేపట్టిన స్త్రీని వేశ్య అని పిలుస్తాం లాభం కొరకు వ్యభిచార గృహాన్ని నడిపితే అది నేరం (సెక్షను 3(1)). స్త్రీ తన దేహాన్ని విచక్షణ లేకుండా అందరికీ అందుబాటులో వుండేటట్లు లైంగిక సంభోగం కోసం అమ్మడాన్ని పడుపువృత్తి సాగించటం క్రింద లెక్క. దీనిని గురించిన శాసన నియమాలు తమాషాగా వున్నాయి. ఒక ప్రదేశాన్ని 'వ్యభిచార ప్రదేశంగా' వాడటానికి అనుమతించిన వారు శిక్షకు పాత్రులు (సె.3(1)). అదే వేశ్య 16 సం॥ నిండనిబాలిక అయినా, మైనరయినా అది పెద్దనేరం (సె.4(1)). వేశ్యావృత్తికొరకు వేశ్యావృత్తిని చేపట్టటానికి ఏ వ్యక్తినయినా తీసుకొని వచ్చినా,

లేక తీసుకొని వచ్చుటకు ప్రయత్నించినా లేక ఆమెను సంపాదించినా, లేక ఆమెను సంపాదించటానికి ప్రయత్నం చేసినా, వేశ్యా వృత్తిని చేపట్టమని ప్రోత్సహించినా అవన్నీ నేరాలే(సె.5(1) వ్యభిచార గృహంలో లేక వ్యభిచార ప్రదేశంలో ఏ వ్యక్తినయినా-ఆవ్యక్తి యిష్టంతోగాని, యిష్టం లేకుండాగాని వుంచినా, ఆ వ్యక్తి భర్తతో/భార్యతో కాక యితరులతో లైంగిక సంపర్కం కలిగి వుండటానికి ఉద్దేశించి వుంచినా నేరాలే (సెక్షను 6). కొన్ని ప్రాంతాలను ఎంపికచేసి ఆ ప్రాంతాలలో పడుపువృత్తి సాగించరాదని ప్రభుత్వం, ప్రభుత్వ అధికారులు ప్రకటించవచ్చు (సెక్షను 7(3)). అచ్చటి జనాభాను బట్టి, జనాభా స్వభావాన్నిబట్టి ఆ ప్రాంతాలకు తరుచుగా వచ్చే వ్యక్తుల వివిధ సముదాయాలను బట్టి ఆ ప్రాంతాలను నిర్ణయించవచ్చు. ఇలా ప్రకటించబడిన ప్రాంతాలు లేక మత పరమయిన పూజలు, ప్రార్థనలు చేసే ప్రాంతాలు, విద్యాలయాలు, వసతి గృహాలు, ఆస్పత్రులు, వ్యాధిగ్రస్తుల వైద్య వసతి గృహాలు లేక పోలీసు కమీషనరు చేత ప్రకటించబడిన బహిరంగ ప్రదేశాలు వీటికి 200 మీటర్ల పరిధిలో పడుపు వృత్తి చేసినా, సాగించినా అవి నేరాలే: శిక్ష 3 నెలలకు మించని జైలు నివాసం. వేశ్యా జీవితం సాగించే వ్యక్తి బాలుడు అయినా బాలిక అయినా శిక్ష కనీసం 7 సంవత్సరాల కారాగారవాసం జీవితకాలం ఖైదు లేక 10 సం॥ మించని ఖైదు వేయవచ్చును. జరిమానా కూడా విధించవచ్చును. ఏ బహిరంగ ప్రదేశంలో కాని లేక బహిరంగ ప్రదేశంనుండి చూడడానికి, వినడానికి అవకాశం వున్నచోటకాని ఏ భవనం నుండికాని నిర్మాణం నుండి కాని యీ క్రింద పేర్కొనబడిన చర్యలను చేయడం నేరం. ఏ వ్యక్తి అయినా తన మాటల ద్వారా, సైగలద్వారా, తన దేహాన్ని బహిరంగ పర్చటం ద్వారా, ఏ వ్యక్తినయినా వ్యభిచారంకొరకు ప్రేరేపించినా, లేక లోభపెట్టినా, ప్రార్థించినా, మరులు కొల్పినా, తాకి పీడించినా, లేక ఆకర్షించినా లేక అలాంటి చర్యలకు ప్రయత్నించినా అవి నేరాలే. ఏ వ్యక్తినయినా తనకు ధనం యిచ్చి వ్యభిచరించమని పిలిచినా, ఆ ప్రాంతంలో కాపురముండే వారికి లేక తిరిగే వారికి చీకాకు కల్గించినా లేక ప్రజా సభ్యతకు విరుద్ధంగా ప్రవర్తించినా అవి నేరాలే. వీటికి 6 నెలలు దాటని జైలు, రు.500 దాటని జరిమానా లేక రెండూను. ఇలాంటి నేరం రెండోసారి చేస్తే శిక్ష పెరుగుతుంది. అది 1 సం॥ జైలు శిక్ష అవుతుంది. ఈ నేరాన్ని

మగవాడు చేస్తే 7 రోజులు దాటని కనీస శిక్ష, 3 నెలలు దాటని గరిష్ట శిక్ష(సె 8). ఈనాడు వేశ్యలు చాలామంది శిక్షలకు పాత్రులవుతున్నారు. ఊ మారినపుడల్లా వేశ్యలు పేరు మార్చుకుంటునందువల్ల పాత శిక్షల రికార్డు దొరకదు. శరణాలయాల అధికారులు, రక్షణాలయాల అధికారులు త అధీనంలో వున్న వ్యక్తులను వేశ్యా వృత్తిని చేయమని ప్రేరేపిస్తే, వారి శీలాన్ని చెడగొట్టే పని చేస్తే లేక ఆ పనికి సహాయాన్ని అందిస్తే, ప్రోద్బలం చేస్తే కనీసం 7 సం॥ కారాగారా శిక్షకు పాత్రులు. 10 సం॥ మించని జైలు శిక్ష వేయవచ్చు.

62. ప్ర॥ సైగలు వగయిరాలు చేయకుండా, మశీదులు, చర్చిలు, దేవాలయాలు, గురుద్వారాలు, విద్యాలయాలు లాంటివాటికి 200 మీ. దాటిన యింట్లో ఒక స్త్రీ వేశ్యావృత్తిని చేయవచ్చా ?

జ॥ అలా ఆమె చేస్తే కేసులేదు. అయితే ఆమె కాపురముంటున్న ప్రాంతం అధికారం ఉన్న మెజిస్ట్రేటు ఆమెను ఆ ప్రాంతం నుండి వెళ్ళి పొమ్మని లేక తన అధీనంలో వున్న ఫలాని ప్రాంతంలో వుండాలని ఉత్తరువు యివ్వ వచ్చును.(సెక్షను 20(31)). అయితే యీ ఉత్తరువు ఆమె సంజాయిషీ పొందిన తరువాతనే యివ్వవలెను(సెక్షను 20(1), (2), (3)).

63. ప్ర॥ వ్యభిచార గృహంలోని వేశ్యావృత్తి చేస్తున్న స్త్రీపై మెజిస్ట్రేటు ఎలాంటి అధికారం చలాయించవచ్చు?

జ॥ ఆమెను హాజరు పరచమని పోలీసులకు ఉత్తర్వులిచ్చి, ఆమె మైనరు అయితే తల్లి దండ్రులకు/సంరక్షకులకు అప్పచెప్పవచ్చు (సెక్షను 17ఎ). బాల బాలికల చట్టం క్రింద నిర్వహింపబడే రక్షణాలయాల్లోవారిని ఉంచమని ఉత్తరువు యివ్వవచ్చు (సెక్షను 17(3). వ్యభిచార గృహాలు వున్న భవనాల యిళ్ళ యజమానులను, అద్దెకు తీసుకున్న వారిని ఖాళీ చేయించగల అధికారం మేజిస్ట్రేటుకు వుంది (సెక్షను 18). తనను రక్షణాలయంలో వుంచమని వేశ్యావృత్తి చేస్తున్న లేక యితరుల బలవంతం మీద వృత్తి చేస్తున్న ఏ వ్యక్తి అయినా కోరవచ్చును. విచారణ చేసి మేజిస్ట్రేటు ఆమె కోరికను మన్నించవచ్చును (సెక్షను 19).

64\. ప్ర॥ వేశ్యాగృహాలలోని వేశ్యలను పోలీసులు కొట్టవచ్చా? వారి సామానులను పగుల గొట్టవచ్చా?

జ॥ అలా చేయడానికి పోలీసులకు అధికారం లేదు. అయితే వారిపై కేసులు పెట్టవచ్చును.

65\. ప్ర॥ వేశ్యాగృహాలపై ఎవరు దాడి చేయవచ్చును?

జ॥ పెద్ద ఆఫీసరు ఉత్తరువుతో సోదా చెయ్యవచ్చును.

66\. ప్ర॥ ఎవరు వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చును ?

జ॥ ఇనస్పెక్టరు హెూదా కలవారు వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చును.

67\. ప్ర॥ ఎవరి మీద ఎక్కువగా కేసులు పెడుతున్నారు?

జ॥ వేశ్యావృత్తి చేసే స్త్రీల మీద.

68\. ప్ర॥ వేశ్యల దగ్గరకు వచ్చే విట పురుషులు నేరస్తులేనా?

జ॥ అవును.

69\. ప్ర॥ ఈ శాసనం క్రింద పురుషులపై తక్కువ కేసులు వుంటున్నాయి. కారణమేమిటి?

జ॥ ఇది పురుషాధిక్య సమాజం కావటమే. సమాజం పురుషుల వ్యభిచారాన్ని చూసీ చూడనట్లు వూరుకుంటున్నది. స్త్రీల పట్ల కఠినంగా ప్రవర్తిస్తున్నది.

70\. ప్ర॥ ఈ వృత్తిని పూర్తిగా తొలగించగలమా?

జ॥ స్త్రీలను వస్తువులుగా చూచే మనస్తత్వం కల పురుషులున్నంత కాలం, స్త్రీలను బాధ పెట్టే పురుషులు, వారికి మద్దతుగా వుండే స్త్రీలు ఉన్నంతకాలం ఇది నశించటం కష్టం.

71. ప్ర॥ వరకట్నం అన్నా కట్నం అన్నా ఒకటేనా ?

జ॥ వేదకాలంలో కట్నం అంటే ఆడపిల్లకు పెండ్లి అపుడు యిచ్చేది. అనాకో ఆడపిల్లలకు, వికలాంగులైన యువతులకు పెళ్ళికావటం కష్టం అవుతుంటే పెండ్లికుమారికి ప్రోత్సాహకారణంగా వధువుకు కట్నం యిచ్చేవారు. ఆనాడు వరునికి నామకః వరదక్షిణ వుండేది. దానిని గురించి బేరసారాలు వుండేవి కావు. అది లాంఛనప్రాయంగా చాల కొద్ది మొత్తంగా వుండేది. తరువాత హిందువులలో ఆడపిల్ల తండ్రికి ధనం, ఆస్తి (ఆనాడు ఆవులు) యిచ్చి పిల్లను పెళ్ళి చేసుకునేవారు. అది పోయి వరునికి వధువును వివాహమాడినందుకు పైకం, ఆస్తి అందజేయసాగారు. దాన్ని వరకట్నం అనసాగారు. వాడుకలో కట్నం అని అనడం జరిగింది. ఈనాడు వాడుకలో కట్నం అన్నా వరకట్నం అన్నా ఒకటే.

72. ప్ర॥ ఈ ఆచారం - వరునికి కట్నం యిచ్చే ఆచారం - ఏ మతాల వారిలో ప్రారంభమయింది?

జ॥ ఇది పూర్తిగా హిందూమతంలో కొన్ని కులాల ఆచారం. కాలక్రమేణ ముసల్మాను, క్రైస్తవ మతాల వారిలో కూడ వ్యాపించింది. మొదట్లో ముసల్మానులలో వరునికి కట్నం లేదు. పైగా వధువుకు 'మహర్'ను వరుడు చెల్లించవలసి వచ్చేది. క్రైస్తవులలో 'మహరు' లేదు. కట్నం లేదు. ఈనాటి ధనస్వామ్య సమాజంలో పెద్ద మతాలయిన హిందూ, ముస్లిం, క్రైస్తవ మత సమాజాలలో వరకట్న దురాచారం విలయతాండవం చేస్తున్నది.

73. ప్ర॥ వరకట్నానికి 'ఓలి' కి బేధం ఏమిటి?

జ॥ కొన్ని కొండజాతులలో, కొన్ని ఆదిమ సమాజాలలో వెనుకబడిన కులాలలో 'ఓలి' యిచ్చే ఆచారం ప్రబలంగా వుంది. పిల్లనిచ్చి పెళ్ళి చేసినందుకు పిల్ల తండ్రికి/ సోదరునికి చెల్లించే పైకాన్ని 'ఓలి' అంటారు. ఇది వధువుకు చెందదు. వధువు తండ్రికి/సోదరునికి చెందుతుంది. దంపతులు విడాకులు తీసుకోవాలంటే 'ఓలి'ని విధిగా భర్తకు తిరిగి యివ్వాలి. 'ఓలి' లాంఛన

ప్రాయంగా చిన్నమొత్తంగా వుంటుంది. కట్నానికి పరిమితి లేదు. ఎంత పెద్దమొత్తమయినా వుండవచ్చును.

74. ప్ర। వరకట్నాన్ని పూర్వం ఎలా యిచ్చేవారు ?

జ। పెళ్ళిముహూర్త సమయంలో పళ్ళెంలో రూపాయలు పోసి పెళ్ళి కుమారునికి యిచ్చేవారు. ఇది బహిరంగంగా జరిగేది. అల్లునికి ఎంత కట్నం యిస్తే అంత గొప్పగా బహావించేవారు.

75. ప్ర। వధువుకు పెళ్ళి అపుడు ఏమి యిచ్చేవారు ?

జ। పుట్టింటి వారు వధువుకు సొమ్ములు, చీరెలు యిచ్చేవారు. సొమ్ములను 'బాలతొడుగు' అనేవారు. వరుని తల్లిదండ్రులు వధువుకు నగలు యిచ్చేవారు. మామూలుగా అవి వరునికి యిచ్చిన కట్నంలో సగం విలువ కలిగి వుండేవి. ఉదారులు కట్నం ఎంతో అంత వధువుకు సొమ్ముల క్రింద యిచ్చేవారు. కక్కుర్తి పడే వరుని తల్లిదండ్రులు అసలు వధువుకు ఏమి సొమ్ము పెట్టేవారు కాదు.

76. ప్ర। ఇప్పటికీ అంటే 1961లో వరకట్న నిషేధ శాసనం వచ్చిన తరువాత కూడా కట్నంయిచ్చే పద్ధతి సాగుతున్నదా ?

జ। చదువుకున్న వారిలో కట్నం యివ్వడం, తీసుకోవడం రహస్యంగా జరిగిపోతున్నది. వధువు వైపువారు పెళ్ళికి ముందే గుట్టు చప్పుడు కాకుండా కట్నాన్ని వరునికి లేక వరుని తల్లితండ్రులకు అందచేస్తున్నారు. ఆ పైకం ముట్టేనే పెళ్ళి జరుగుతుంది. లేకపోతే ముహూర్తాలు పెట్టుకున్నా, నిశ్చితార్థం జరిగినా పెళ్ళి ఆగిపోతుంది. ఇక 'అగ్రకులాలు' కాని కొన్ని కులాల వారిలో యిప్పటికీ వరునికి ఇన్ని తులాల బంగారం, బంగారపు ఉంగరం, సైకిలు, స్కూటరు, చేతి గడియారం ఇస్తున్నారు. ఇదంతా బహిరంగంగానే జరిగిపోతున్నది.

77. ప్ర। కట్నం యివ్వని కులాల వారు హిందువులలో వుండేవారా ?

జ। ఉండేవారు. ఆంధ్రప్రాంతంలోని కమ్మవారిలో వరునికి బహుమతులు తప్ప వరకట్నం యిచ్చేవారు కాదు. వధువుకు పొలం, సొమ్ములు యిచ్చేవారు.

ఆమెకు సంతానం కలిగేవరకు ఆ పొలాన్ని తండ్రి తన స్వాధీనం వుంచుకొని దానిపై ఆదాయాన్ని కూతురుకు యిచ్చేవాడు. తన కూతురు సంతానం కలుగగానే ఆమెపేర పొలాన్ని రిజిష్టరు చేసేవాడు. దీన్ని 'పసు కుంకుమ' క్రింద యిచ్చే ఆస్తిగా భావించేవారు. కుమార్తె నిస్సంతుగా చని ఆ పొలం ఆమె పుట్టింటి వారికే చెందేది. కాలం మారుతున్న కొ వరకట్నం కమ్మవారిలో కూడ చోటు చేసింది. 'మీ అమ్మాయికి మీ యిచ్చుకునేది సరే. వరునికి ఏమి యిస్తారు?' అని అడిగి కట్నం దబాయి పుచ్చుకుంటున్నారు. వందలు పోయి వేలు దరిమిలా లక్షల ప్రమాణం కట్నాలు యీనాడు వుంటున్నాయి. పాత కాలపు ఆచారాలలో స్త్రీల కొంతగా కొంత భద్రత వుండేది. అది పోయింది.

78. ప్ర| వరకట్న విధానం ఎందుకు యింతగా ప్రబలింది ?

జ| స్త్రీకన్న పురుషుడు అధికుడు అనే భావం ముఖ్యంగా దీనికి కారణం.

ప్ర| వరకట్న విధాన్ని సమర్థించేవారు ఏమని వాదిస్తున్నారు?

జ| 1. వధువు బాధ్యతను వరుడు తీసుకుంటున్నాడు కనుక;

2. వధువుకు అండను, రక్షణను వరుడిస్తున్నాడు కనుక;

3. కూతురుకు 1985కు పూర్వం తండ్రి పిత్రార్జితపు ఆస్తిలో వాటా లేద కనుక;

4. అత్తగారి కుటుంబపు హోదాకు 'నజరానా' అది;

5. కన్యాదాన సమయంలో వరునికి సంప్రదాయంగా యిచ్చేది;

6. వరుని సోదరి పెళ్ళికి కట్నం యివ్వాల్సిన అవసరం ఏర్పడుతున్నందున

7. వరుని తల్లితండ్రులు అతని చదువుకు పెట్టుబడి పెట్టున్నారు కనుక వారి పరిహారంగా వరకట్నం;

8. పరోక్షంగా వధువుకోసం ఉద్దేశింపబడింది;

ఈ పై కారణాల వల్ల వరకట్నం తీసుకోవటం న్యాయమేనట!

80. ప్ర॥ వరకట్నం పనికి రాదనే వారి వాదన ఏమిటి?

జ॥ (1) వధువు అత్తయింటిలో ఊరక కూర్చొని తినటం లేదు. పొలాలలో, ఎఫ్యాక్టరీలలో యితరత్రా శ్రమ చేస్తున్నది. అలా కాకపోయినా యింటిలో బండెడు చాకిరీ చేస్తున్నది. దానికి విలువకట్టే ఆమె తిండికి, పోషణకు ఆమె సంపాదిస్తున్నట్లే;

(2) స్త్రీకి ఎపుడూ రక్షణ కావాలనేది అసత్యం. శ్రామిక స్త్రీలకు రక్షణ అక్కరలేదు. ఒకవేళ రక్షణ కావాలన్నా ఎవరినుండి? పురుషుల నుండే కదా! పురుష జాతి ఒకవైపు ఆమె శారీరక, మానసిక బధ్రతకు బఫంగం కలిగిస్తూ మరోవైపు ఆమె రక్షణ బఫారానికి ప్రతిఫలం అడగడం విడ్డూరం;

(3) ఆమెకు 1985కు పూర్వం తండ్రి పిత్రార్జితపు ఆస్తిలో వాటా లేని మాట నిజమే. మరి అయితే నగలరూపకంగా, పసుపు కుంకుమ క్రింద యిచ్చేవారు కదా;

(4) కట్నం, దాని బేరసారాలు జరగటంతో వధువు గుణగణాలకు విలువ లేకుండా పోతున్నది;

(5) వధువు తల్లితండ్రులు ఆర్థికంగా చితికి పోతున్నారు. వధువుకు ఆస్తిలో వాటా యివ్వటం వేరు. ఆస్తిని అమ్మి వరుని చేతుల్లో కట్నరూపకంగా పొయ్యటం వేరు;

(6) వరకట్నం తీసుకున్న వరుడు, అతని కుటుంబం వారు నరమాంసం చవిచూచిన పులుల వలె యింకా కట్నం తెమ్మని వధువును బాధిస్తారు;

(7) కన్యను దానం పుచ్చుకున్న వరుడు కన్యాదాత కన్న అధికుడవుతున్నాడు;

(8) వధువు వరకట్నం యిచ్చి వరుని కొనుక్కుంటున్నది. అయితే యిక్కడ ఆమె కొన్న వస్తువు – వరుడు – ఆమెకు యజమాని అవుతున్నాడు. ఇదెక్కడి న్యాయం?

(9) చివరకు తేలిందేమంటే ప్రఖ్యాత తెలుగు కవి 'ముద్దుకృష్ణ' అన్నట్లు "ఆడపిల్లను కన్నందుకు వధువు తండ్రికి వరుడు వేసే జరిమానా";

వీటిని పరికిస్తే వరకట్నం అన్యాయమని, అక్రమమని, దుర్మార్గమని, దురాచారమని తెలుతుంది.

81. ప్ర। ఈనాటి వరకట్న దురాచార ఎఫలితాలు ఏమిటి ?

జ। (1) వరకట్నం కోసం భార్యను/కోడలిని వేధించటం;

(2) అదనపు వరకట్నం స్త్రీ పుట్టింటివారు యివ్వలేదని ఆమెను భర్త లేక అతని తల్లితండ్రులు, అక్కచెల్లెళ్ళు, అన్నతమ్ములు చంపటం లేక ఆమె ఆత్మహత్య చేసుకునేటట్లు ఆమెను ప్రేరేపించటం.

82. ప్ర। వరకట్న నిషేధశాసనం ఆంధ్రప్రదేశ్‌లో ఎపుడు వచ్చింది ?

జ। 1958లో వచ్చింది.

`3. ప్ర। దేశం మొత్తానికి ఎపుడు వచ్చింది?

జ। 1961లో కేంద్రశాసనం ద్వారా నిషేధం వచ్చింది.

ప్ర। పై శాసనం సంతృప్తికరంగా వుందా ?

జ। లేదు. ప్రభుత్వం చేత నియమింపబడిన 'స్త్రీల హోదా కమిటీ' నివేదిక (1974) యీ శాసనాన్ని లోపభూయిష్టమని ప్రకటించి సవరణ చేయమని కోరింది.

85. ప్ర। 1961 చట్టాన్ని ఎపుడు సవరించారు?

జ। 1984లో మొదటిసారిగా; 1986లో రెండవసారిగా సవరణ చేశారు.ం

86. ప్ర। ఇది ఎవరికి వర్తిస్తుంది?

జ। భారతీయ పౌరులందరికి వర్తిస్తుంది.

. ప్ర। ఈ శాసనం క్రింద ఏది కట్నమవుతుంది?

జ। వివాహంలో ఒక పక్షం(పార్టీ) అంటే వధువు/వరుడు మరియొక పక్షానికి(పార్టీ) అంటే వరుడు/ వధువు లేక ఒక పార్టీ తల్లిదండ్రులు కాని మరెవ్వరైనా కాని లేక ఒక పార్టీ తల్లిదండ్రులు కాని మరెవ్వరైనా కాని, రెండవపార్టీకి లేక మరియొక వ్యక్తికి ఆ పార్టీల పెళ్ళి సందర్భంగా ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని

స్థిరాస్తి, ధనం, విలువగల పత్రం, చరాస్తి వగయిరాలను యిచ్చుటకు అంగీకరిస్తే అలా యివ్వబడినది కట్నం అనబడును. ముసల్మాను మతధర్మశాస్త్ర ప్రకారం స్త్రీకి యివ్వ నిర్ణయించుకున్న 'మహర్' దీని క్రిందకు రాదు. (శాసనపు సెక్షను 2)

88. ప్ర॥ కట్నం యిస్తే, పుచ్చుకుంటే శిక్షలు ఎలా వున్నాయి?

జ॥ ఎవరయినా కట్నం యిచ్చినా, పుచ్చుకున్నా లేక యివ్వడానికి లేక పుచ్చుకోవడానికి తోడ్పడినా ఆ వ్యక్తికి 5 సం॥కు తక్కువ కాని జైలు శిక్ష వుంటుంది. వరకట్నం, రు. 15000 వీటిలో ఏది ఎక్కువయితే అంత జరిమానా వెయ్యాలి. (శాసనపు సెక్షను 3(1)

89. ప్ర॥ బహుమతులు తీసుకోవటం ఎపుడు నేరం కాదు ?

జ॥ ఎవరిచేతా కోరబడకుండా వరునికి యివ్వబడిన బహుమతులు అతడు జాబితా రాస్తే మరియు వధువు తరఫునగాని, వధువుకు బంధువయిన వ్యక్తి నుండి గాని యివ్వబడి, అవి ఆచార ప్రకారం యివ్వబడే బహుమతులు అయి, ఎవరివల్ల లేక ఎవరి తరఫున ఆ బహుమతులు యివ్వబడినవో ఆ వ్యక్తి యొక్క ఆర్థికస్తోమతును పరిగణనలోకి తీసుకొనినచో అధిక విలువ కానివి అయినచో, అవి కట్నం క్రిందికి రావు. (శాసనపు సెక్షను 3 (2)

90. ప్ర॥ శాసనంలోని నిబంధనలకు వ్యతిరేకంగా బహుమతులు తీసుకున్న వరునికి ఏమి శిక్ష?

జ॥ కట్నం తీసుకున్న నేరానికి ఎంత శిక్షయో అంతే శిక్ష. జైలు శిక్ష మరియు పది వేలు.

91. ప్ర॥ కట్నం యిమ్మని కోరితే నేరమా? శిక్ష ఏది?

జ॥ ఏ వ్యక్తి అయినా ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని వధువు లేక వధువు తల్లిదండ్రుల నుండి లేక బంధువుల నుండి లేక సంరక్షకుని నుండి కట్నం అడిగినచో (డిమాండు చేసినచో) అది నేరమే. 6 నెలలకు తగ్గకుండా 2 సం॥ మించకుండా జైలుశిక్ష మరియు 10వేల రూపాయలకు మించకుండా జరిమానా శిక్షలు విధించవచ్చును. (సెక్షను 4)

92. ప్ర॥ వివాహ సంబంధంగా ఏ ప్రకటనలు శిక్షార్హాలు ?

జ॥ తన కుమార్తెను/కుమారుని వివాహమాడే వారికి లేక వారి బంధువులకు తన ఆస్తిలో వాటాను లేక ధనాన్ని లేక రెంటినీ, తన వ్యాపారంలో భాగాన్ని లేక తన యితర హక్కును యిస్తానని ఎవరయినా వార్తాపత్రికలో, మాస, పక్ష, వార పత్రికలో, పంచికలో ప్రకటిస్తే ఆ వ్యక్తికి 6 నెలలు తక్కువ కాని 5 సం॥ మించని జైలుశిక్ష మరియు 15వేల రూపాయలకు మించని జరిమానా వేయవచ్చును. (శాసనపు సెక్షను 4ఎ).

93. ప్ర॥ కట్నం యివ్వడానికి పుచ్చుకోడానికి చేసుకున్న ఒప్పందం (కంట్రాక్టు) చెల్లుతుందా?

జ॥ శాసన దృష్టిలో చెల్లదు. దానిని అమలు పరచమని కోరటానికి వీలు లేదు (సెక్షను 5ఎ)

94. ప్ర॥ కట్నం వధువుకు తిరిగి యిచ్చేయాలా ?

జ॥ ఏ స్త్రీ వివాహ సందర్భంగా కట్నం ఏ వ్యక్తి చేత నయినా తీసుకొనబడినచో ఆ వ్యక్తి - ఆ స్త్రీ కాక - ఆ కట్నాన్ని ఆ స్త్రీ కి యిచ్చి వేయవలెను. (సెక్షను 6).

ప్ర॥ ఎప్పటిలోగా పైన చెప్పినట్లు కట్నాన్ని తిరిగి యివ్వాలి?

జ॥ (1) కట్నం పెళ్ళికి ముందే తీసుకుంటే పెళ్ళి తేదీనుండి 3 మాసాలలోగా;

(2) కట్నం వివాహమప్పుడు గాని లేక తరువాత గాని తీసుకుంటే తీసుకున్న తేదీ నుండి 3 నెలలోగా;

(3) వధువు మైనరుగా వున్నప్పుడు తీసుకుంటే ఆమెకు 18 సం॥ నిండిన 3 మాసాలలోగా; ఆమెకు అందచేయవలెను. (సెక్షను 6 (1))

5. ప్ర॥ కట్నాన్ని అలా తిరిగి యివ్వకపోతే శిక్ష ఏది ?

జ॥ 6 మాసాలకు తక్కువ కాని 2 సం॥ మించని జైలుశిక్ష లేక 10 వేలకు మించని జరిమానా లేక రెండూను (సెక్షను 6 (2).

ప్ర॥ హక్కుదారయిన స్త్రీ చనిపోతే కట్నం ఎవరికి చెందుతుంది?

జ॥ ఆ స్త్రీ వారసులకు చెందుతుంది (సెక్షను 6 (3)

98. ప్ర॥ పైన చెప్పి ప్రకారం శిక్ష చెప్పకముందు కట్నం తీసుకున్న వ్యక్తి ఆమెకు అందచేయపోతే ఏం జరుగుతుంది ?

జ॥ కట్నం తీసుకున్న వ్యక్తికి శిక్ష వేయడమే కాక, ఆ కట్నాన్ని స్త్రీకి చేర్చమని అతనికి లేక ఆమెకు కోర్టువారు ఉత్తరువు జారీ చేయవచ్చును. అలాంటి ఉత్తరువును కోర్టువారుయిచ్చిన గడువులోపల ఆ వ్యక్తి ఖాతరు చేయకపోతే ఆ కట్నపు విలువను కోర్టువారు వేసే జరిమానాను వసూలు చేసే పద్ధతిలో ఆ వ్యక్తి ఆస్తినుండి రాబట్టవచ్చును (సెక్షను 6 ఎ).

99. ప్ర॥ ఈ కేసులను ఎవరు విచారించాలి ?

జ॥ ఫస్టు క్లాసు మేజిస్ట్రేటు.

100. ప్ర॥ ఎవరి ఫిర్యాదు మీద ఈ శాసనంలో పేర్కొనబడిన కేసులను విచారించవచ్చును?

జ॥ (ఎ) మేజిస్ట్రేటు తనకు స్వయంగా తెలిసిన విషయాన్ని ఆధారం చేసుకొని కేసు నమోదు చేసుకోవచ్చును.

(బి) ఈ దిగువ పేర్కొన్న వారి ఫిర్యాదు పైన కేసును ఫైలులోకి తీసుకోవచ్చును. (1) పోలీసువారు (2) నేరం వల్ల బాధకు లోనయిన వ్యక్తి (3) బాధిత వ్యక్తి తల్లిదండ్రులు (4) బాధిత వ్యక్తి బంధువులు (5) రాష్ట్ర ప్రభుత్వం చేత గుర్తింపబడిన సంక్షేమ సంఘం.

101. ప్ర॥ ఈ కేసులలో రుజువు భారం ఎవరిపైన వుంది?

జ॥ ఏ వ్యక్తి అయినా వరకట్నం తీసుకున్నందుకు లేక తీసుకోటానికి తోడ్పడినందుకు సెక్షను 3 క్రింద, లేక వరకట్నాన్ని డిమాండు చేసినందుకు సెక్షను 4 క్రింద కేసు పెట్టబడితే నేరంచేయలేదని ముద్దాయి రుజువు చేసుకోవాలి (సెక్షను 8 ఎ).

102. ప్ర॥ వరకట్న నిషేధ ఆఫీసర్లను రాష్ట్ర ప్రభుత్వం నియమించవచ్చునా?

జ॥ వరకట్న దురాచారాన్ని అరికట్టటానికి, శాసనపు నిబంధనలు పాటించబడేటట్లు చూడటానికి, శాసనంలో పేర్కొనబడిన నేరాలలో సాక్ష్యాన్ని సేకరించడానికి

రాష్ట్ర ప్రభుత్వం వరకట్న నిషేధ అధికారులను నియమించవచ్చును. (సెక్షను 8 -బి)(1),(2)). వారికి పోలీసు అధికారి చలాయించే అధికారాన్ని యివ్వచ్చును. (సెక్షను (బి) (3). వారికి సలహా సహాయాలు అందించే నిమిత్తం విధిగా ఇద్దరు స్త్రీలుండే అయిదుగురి సలహా సంఘాన్ని రాష్ట్ర ప్రభుత్వం నియమించవచ్చును (సెక్షను 8 - బి (4).

103.ప్ర॥ శాసనప్రయోజనాలను సాధించే నిమిత్తం అవసరమయిన నియమాలను (రూల్సును) రూపొందించారా?

జ॥ రాష్ట్రప్రభుత్వం తయారుచేసి శాసన సభచేత ఆమోదింపచేయవచ్చును. (సెక్షను 10-(1), (2), (3)).

104.ప్ర॥ సాక్ష్య శాసనంలోను యితరత్రాను యీ సందర్భంగా వచ్చిన మార్పులు ఏవి ?

జ॥ (1) సెక్షను 113 ఎ సాక్ష్య శాసనం : ఏ స్త్రీ అయినా ఆత్మహత్య చేసుకుంటే ఆమె ఆత్మహత్యకు ఆమె భర్తయొక్క బంధువు తోడ్పాటు వుందా లేదా అనే ప్రశ్న వచ్చినపుడు, ఆమె తన వివాహమయిన తేదీనుండి 7 సం॥ లోగా ఆత్మహత్య చేసుకుంటే, ఆమె భర్త లేక పై చెప్పిన భర్త బంధువు ఆమెను క్రూర హింసకు పాలుచేస్తే, ఇతర పరిస్థితులను పరిగణనలోకి తీసుకొని ఆమెభర్త, ఆమె భర్త బంధువు ఆమె ఆత్మహత్యకు తోడ్పడినారని ప్రప్రథమంగా భావించవచ్చును.

షరా. పైన చెప్పబడిన క్రూరహింస అంటే భారత శిక్షాస్మృతి సెక్షను 498ఎ లో చెప్పబడిన క్రూర హింస అని అర్థం చేసుకోవాలి.

(2) భారత శిక్షాస్మృతి సెక్షను 498 ఎ : ఒక స్త్రీని ఆత్మహత్యకు, తీవ్రఘాత కలుగు చేసుకునే స్థితికి, జీవితానికి లేక అవయవానికి లేక శారీరక మానసిక ఆరోగ్యానికి భంగకరంగా ప్రవర్తించే స్థితికి నెట్టగల స్వభావం కల ఏ బుద్ధిపూర్వక ప్రవర్తన అయినా 'క్రూరహింస' క్రిందికి వస్తుంది. ఒక స్త్రీని గాని, ఆమె బంధువును కాని ఆస్తికొరకు, విలువగల పత్రం లేక వస్తువు కొరకు తాము చేసే అక్రమ డిమాండును అంగీకరించమని ఒత్తిడి చేసే ఉద్దేశంతో లేక డిమాండును (సాధికారంగా అడిగే కోరిక) ఆమెకాని, ఆమె బంధువు కాని అంగీకరించని

పక్షంలో స్త్రీని ఇతరులు వేధించినపుడు ఆ వేధింపు 'క్రూరహింస' క్రిందకు వస్తుంది. ఒక స్త్రీ భర్త లేక భర్త బంధువుగా వున్న ఏ వ్యక్తి అయినా ఆ స్త్రీని 'క్రూరహింస'కు లోను చేస్తే ఆ వ్యక్తికి 3 సం॥ జైలు శిక్ష, జరిమానా వేయవచ్చును.

(3)క్రిమినల్ ప్రొసీజరు కోడు సెక్షను 174 (3) : ఒక స్త్రీ వివాహమయిన 7 సం॥లోగా ఆత్మహత్యచేసుకుంటే లేక ఎవరో ఆమె ఎడ నేరం చేశారనే సహేతుకమయిన నమ్మకం ఉండే పరిస్థితులల్లో పెళ్ళి అయిన 7 సం॥ లోగా ఆమె చనిపోతే ఆమె శవ పరీక్షను పోలీసు అధికారి చేయించాలి. అంతే కాక స్త్రీ వివాహమయిన 7సం॥ లోగా చనిపోతే ఆమె బంధువులు ఎవరయిన కోరితే లేక (4) మరణానికి కారణం విషయమయి అనుమానం ఉంటే లేక (5) పోలీసు ఆఫీసరుకు యుక్తమని న్యాయమని తోస్తే ఆస్త్రీ శవ పరీక్షచేయించవచ్చును.

(4) క్రిమినల్ ప్రొసీజరు కోడ్ సెక్షను 198 ఎ: భారత శిక్షాస్మృతి సెక్షను 498 ఎ క్రింద నేరాన్ని యీాదిగువ వారు ఫిర్యాదు చేస్తేనే కోర్టు కేసును స్వీకరించ వచ్చును (1) పోలీసు వారు, (2) నేరం వల్లబాధపడిన వ్యక్తి, (3) ఆమె తండ్రి (4) ఆమెతల్లి, (5) ఆమె సోదరుడు, (6) ఆమె సోదరి, (7) ఆమె తండ్రి సోదరుడు, (8) ఆమె తండ్రి సోదరి, (9) ఆమె తల్లి సోదరి, (10) కోర్టు వారి అనుమతితో ఆమెకు రక్త సంబంధం ద్వారా, వివాహం ద్వారా లేక దత్తుద్వారా బంధువు .

105. ప్ర॥ వరకట్న నిషేధ శాసనం క్రింద బహుమతుల జాబితాలకు సంబందించిన కేంద్ర ప్రభుత్వపు 1985 సం॥ రూల్సు ఏవి?

జ॥ (1) ఇవి తేది 2-10-85న అమలులోకి వచ్చాయి.

2 (1) వివాహమపుడు వధువుకు ఇచ్చిన బహుమతుల జాబితాను వధువు తయారుచేయాలి; భద్రపరచాలి.

2 (2) వివాహమపుడు వరునికి యివ్వబడిన బహుమతుల జాబితాను వరుడు తయారు చేయాలి; భద్రపరచాలి.

3 (ఎ) పై రెండు జాబితాలు వివాహమపుడు కాని తరువాత కాని తయారు చేయవచ్చును.

3 (బి) అవి రాతపూర్వకంగా వుండాలి.

3 (సి) వాటిలో 1. ప్రతి బహుమతి వివరం, 2. బహుమతి యొక్క ధర, 3. బహుమతిని యిచ్చిన వారి పేరు, 4. బహుమతి ఇచ్చిన వ్యక్తి వధువుకు/ వరునికి బంధువయితే ఆ బంధుత్వ వివరం

3 (డి) జాబితాలపై వధూవరులు యిద్దరూ సంతకం చేయాలి.

వివరణ : 1. వధువు నిరక్షరాస్యురాలయితే దానిని ఆమెకు చదివి వినిపించిన తర్వాత ఆమె వ్రేలి ముద్ర జాబితాపై వేయించాలి. చదివి వినిపించిన మనిషి ఆ జాబితాపై దస్కతు చేయించాలి.

2. వరుడు నిరక్షరాస్యుడయితే పై విధంగా చేయాలి.

3. వధూవరులు ఆ జాబితాలపై వధువు బంధువులు/వరుని బంధువుల దస్కతులు చేయించవచ్చును. పెళ్ళికి హాజరయిన ఏ వ్యక్తి దస్కతు అయినా తీసుకోవచ్చును.

106. ప్ర॥ ఈ శాసనంలో లోపాలున్నాయా?

జ॥ చాలా వున్నాయి. 1. కట్నం యిచ్చిన వ్యక్తిని నిందితుని చేయటం మొదటిది. 2. చట్టాన్ని చేసిన నిర్ణీత సమయంలో వరకట్న నిషేధ అధికారులను నియమించాలని లేకపోవడం.

)7. ప్ర॥ ఈ దురాచారం శాసనంతో మాత్రమే నశిస్తుందా?

జ॥ నశించదు.

_08. ప్ర॥ ఈ దురాచారం ఎపుడు పోతుంది

జ॥ (1) స్త్రీకి మాత్రమే పెళ్ళి అవసరం అనే భావం పోవాలి. ముఖ్యంగా తల్లిదండ్రులు పాత బఫావాలను విడనాడాలి.

(2) పురుషాధిక్య భావం నమసిపోవాలి.

(3) కులమతాలను దాటి వివాహమాడే వ్యక్తుల సంఖ్య పెరగాలి.

(4) ప్రేమ వివాహాల సంఖ్య పెరగాలి.

(5) స్త్రీలు వృత్తి విద్యల నేర్చి సంపాదన పరులు కావాలి.

(6) స్త్రీలలో విద్యావిజ్ఞానాలు, జాగృతి చైతన్యాలు పెరగాలి.

(7) వరకట్న దురాచారానికి వ్యతిరేకంగా ప్రజాభిప్రాయం బలపడాలి.

## ివాహాలకు సంబంధించిన నేరాలు

)9. ప్ర। కేసులలో ఫిర్యాదులు ఎవరు చేయాలి?

జ। భారత శిక్షాస్మృతి 20వ అధ్యాయంలోని నేరాలను ఆ నేరాలవల్ల కష్టనష్టముల పాలయిన వారు ఫిర్యాదు చేయనిదే స్వీకరించరాదు. నేరం వల్ల కష్టనష్టముల పాలయిన వ్యక్తి 18 సం|లోపు వయస్సు కలిగివున్నా, తెలివిలేకున్నా, పిచ్చి మనిషి అయినా లేక వ్యాధి వల్ల బలహీనతవల్ల అశక్తుడయినా లేక స్థానిక ఆచారాలను బట్టి మర్యాదలను బట్టి బయటకు రాని స్త్రీ అయినా కోర్టు వారి అనుమతితో మరొక మనిషిఫిర్యాదు చేయవచ్చును. (క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ సెక్షన్ 198 (1) (ఎ)) పైన చెప్పబడిన స్త్రీ భర్త సైన్యంలో వుంటే, అతనికి సెలవు దొరకకపోతే కమాండరు ధృవపరిస్తే మరోమనిషి అతని తరఫున ఫిర్యాది చేయవచ్చును (సెక్షను 198(1)బి). భార్య భర్త బ్రతికి వుండగా మరల వివాహమాడుట (సెక్షన్ 494 భా. శి. స్మృ.) అంతకు క్రితం తనకు పె అయిన విషయం దాచిపెట్టి మరల పెళ్ళాడితే (భా.శి.స్మృ. సెక్షన్ 495) కష్టనష్టముల పాలయిన వ్యక్తి స్త్రీ అయితే అతని దగ్గర బంధువులు లేక రక్త సంబంధీకులు ఫిర్యాదు చేయవచ్చును. (సె. 198 సి. క్రి.ప్రొ. కోడ్). మరియొకరి భార్యతో వ్యభిచరించుట (భా. శి.స్మృ. 497), దురుద్దేశంతో వివాహిత స్త్రీని ప్రలోభపర్చుట (భా.శి. స్మృతి 498) నేరాలలో ఆ స్త్రీ భర్త మాత్రమే కష్టనష్టముల పాలయిన వ్యక్తి క్రింద లెక్క. అయితే ఆ నేరసమయంలో భార్య ఆమె భర్త తరఫున ఎవరి ఆధీనంలో వుంటే ఆ మనిషి ఫిర్యాదు చేయవచ్చును.

0. ప్ర। వైవాహిక నేరాలు ఏవి? వాటి శిక్షలు ఎలా ఉన్నాయి?

జ। తనతో వివాహం కాని స్త్రీని తనతో ఆమెకు వివాహమయిందని నమ్మించి ఆ నమ్మకంతో ఆమె అతనితో భర్తలవలె సంభోగం చేసేటట్లు ప్రవర్తిస్తే 10

సం॥ కఠిన శిక్ష, జరిమానా రెండూనూ విధించవచ్చు. (సెక్షను 4
భా.శి.స్మృతి) ఎవరికయినా భర్త లేక భార్య బ్రతికి వుండి వివాహమాడితే
వివాహం చెల్లనిదయితే ఆ మనిషికి 7 సం॥లు ఖైదుగాని కఠినశిక్షగాని జరిమా
గాని వేయవచ్చు. (సెక్షను 494 భా.శి.స్మృతి) ఆంధ్రప్రదేశ్‌లో ఈ నేరా
ఒకటవ క్లాసు మేజిస్ట్రేటు విచారించవచ్చు (1987 ఆం.ప్ర. ఆక్టు 46) సెక్ష
494 (భా.శి.స్మృతి). నేరాన్ని రెండవసారి పెళ్ళాడిన వ్యక్తికి తెలియకుం
దాచిపెట్టే నిందితునికి 10 సం॥ మించని ఖైదు, జరిమానా, రెండు శిక్ష
(సెక్షను 495 భా.శి.స్మృతి)

ఒక మనిషి అవతలి వ్యక్తికి నష్టం లేక తనకు లాభం అక్రమంగా కలుగచేయా
ఉద్దేశించి లేక అవతలి మనిషిని మోసం చేయాలని ఉద్దేశించి అవతలి వ్యక్తి
వైవాహిక తంతులో పాల్గొంటే, తద్వారా శాసనసమ్మతమయిన వివా
తనకు జరగటంలేదని అప్పుడు తెలిసివుంటే సెక్షను 496 (భా.శి.స్మృ
క్రింద నేరం చేసినట్లు. ఇది రాజీపడటానికి వీలులేని నేరం. శిక్ష 7 సం॥ ఖై
జరిమానా రెండూను. సెక్షను 497 (మరొకని భార్యతో వ్యభిచారం) ఏ
అయినా మరొకరి భార్య అయితే, మరొకరి భార్య అని అతడు నమ్మటా
కారణం వుంటే ఆ స్త్రీని ఆమె భర్త వద్ద నుండి లేక ఆమె భర్త తరపున ఆమె
ఆధీనంలో వుంచుకున్న వ్యక్తి నుండి తీసుకొని వెళ్ళినా, లేక ఆకర్షిం
ఎత్తుకొని పోయినా ఆమె ఇతరునితో అక్రమ లైంగిక సంపర్కం పొందా
ఉద్దేశంతో లేక ఆమెను రహస్య స్థావరంలో దాచిపెట్టటం లేక ఆమె
కదలనీయకుండా చేయటం సెక్షను 498 భా.శి.స్మృతి క్రింద నేరం. శిక్ష
2 సం॥మించని ఖైదు, జరిమానా రెండూను.

.11.ప్ర॥ సెక్షను 498 లోని 'భర్త అధీనం', 'భర్త తరపున ఇంకొకరి అధీనం' అ
పదజాలాలు వున్నాయి. అవి పాతకాలపు భావాలు కావా?

జ॥ అవును పాతకాలపు భావాలే, భార్య భర్త సొత్తు అనే భావం వాటిలో కన్పడుతున్నది

112.ప్ర॥ సెక్షను 498(ఎ) (భా.శి.స్మృతి) స్వభావం ఏమిటి?

జ॥ ఎవరయినా ఒక స్త్రీ భర్త అయి యుండి లేక భర్త బంధువు అయి యుండి ఆ
స్త్రీని క్రౌర్యానికి లోనుచేస్తే వారు శిక్షాపాత్రులు. శిక్ష 3 సం॥ మించని ఖైదు.

జరిమానా కూడా వేయవచ్చును. ఒక స్త్రీ ఆత్మహత్యకు, తన దేహానికి తీవ్ర గాయం చేసుకోవటానికి, ప్రాణాపాయానికి, అవమానాలకు, ఆరోగ్యానికి హాని -శారీరకంగా మానసికంగాగాని - కలిగించుకోవటానికి పూనుకోవలసి వచ్చేటట్లు ఎవరయినా బుద్ధిపూర్వకంగా ప్రవర్తించటం క్రౌర్యం లేక క్రూరత్వం క్రింద లెక్క.

ఒక స్త్రీని చీకాకు పరచి వేధించడం మరియు ఆ వేధింపు ఆస్తి కోసం, విలువ కల వస్తువుల కోసం నిందితుడు చేసే డిమాండును, ఆమె తరపు వారు అంగీకరించేటట్లు వత్తిడి చేయడం క్రూరత్వం క్రిందికి వస్తుంది. ఈ నేరాన్ని గురించి ఆ స్త్రీ, ఆమె రక్త సంబంధీకులు, ప్రభుత్వ ఆఫీసరు ఫిర్యాదు చేయవచ్చును.

ఒక స్త్రీకి పెళ్ళయిన 7 సం॥లలోగా ఆమె గాయంవల్ల, దెబ్బలవల్ల కాల్చడం వల్ల కలిగిన పుండ్లవల్ల ఆమె అసాధారణ పరిస్థితుల్లో చనిపోతే, ఆమె మరణానికి పూర్వం ఆమె భర్త లేక భర్త బంధువుల వల్ల క్రూరత్వానికి వేధింపుకు గురైతే, ఆ క్రూరత్వం, వేధింపు, వరకట్నం కోసం డిమాండుకు సంబంధించి వుంటే దీనిని వరకట్న మరణం అంటారు. (సెక్షను 304 భా. శి.స్మృతి) భర్త, అతని బంధువులు మరణానికి కారణభూతులుగా ఎంచబడుదురు. దీనికి కనీసపు శిక్ష 7 సం॥ ఖైదు గరిష్ఠ శిక్ష జీవితకాలపు ఖైదు. ఈ కేసులో రాజీపడే ప్రసక్తి లేదు.

113. ప్ర॥ వరకట్న మరణాల కేసులు ఆత్మహత్యలుగా నమోదు అవుతున్నాయి ఎందుచేత

జ॥ కారణాలు అనేకం (1) దర్యాప్తులో పోలీసుల అశ్రద్ధ, శవ పంచాయతీలో లోపాలు (2) శవపరీక్షలో లోపాలు (3) బలైన స్త్రీ సహకరించకపోవడం. చచ్చిపోతూ కూడా తన పిల్లల భద్రత కోసం భర్తను కాపాడటం (4) చనిపోయిన స్త్రీ తల్లిదండ్రుల అలసత్వం, అశ్రద్ధ (5) ఇరుగు పొరుగు సాక్షులు సాక్ష్యం చెప్పటానికి జంకటం, సంకోచించటం. అందువల్ల సెక్షను 304 బి (భా.శి.స్మృతి) నేరాలు సెక్షను 498 ఎ (భా.శి.స్మృతి) నేరాలుగా మారుతున్నాయి.

## సతీసహగమనం : సతీనిరోధ శాసనం 1987.

114. ప్ర॥ సతీసహగమన ఆచారం ఏ వర్ణాలలో వుంది?

జ॥ బ్రాహ్మణులలో, క్షత్రియులలో వుండేది.

115. ప్ర॥ సతీసహగమనం ఎందుకు పుట్టింది?

జ॥ ఒక పురుషుడు చనిపోతే అతని ఆస్తి అతని వితంతువుకు రాకుండా నిమిత్తం దీనిని ప్రారంభం చేశారు. పతివ్రత కావాలంటే భర్త శవంతో పా దహనం కావాలని బోధించారు. స్త్రీలు నమ్మారు. నమ్మని వారిని బలవం సతీసహగమనం చేయించారు పురుషులు.

116. ప్ర॥ సతీసహగమన శాసనం మొదట్లో ఎప్పుడు వచ్చింది?

జ॥ రాజా రామమోహన్‌రాయ్ కృషి వల్ల 1929లో వచ్చింది.

117. ప్ర॥ 1987 శాసనం ఎందుకు వచ్చింది.

జ॥ రాజస్థాన్‌లో రూప్‌కన్వర్ అనే యువతిని బలవంతంగా సహగమనం చేయించా దేశం గగ్గోలు పెట్టింది. తత్ఫలితమే 1987 శాసనం. దీని లక్ష్యాలు (1 సతీసహగమనాన్ని సమర్థవంతంగా నిరోధించటానికి, సతీ విధానా మహిమాన్వితం చేయకుండా అడ్డుపడటానికి (2) వితంతువులను కాల్చడ భూమిలో పాతి పెట్టడం మానవ స్వభావానికి వ్యతిరేకం కనుక (3 సతీసహగమనాన్ని నిరోధించటానికి దానిని మహిమాన్వితం చేయకుం ఉండటానికి ఇతోధిక చర్యలు అవసరమయినందున ఈ శాసనా రూపొందించింది కేంద్ర ప్రభుత్వం. సతీసహగమనాన్ని ఈ క్రింద పేర్కొ 4 రకాలుగా మహిమాన్వితం చేయవచ్చు. (1) సతీసహగమన సందర్భం క్రతువు లేక ఊరేగింపు; (2) సతి అనే ఆచారాన్ని బలపరచటం, ప్రచార చేయటం, సమర్థించటం; (3) సతీసహగమనం చేసిన వ్యక్తిని అనగా 'సతి పొగడటానికి ఉత్సవాన్ని చేయటం; (4) సతి స్మృత్యర్థం ఆమెను శాశ్వతం గౌరవించే నిమిత్తం ట్రస్టును స్థాపించుట, నిధులు వసూలు చేయుట దేవాలయంగాని కట్టడంగాని నిర్మించటం.

118. ప్ర॥ నేరాలు ఏవి? శిక్షలు ఎలా?

జ॥ భారత శిక్షాస్మృతిలో ఏమి చెప్పినా, ఏ స్త్రీ అయినా సతీసహగమనం చేయుటకు ఒడికడితే అది శిక్షార్హం. శిక్ష సం॥ దాటని జైలు, జరిమానా లేక రెండూనూ. ఈ నేరాలను విచారించటానికి ప్రత్యేక కోర్టు వుంటుంది (సెక్షను 9) నేరానికి దారితీసిన పరిస్థితులను, నిందితుని మానసిక స్థితిని వీటన్నింటిని కోర్టులెక్కలోకి తీసుకోవాలి (సెక్షను 3). సతి అనే నేరం జరిగేటపుడు ప్రత్యక్షంగాకాని పరోక్షంగాకాని నేరం జరగటానికి సాయపడిన, ప్రోద్బలం చేసిన ప్రేరేపించిన వ్యక్తికి మరణ శిక్షగాని జీవితఖైదును వెయ్యాలి (సెక్షను 4 (1) జరిమానా కూడ వేయవచ్చును. ఏ వ్యక్తి అయినా సతి చేయించ ప్రయత్నిస్తే ఆ వ్యక్తికి ప్రత్యక్షంగా కాని పరోక్షంగా కాని సహాయం చేసిన వ్యక్తికి జీవితకాలపు ఖైదు మరియు జరిమానా లేక రెండూనూ. (సెక్షను 4(2).

ఈ దిగువ పేర్కొన్న విధంగా సతీసహగమనానికి సహాయం చేయవచ్చును. (1)తన భర్త శవంతోగాని, తన బంధువు శవంతోగాని లేక భర్త లేక బంధువుకు సంబంధించిన వస్తువుతోగాని కాలిపోవలసినదని లేక పూడ్చిపెట్టించుకోమని గాని – ఆమె సరిఅయిన మానసిక స్థితిలో వున్నా లేకున్నా లేక ఆమె స్వేచ్ఛగా తన బుద్ధిని వాడలేని స్థితిలో వున్నా ఇలాంటి స్థితిలో లేకున్నా – ఎవరయినా ప్రోత్సాహం చేయుట (2) సతీసహగమనం చేస్తే తనకూ, తన భర్తకు తన కుటుంబానికి ఆధ్యాత్మిక ప్రయోజనం ఒనగూడుతుందని ఆమెను నమ్మించటం (3) వితంతువుకుగాని యితర స్త్రీకిగాని సతీసహగమనం చేసే నిశ్చయాన్ని గట్టి చేయటం, ఆమెను పురిగొల్పటం (4) సతీసహగమన ఊరేగింపులో పాల్గొనుట, సతిని స్మశానానికి తీసుకొని రావటం, ఆమెకు సహాయం చెయ్యటం, (5) సతి జరిగిన ప్రదేశంలో ఉండి ఆ పనిలోగాని, ఆ పనికి సంబంధించిన పనిలోగాని చురుకుగా పాల్గొనడం (6) కాలిపోకుండా, పూడ్చిపెట్టబడకుండా తనను తాను రక్షించుకోవాలని వితంతువు మరియే యితర స్త్రీ ప్రయత్నిస్తే ఆ ప్రయత్నాన్ని నిరోధించడం, ఆటంకపరచడం, (7) సతిని నిరోధించడానికి పోలీసువారు తమ విద్యుక్త ధర్మాన్ని నెరవేరుస్తుంటే దానితో జోక్యం కలుగచేసుకోవటం, లేక వాటిని అడ్డగించటం, సతికి సహాయం చేయటం క్రిందకు వస్తాయి.

సతిని ఉజ్వలంగా చిత్రించటం సతిని మహిమాన్వితం చేయటమే. దానికి 1సం॥ తక్కువ కాని 7 సం॥వరకు కారాగార వాస శిక్ష 5 వేలకు తక్కువ కాని వేలకు మించకుండా జరిమానా (సెక్షను 5 - శాసనం) 20 సంవత్సరాలలో కాలంలో కట్టిన సతి దేవాలయాన్ని కట్టడాన్ని కలెక్టరు కూలత్రోయించవచ్చు (సెక్షను 6 (1). ఆ దేవాలయంలో లేక కట్టడంలో పూజలు, తంతు జరుగుతుంటే వాటిని తొలగించమని కలెక్టరు ఉత్తరువు యివ్వవచ్చు (సెక్షను 6(21)) ఈ శాసనం క్రింద ఏ వ్యక్తి అయినా సతీసహగమనానికి ప్రోత్సాహం ప్రేరణ, సహాయం చేసినట్లు కేసు పెడ్తే నేరం చేయలేదని నిందితుడు రుజువు చేసుకోవాలి.(120ఎ)

19. ప్ర॥ ప్రభుత్వం యీ శాసనం క్రింద చర్యలు తీసుకున్నదా?

జ॥ రూప్‌కన్వరు మృతిపై ఆందోళన సమసిపోయింది. ప్రభుత్వమూ ఈ విషయం మరచిపోయింది. అమలు జరుగని శాసనాల్లో ఇది ఒకటి.

# వరకట్న మరణాలు
# నిషేధ శాసనాలు

రచన

## మల్లాది సుబ్బమ్మ




స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహదీపట్నం

హైదరాబాద్-500028

# శరపత్రం నెం. 4

ప్రతులు 2000
మలి ముద్రణ : 1990

రచన : మల్లాది సుబ్బమ్మ
హక్కులు రచయితవి.

ప్రచురణ కర్త
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
మెహిదీపట్నం—హైదరాబాద్
ఫోను : 35429

వెల : రు. 2-00 లు

ప్రతులకు :
స్త్రీ విమోచన శిక్షణా కేంద్రం
8, ఎం. ఐ. జి. హెచ్. మెహిదీపట్నం
హైదరాబాద్-500 028

ముద్రణ :
సౌజన్య ఆర్ట్ ప్రింటర్స్
గాంధీనగర్, విజయవాడ-3.

# వరకట్న మరణాలు : నిషేధ శాసనాలు

వరవిక్రయం, నర విక్రయం జంతుదశ నాటి వారసత్వం కాదా. తెల్లారే సరికి వరకట్న మరణంలేని రోజులేదు. వరకట్న మరణాల సంఖ్య విపరీతంగా పెరిగిపోతోంది. విమల విషం త్రాగిందని, కమల కిరసనాయిలు పోసుకుందని, ఊర్మిళ ఉరి పోసుకుందనే వార్తలు వింటున్నాం.. ఇలా రోజూ అనేక మంది అబలలు ఆత్మాహుతి అయిపోతున్నారు. వరకట్నాల హత్యలన్నీ ఆత్మహత్యలుగా మారిపోతున్నాయని మహిళాలోకం అలమటించి పోతోంది. అందువల్ల అసలు వరకట్నమంటే ఏమిటి? అది ఎప్పుడు పుట్టింది? ఎందుకు పుట్టింది? దానికి పునాదులు ఏనాడు పడ్డాయి. ? దాన్ని పెంచింది ఎవరు? పోషిస్తున్నవారు ఎవరు? కేవలం వరుడు, అత్త మామలే ఇందుకు కారణమా। లేక అమ్మాయి తల్లిదండ్రులకు కూడా ఇందులో భాగస్వామ్యం వుందా? ఈ దుస్సంఘటనలకు కారణం సమాజమా? పురుషుల దురాశా దురహంకారాలా? ఆడవారి అజ్ఞానమా? లేక వారి నిస్సహాయ పరిస్థితా? అసలు ఆడపిల్లను కనడం తల్లిదండ్రుల నేరమా? కట్నమిచ్చి పెళ్ళి చేయడం అమ్మాయి సుఖం కొరకా? లేక ఇచ్చి పుచ్చుకునే వారి హోదాలకు చిహ్నమా? ఆస్తిలో అమ్మాయి వాటాను తప్పించటానికి ఇదొక పన్నాగమా? ఇందులో అమ్మాయి బాధ్యత కూడా వుందా? ఈ అంటు జాడ్యం ఇతర వ లకు కూడా వ్యాపిస్తోందా? ఈ వ్యాధి నిర్మూలనకు దివ్య ఔషధం ఏ 'సైంటిస్ట కనిపెట్టలేదా? ఏ 'ఫిలాసఫర్' ఆలోచించలేదా? వరకట్న నిషేధ శాసన వున్నాయా? ఇచ్చి పుచ్చుకునే వారికి శిక్షలు, జరిమానాలు విధిస్తున్నారా? ఈ చట్టాలను సవరించడం జరిగిందా? అందువల్ల మార్పులు ఏమయినా వచ్చాయా? అనే విషయాలు నేడు మన ముందుకొచ్చాయి కనుక అసలు విషయాన్ని, దాని పుట్టు పూర్వోత్తరాలను చర్చించే ముందు కొన్ని వరకట్న మరణాల వివరాలు గమనిద్దాం.

దేశంలో అన్ని ప్రాంతాల్లో వరకట్న మరణాలు యధేచ్ఛగా కొనసాగుతున్నాయని రోజుకు 22మంది వనితలు బలి అవుతున్నారని పి. టి. ఐ. వా సంస్థ జరిపిన ఒక సర్వేలో తేలింది. 1975లో రోజుకు సగటున 12 అయితే 1980 సం॥లో 4394 మరణాలు సంభవించాయని ఆ సంస్థ చె ఆంధ్రదేశంలో 1983 లో 138 చావులుంటే 84లో 152, 85లో 174కు యని తేలింది.

వరకట్నం ఎందుకు ఇస్తున్నాం? అమ్మాయి జీవితం సుఖంగా జరిగిపోవ టానికా? లేక కన్నవారు తమ బరువు బాధ్యతలు దించుకోవటానికా? కాక ఆస్తిలో భాగం ఆమెకు దక్కకుండా చేయటానికా? తన బరువును భర్త స్వీకరిస్తున్నందుకు తండ్రి కట్నం చెల్లిస్తున్నాడా? అమ్మాయి మళ్ళీ పుట్టింటి సుఖం చూచే హక్కు పోగొట్టుకుంటున్నందుకా? ఈ డబ్బుతో అమ్మాయికి వచ్చేవి కష్టాలా లేక సుఖ మయ జీవితమా? కట్నం ఇచ్చిన ఆ డబ్బుమీద హక్కు అమ్మాయికి వుంటుందా? మరి తల్లిదండ్రులు ఎగబడి కట్నం ఎందుకిస్తున్నారు అనేవి మరికొన్ని మౌలిక మైన ప్రశ్నలు వున్నాయి.

వరకట్నం సమర్థించే వారిలోను, వ్యతిరేకించే వారిలోకూడా విభిన్న దృక్పథాలు వున్నాయి. ఈ సందర్భంగా వాటి వివరణ పరిశీలనార్హమవుతుంది.

ముందుగా సమర్థించేవారి భావాలు తెలుసుకుందాం. వరకట్నం వరునికి ఇచ్చే దక్షిణ అనే ఆచారం వేదకాలం నుండి వస్తున్నది. కుమార్తెకు తండ్రి ఆస్తిలో వారసత్వ హక్కు లేనందువల్ల ఆనాడు కుమార్తెకు పరోక్షంగా అందజేసే పద్ధతి ఆచారమయింది. కుమార్తెకు తన కొత్త జీవితంలో అడుగుపెడ్తున్న సమ యంలో ఆమెకు ఆసరాగా ఉండగలందులకు ఇచ్చేధనం అని కొందరు వాదిస్తు న్నారు. తనకు ఆప్తబంధువుగా అవతరిస్తున్న అల్లునికి ఆహ్వాన సందర్భంగా మామ ఇచ్చే కానుకగా పరిణమించింది. విజ్ఞానం సంతరించుకున్న వరునికి, సంపా దనాపరుడయిన వరునికి, తక్కువ సాంస్కృతిక స్థాయివున్న అబలను అంట కట్టున్నందుకు ఆమె తండ్రి అతనికి అందించే ఆకర్షణకు మారుపేరే కట్నమైంది.

పురుషుడు పురుషుడే. స్త్రీ స్త్రీయే. అన్నింట, అన్నిరంగాలలో అతడే అధి కుడు కనుక ఆమెను ఏలుకుంటున్నందుకు ఇచ్చే పారితోషికమే వరకట్నం. పేరుకు వరకట్నం వరునికి ఇస్తారు గాని, నిజానికి అది ఆమె కుటుంబానికి ఉపమో పదేదేకదా। అంటున్నారు. వరకట్నం ఇమ్మని కొందరు విద్యాధికులయినయువ తులుకూడా తమ తల్లిదండ్రులను ఒత్తిడి చేస్తున్నారు. ఇటీవల ఈనినాదం అమలు లోకి వచ్చింది.

అత్తవారి కుటుంబపు హోదాను గుర్తించి చెల్లించే నజరానా అది. ఒకానొక సామాజిక దశలో ఉద్భవించిన ఆచారం చారిత్రక పరిణామంలో ఉద్భవించిన ఒక లక్షణంగా మారడం సహజం. ఇవ్వగలిగిన వారు ఇస్తున్నారు. పుచ్చుకునే వారు

పుచ్చుకుంటున్నారు. ఎందుకీ అనవసరపు చర్చ? అంటున్నారు ఈ వర్గంవారు.

ఇక వరకట్నాన్ని వ్యతిరేకించేవారి అభిప్రాయాలు మరోవిధంగావున్నాయి. ఆడపిల్లను కన్నందుకు వధువు తండ్రికి వరుడువేసే జరిమానా కట్నమని కొందరు నిర్వచిస్తున్నారు. పసుపు కుంకుమల క్రింద, బాలతొడుగుక్రింద వధువుకు సరాసరి ఇవ్వవచ్చు కదా! అనిమరికొందరు, సారె, సామాను, వస్తుసామగ్రి,అవన్నీ ఇస్తున్నారుగా! పైగా వరకట్నం ఎందుకు అని అనేకమంది అడుగుతున్నారు.

గృహిణిగా ఆమె నిర్వహించే కార్యభారానికి, తన పిల్లల తల్లిగా ఆమె నెరవేర్చే మాతృత్వ విధులకు విలువ లేదన్నమాట. స్త్రీలు కూడా సంపాదించుతున్న ఈ రోజుల్లో, పురుషులతో సమానంగా విద్యా సంస్కృతులను అలవరచుకున్న ఈ కాలంలో వరకట్నం అంతరించాలి కదా! వధువు గుణగణాలు, విద్యా సంస్కృతులు, శక్తి యుక్తులు వీటికి విలువ ఇవ్వకుండా కేవలం ధనానికి ఆశపడటమే వరుల లోపం.

పరస్పర ప్రేమానురాగాలకు నిలయం కావలసిన కుటుంబ స్థాపన సందర్భంగా వధువు తల్లిదండ్రులవద్ద లంచం ఆశించడం దూష్యం. కట్నం తీసుకొని వధువును స్వీకరించడం వధువు తలిదండ్రులకు వరుడు అమ్ముడు పోవడమేనని నిర్వచించవచ్చు.

కేవలం స్త్రీకే పెండ్లి అవసరమా? కాదు. పురుషునికి కూడా అంతే అవసరం అయినప్పుడు మరి కట్నం స్త్రీ తరపువాళ్ళే ఎందుకివ్వాలి? మానవజాతి తొలిదశలో ఈ భావాలు లేవు. దరిమిలా అనేక కారణాల వలన ఇవి ఉద్భవించాయి. మధ్యలో పుట్టినవి మధ్యలోనేపోవాలి. కాకపోతే అందుకు వలసిన భావ విప్లవమూ కార్యదీక్షా ఎంతో అవసరం.

శాసనాల ద్వారా ఈ ఆచారాన్ని రూపుమాపలేము. శాస్త్రమంటే గౌరవమూ భక్తిశ్రద్ధలూ వున్నవారే ఈ ఆచారాన్ని మానుకుంటారు. అలాగాక శాసనపు ఉనికియే ప్రబోధ కారణమవుతుంది. చరిత్ర సృష్టించేది మనుషులు. ఆలక్షణాన్ని రూపుమాపడానికి నూతన పోకడలు గల మానవులు కంకణం కట్టుకోవాలి.

ఈనాడు అన్నిరకాలయిన వరకట్నసంస్కరణలలో వరకట్న నిర్మూలన ముఖ్యమైనదిగా ఎంచబడుతోంది. గత పదిసంవత్సరాలుగా దీనిప్రచారం భారీఎత్తున జరుగుతోంది. సభలు జరుగుతున్నాయి. చర్చా వేదికలు అనంతంగా సాగిపోత

న్నాయి. సెమినార్లు హెచ్చుస్థాయిలోనే నిర్వహిస్తున్నారు. ఇక సాహిత్యం అనంతంగా వస్తోంది. కథలు, నాటికలు, నాటకాలు, వ్యాసాలు విపరీతంగా వెలువడుతున్నాయి. ముఖ్యంగా పత్రికాధిపతులు ఏ మూల ఏ వరకట్న హత్య జరిగినా పెద్దపెద్ద పతాక శీర్షికలతో వార్తలు వెలువరిస్తున్నారు. మహిళా సంఘాలవారు వరకట్న నిర్మూలనా కార్యక్రమాలు జరపనివారు లేరని గర్వంగా చెప్పుకోవచ్చు. టి. వి, రేడియోల లాంటి ప్రసార సాధనాలు వరకట్న నిర్మూలనపై నొక్కి పెట్టి తరచూ నాటకాలు, చర్చలు ప్రబోధనల ద్వారా వినిపిస్తున్నారు. వరకట్న మరణాలపై సర్వేలు చేసి ఏటా ఎంతమంది బలి అవుతున్నారో ఎక్కడెక్కడ ఎలా ఈ హత్యలు, ఆత్మహత్యలూ జరుగుతున్నాయో "డేటా"లతో సహా వివరిస్తున్నారు. దర్యాప్తు కమిటీలు వేస్తున్నారు. ప్రత్యేక విభాగాలు(సెల్స్) పోలీసు స్టేషన్లలో నెలకొల్పుతున్నారు. రీసెర్చి విభాగాల్లో ఇదొక సబ్జెక్టు అయి దీనిమీద థీసిస్ చేసి కొందరు డాక్టరేట్ (పిహెచ్. డి)ను పొందుతున్నారు. ఇక వరకట్నంమీద చట్టాలు సవరణలూ, శిక్షలూ చాలా వున్నాయి. ఇక యువతీ యువకులు వరకట్న పిశాచాన్ని నిర్మూలించాలని ప్రతిజ్ఞలు చేస్తున్నారు. యువజన సంఘాలు సభలూ, సమావేశాలూ జరిపి తీర్మానాలు చేస్తున్నారు. మరి వీరిలో చివరివరకు ఎంతమంది నిలుస్తారనేదొక శేషప్రశ్నగా మిగిలిపోతోంది.

గత మూడేళ్ళుగా హైదరాబాదులో స్వచ్ఛందంగా సేవచేస్తున్న వరకట్న మరణాల దర్యాప్తు కమిటీ(DOWRY DEATH INVESTIGATION COMMITTEE) వరకట్న మరణాలను విచారించటానికి పోలీసు స్టేషన్లలో, ఒక ప్రత్యేక విభాగం (సెల్)ను ఏర్పరచమని ప్రభుత్వానికొక వినతిపత్రం సమర్పించింది. వారి కృషి ఫలితంగా ప్రభుత్వం ఒక సెల్‌ను ఏర్పరచడం హర్షదాయకం. ఏదయినా న్ని వర్గాలవారిని ఇంతగా కలవరపెడుతున్న ఈ సమస్యను, ఇన్నికుటుంబాలను ్వాళనం చేస్తున్న ఈ దుర్నీతిని, ఎందరో అమ్మాయిలను అగ్నికి ఆహుతి స్తున్న ఈ విషజాడ్యాన్ని, అనేకమంది తల్లిదండ్రులం కడుపులో చిచ్చుపెడుతున్న ఈ వరకట్న దురాచారానికి కారణా లేమిటి? దానిని ఎలా నిర్మూలించాలి? అనేవి నేటి ముఖ్యాంశాలయినాయి. కనుక తెలిసికొనుట అవసరమయింది, పరిష్కరించుట ముఖ్య కర్తవ్యమయింది.

పూర్వకాలం సువర్ణ యుగమని ఇది కలియుగం కనుక భౌతిక సుఖాలను ఈ కాలపువారు ఆశిస్తున్నారని, అతి తేలిగ్గా లభించేది వరకట్నం కనుక కట్నం

అడుగుతున్నారనే వాదం ఒకటి వుంది. ధనదాహం, దురాశ మిక్కుటమవటం వల్లనేనని కొందరు అంటున్నారు. పాశ్చాత్య సంస్కృతి ప్రభావం వలన పాశ్చాత్య వస్తువుల్లపై వ్యామోహం వలన ఇది జరుగుతోందని మరికొందరూ అంటున్నారు. ఇంటిపని సులభంగా, సౌలభ్యం చేసే సాధనాలకు ఆకర్షితులయి అలా భార్యలను అత్త మామలను హింసిస్తున్నారనే భావం ప్రబలంగా వుంది కన్యాదానం సమయంలో ఏదో రూపంలో ముట్ట చెప్పాలని అది సంప్రదాయమని చాలామంది భావిస్తున్నారు. పిత్రార్జితపు ఆస్తిలో వాటా వుండదు కనుక పసుపు కుంకుమల క్రింద ఇవ్వాలనే ఆచారం వుందని అంటారు. పెళ్ళయ్యాక దమ్మిడీ ముట్టచెప్పరు, తర్వాత అన్నదమ్ములు అసలే రాల్చరు కనుక అప్పుచేసి అయినా కట్నం ఇచ్చి పెళ్ళిచేయాలనేదొక ఆచారం అయింది. చట్టప్రకారమైనా అమ్మాయి పెళ్ళి ఖర్చులకు భాగ పంపిణీల సమయంలో కేటాయిస్తారు. ఆ బాధ్యత చట్టరీత్యా అన్నదమ్ములకు కూడా వుంది. అలా ఆ కట్నకానుకలతో చెయ్యటం జరుగుతోంది. తమ చెల్లిలి పెళ్ళికి కట్నం, ఖర్చులూ వుంటాయి కనుక తాము కట్నం తీసుకోక తప్పటం లేదని అంటూ మిషపెడతారు అబ్బాయిలు. ఆడది అంటే ఆజన్మాంతం ఆధారపడి జీవించే ప్రాణి(పేరాసైట్) ఆమెను బ్రతికినన్నాళ్ళూ పోషించాల్సిన పరిస్థితి భర్తకు వుంది. కనుక ఈమా... మైనా ఆర్థిక సహాయం చెయ్యక తప్పదనేవారు అనంతంగా వున్నారు. అలా ఒక సాకుతో కట్నం ఇవ్వడం, పుచ్చుకోవడం జరిగిపోతోంది.

కట్నం ఇచ్చి భర్తను కొన్న అమ్మాయి హోదా అయినా కనీసం నిలు స్తోందా? ఆ పిల్లకు ఆ కుటుంబంలో వుండే స్థానం ఎలాంటిది? తండ్రి ద్వారా సంక్రమించిన ఆ కట్నం మీద ఆమెకు ఏమైనా హక్కు వున్నదా? మరి ఎందుకిస్తున్నారు అంటే ఆమె తక్కువ అతను ఎక్కువ అనే భావం అందరి లోనూ వుంది. భరింపబడేది భార్య అనేది సర్వత్రా అమలు జరుగుతోంది. అందువల్లే నరుడు ధనవంతుడు, పెద్ద విద్యావంతుడు అయ్యే కొద్దీ అతని రేటు పెరగటం జరుగుతోంది. అతని అందం, విద్య, ఉద్యోగం, ఆస్తి, అంతస్తు చూచి మోజుపడతారే గాని, పైపై మెరుగులకు వ్యామోహపడతారేగాని, అతని యోగ్య సంస్కారం గురించి ఆలోచించరు. తన బిడ్డకు ఆ ఇంట్లో అంగుళం ఇస్తేనే చాలు అని కన్నవారు పరుగు లెత్తుతారు. అది చూచిన

పైపైకి లంఘించి పైమెట్టు పైకిఎక్కి ఇక దిగనంటాడు. అంతే ఇంక అమ్మాయి పతనం మొదలవుతుంది. అంతేకాని ఆ కట్నం ఇచ్చే డబ్బుతో అమ్మాయికి విద్య చెప్పించరు. ఆమె పేర ఆ కట్నం డబ్బు బ్యాంకులోనూ వెయ్యరు, ఇటు కట్నం, అటు విద్యా రెండూ భరించలేమని బాధపడతారు. పిల్లను పెళ్ళి చేసి వదిలించుకోవాలి అనే భావం అన్ని తరగతుల వారిలో వుంది. వయస్సు ముదిరితే పెళ్ళి కాదని అనుక్షణం భయంతో వరాన్వేషణ సాగిస్తూ వుంటారు. వచ్చేపొయ్యే వారికి అమ్మాయిని కొక బొమ్మలా అలంకరించి కూర్చోబెట్టి చూపిస్తారు. ఒక సంతలో పశువుల శ్రేష్ఠతను పరీక్షించవచ్చు. మార్కెట్‌తో వస్తువుల నాణ్యతను నిర్ణయించవచ్చు. కాని వివాహ విపణివీథిలో చైతన్యం మూర్తీభవించిన ఒక వధువు వ్యక్తిత్వాన్నే పణంగా పెట్టే పెళ్ళిచూపుల తంతు జరుగుతుంది. ఇది ప్రగతిశీలమైన మన జాతికే సిగ్గుచేటు. వధువు ఎంపికలో వరుని తల్లిదండ్రుల పాత్ర కూడా వుంది. వారికి కావల్సినది తమ కుమారునిపై తాము పెట్టిన పెట్టుబడి చక్రవడ్డీతో పుచ్చుకోవాలని ప్రయత్నించి సఫలత చెందడమే. అంటే రేటు ఎవరు ఎక్కువ ఇస్తే వారి పిల్లను అంగీకరిస్తారు. వధువుకంటే ఆమె తెచ్చే డబ్బు మొదట నచ్చాలి. అడిగిన కట్నం ఇస్తే అనాకారి అమ్మాయి అయినా వెంటనే సుందరాంగిగా మారిపోతుంది.

కట్నం ఎక్కువ ఇస్తే సుఖపడుతుందంటే అదీలేదు. కట్నం కేవలం పుట్టింటి అత్తింటి హోదాలను తెలుపుతుంది కాని కోడలి నిస్సహాయతను ఏమాత్రం తగ్గించదు. పైగా వరకట్నం కోరంటికానికి మూలమూ అనిపిస్తుంది. నిశ్చయ తాంబూలం (ఎంగేజిమెంటు)తో మొదలవుతుంది కానుకలు చెల్లించడం. ఇక పండుగలని, పురుళ్ళని, వేడుకలని పెట్టే ఖర్చులకు అంతూ పొంతూ ఉండవు. అమ్మాయికి విద్యా వుద్యోగం వున్నా కట్నం తప్పటంలేదు. అసలు పిల్లనిస్తామని అడగటంలోనే కట్నం ఇమిడి వుంటుంది. వేరుగా చెప్పాల్సిన పనిలేదు. మంచి కుటుంబంలో పిల్ల అంటేనే "కులీనులు" అని అర్థంచేసుకోవాలి. ఇంకా అంత డబ్బుతో అమ్మాయి వచ్చినా అత్తవారు ఆమెను గౌరవించరు. సుఖపెడతారు అనే గ్యారంటీ లేదు. వరకట్నం ఏ ఆర్థిక సూత్రానికి కట్టుపడదు. "సప్లయి డిమాండ్ సిద్ధాంతానికి" ఇది అసలే వర్తించదు. అంటే మార్కెట్లో వస్తువులు హెచ్చుగా వుంటే ధరలు తగ్గుతాయి. కాని ఇక్కడ పురుషులు అధికముగా వున్నా ధర తగ్గటంలేదు.

కట్నం స్త్రీ కొరకు ఉద్దేశింపబడింది అనే ప్రచారం వుంది. కాని ఆ డబ్బుతో ఆమెకు అసలు సంబంధం వుండనే వుండదు. తన తల్లిదండ్రులు ఇవ్వటంలో ఒక నిగూఢ భావం వుంది. భర్త పుచ్చుకోవటంలో మరో భావం వుంది. అదే ఆడమనిషివల్ల ఏ రకమైన ఉత్పత్తి వుండకపోగా ఖర్చుమాత్రం అమితంగా వుంటున్నందువల్ల, ఇంకా చెప్పాలంటే ఆడపిల్లను కన్నందుకు తండ్రికి "ఫైను" అని చెప్పుకోవచ్చు. అందుకే ఎందుకైనా మంచిదని పుట్టినప్పటినుండి పదోపరకో అమ్మాయి పెళ్ళికంటూ దాస్తారు. ఇక ఆమె చదువు సంధ్యలకు మాత్రం గుడ్‌బై చెప్తారు. ఎక్కడయినా కట్నంలేని పెళ్ళి జరిగితే విడ్డూరంగా చెప్పుకుంటారు అంటే అమ్మాయికి ఏదో లోపం వుంటుందనే చెడుప్రచారం జరుగులోంది. ఈ పరిస్థితి వెంటనే పోదని కొందరు, ఒక్కనాటితో కాదని కొందరూ, ఏం చేస్తాం మనం ఇవ్వకా తప్పదు పుచ్చుకోకా తప్పదంటూ కొందరు సమర్థిస్తారు. ఏ పరిస్థితిలోనయినా సరే కట్నం పుచ్చుకోము అని చెప్పి ఆచరించేవాళ్ళు బహుకొద్దిమందే వున్నారు. మిగతా వారంతా తాము ఇచ్చేటప్పుడొకనీతి (బాధ) పుచ్చుకొనేటప్పుడు మరోరకం భావం (సంతోషం)వెలిబుచ్చుతారు. వయస్సు వచ్చిన పిల్లను ఇంటిలో వుంచుకోవాల్సిన అవసరం లేకుండా మగడు పుస్తెకట్టి లాక్కెడుతున్నందుకు కట్నం రూపంలో ఇచ్చే లంచమే ఆ డబ్బు. ముఖ్యమైన విషయం మరోటి వుం "ఆడది" అంటే పనికిరానిదిగా భావించడం వల్లనే, ఆమె తెచ్చే ధనమూ వ వాహనాల బేరం వల్లనే ఆమెను పెళ్ళాడడం జరుగుతోంది. దానివల్ల ఆమె వ్య త్వానికి విలువే వుండదు. అందువల్లే కట్నం డబ్బు పెరిగే కొద్దీ అనాకారి అమ్మాయి అందం పెరిగిపోతూ వుంటుంది. సంతలో బేరమాడినప్పుడు ఎవరు ఎక్కువ ధర పెడితే వారికి అమ్మాయిని అమ్మటం జరుగుతోంది. ఆ ధనం ఖర్చు కాగానే, క్రొత్త మోజు తగ్గగానే వధువుకు కోరంటికం మొదలవుతుంది. అది పట్రా, ఇది తే అంటూ అమ్మాయిని రాచి రంపాన పెట్టటం, కొట్టటం, వెళ్ళగొట్టటం చేస్తున్నారు. అదీ చాలక అమ్మాయిని చంపితే మళ్ళీ మళ్ళీ ధనధాన్యాలతో, వస్తు వాహనాలతో మరో అనాఘ్రాత పుష్పాన్ని పెళ్ళాడవచ్చని ఆశతో చంపుతున్నారు. కేసుల్లేకుండా తప్పించుకుంటున్నారు. ఇలా ఎన్నో వందల వరకట్న హత్యలు జరుగుతుంటే ఒకటో రెండో బయటికొస్తున్నాయి. మిగతావి అన్నీ ఆత్మహ లుగా మారిపోతున్నాయి. మరోవర్గం అమ్మాయిల మనస్తత్వం వింతగా వుంటు మాకు కట్నం అక్కరలేదు కాని విదేశాలు పంపి చదివించమని డిమాండు చే అది ఎంత అసాధ్యమో మనకు తెలుసు. కొందరు అమ్మాయిలకి చదువులేకపో

చాలినంత కట్నం తెస్తే చాలు అని స్పష్టంగా చెప్పుకోటానికి సిగ్గుపడటం లేదు. వారి దృష్టితో ఇంటిని, పిల్లల్ని, భర్తను సరిదిద్దుకుంటే చాలునని, కొందరు తమ భార్యలు గొప్ప డిగ్రీలు కలవారయి వుండాలని, డాక్టర్లు, పి. హెచ్. డి లు, కలెక్టర్లు అయినా ఉద్యోగాలు చెయ్యరాదని శాసించి మానిపిస్తారు. ఇద్దరూ డాక్టర్లు అయినా అమ్మాయి విధిగా కట్నం చెల్లించాలి. ఒక లేడీడాక్టర్ తాను ఉద్యోగం చేసిన డబ్బుతో తన భర్తకు కట్నం ఇచ్చి పెళ్ళాడింది. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్నో మరెన్నో ఉదాహరణలున్నాయి. ఏదైనా మొత్తంమీద అమ్మాయి తక్కువ, అబ్బాయి ఎక్కువ అనేదే వరకట్నానికి ముఖ్యకారణం అని చెప్పక తప్పదు.

ఇన్నాళ్ళుగా మనం గమనించని మరో ముఖ్య విషయం వుంది. పిల్ల తల్లి దండ్రుల పాత్ర ఈ విషయంలో తక్కువేమీ కాదు. కట్నం ఇవ్వటంలో అనేక భావాలు వారి మస్తిష్కాలనిండా వుంటాయి. కొన్ని కేసుల్లో వీరు తెలిసి చేసే పొరపాట్లు వుంటే కొన్ని వీరి పరోక్షంలో జరిగిపోతూ వుంటాయి. తలకు మించిన సంబంధంకై ఎగబడి వారి కోర్కెలన్నీ తీరుస్తామని శాద్ధి చేస్తారు. వాటిని (టి. వి., కారు, స్లాట్సు వగైరా) సమయానికి ఇవ్వలేక గడువు ఇవ్వమని అర్థిస్తారు. ఇక భర్త, అత్తమామలు అమ్మాయిని వేధించడం, బాధించడం జరుగుతూ వుంటుంది. ఇక్కడ మరో విషయం గమనార్హం. అమ్మాయి వచ్చి అత్తవారు తనను హింసిస్తున్నారని మొరపెట్టుకున్నా పట్టించుకోరు. పైగా "పెళ్ళిఅయ్యాక నీస్థానం అక్కడే. ఇక్కడలేదు పో" అని కసురుకుంటారు. "విడాకులు పుచ్చుకొని వచ్చేకంటే చచ్చేది మేలు" అని హెచ్చరించి పంపేస్తారు. ఆ పిల్లకూడా తన పెళ్ళికెంత ఖర్చయింది కదా అని మిన్నకుంటుంది. వ్యాపారం పెట్టినప్పుడు మధ్యలో మానుకుంటే నష్టపడ్డట్టు అంటే తనకు పెళ్ళికావటమే ధ్యేయమని, అది విఫలమైతే ఇక జీవితాంతం జీవచ్ఛవంలా బ్రతకాలని భావిస్తుంది, కష్టపడటం తల్లిదండ్రుల తనకు వుండే విద్యుక్త ధర్మమని నమ్ముతుంది. తీరా పుట్టింటికెళ్ళినా అక్కడ అన్నదమ్ములు, మరదళ్ళు తనను హీనంగా చూస్తారనే నిరాశతో నిరాధారంగా నిస్సహాయురాలై పడివుంటుంది? పరిస్థితులు విషమించినప్పుడు చావడమో, చంప బడటమో జరుగుచున్నది. ఇదీ జరుగుతున్న చరిత్ర.

## కట్నం స్త్రీ కొరకా?

తమ పిల్ల జీవితాంతం సుఖపడుతుందనే ఆశతో తల్లకు మించిన కట్నం

ఇచ్చి, తాహతును మించిన విందులు వినోదాలతో పెళ్ళిచేస్తారు. కట్నం అమ్మాయి కొరకే వుద్దేశింపబడిందంటారు. కాని ఆమెకు అందులో సంబంధం వుండదు. ఆమె పుట్టింటిలో మగవారినుంచి ఆ కట్నాన్ని అత్తింటి మగవారికి అందించే సాధనం మాత్రమే. కూతురి కొరకు వెచ్చించాము అంటారేకాని ఆమెకు ఆ ధనంపై ఏమాత్రం హక్కు వుండదు. ఆమెకిచ్చిన నగలపైనా, వస్తువుల మీదా కూడా "కంట్రోలు" ఆమెకు వుండదు. వాటిని అమ్ముకోటానికి, దానం చేయటానికి కూడ హక్కు వుండదు. ఆమె కేవలం కాపలాదారు మాత్రమే. కష్టకాలంలోనైనా ఆమెకు ఆ వస్తువులు అక్కరకు రావు. ఆమె వ్యక్తిత్వం కోసం ఏమీ చెయ్యరు, అంతా అల్లుడి చేతిలో పోస్తారు. అలా కూతుర్ని హింసించటానికి ప్రోత్సహిస్తున్నారా? అనిపిస్తుంది. ఎంత ఎక్కువ కట్నం ఇస్తే అంత అధికారం అతనికి ఇస్తున్నా మన్నమాట. ఇంత అయినా కొడుకు వాటాతో కూతురి వాటా సమానం కానేకాదు. కొడుక్కి ఆస్తి అంతా ఇస్తారు. కూతురికి పెళ్ళిచేసి పంపుతారు. ఆదాయం వొచ్చే ఆస్తి, పొలం, ఫ్యాక్టరీ, డిపాజిట్లు, షేర్లు కొడుక్కి ఇస్తారు. చెంబు, కారు, మంచం బీరువాలాంటి ఆదాయంరాని సరుకు అమ్మాయి కిస్తారు. తమ కుటుంబ ప్రతిష్ఠ చూస్తారు కాని కూతురి క్షేమం చూడరు. ఇదీ తల్లిదండ్రుల తంతు.

ఇక వరకట్న విషయంలో సామాజిక పాత్ర చాలా వుంది. కట్నం ధనికుడిని ఇంకా ధనికుణ్ని చేస్తుంది. అంటే కారు కొనేవాడికి కారు, టీ. వీ కొనేవాడికి టీ. వీ. ఇస్తారు, వరుని హోదాను గుర్తించేదే వరకట్నం. పూర్వం రాజులకు, జమీందార్లకు బహుమానాలు (నజరానా)ఇచ్చినట్లే గొప్పవారికి కానుకలు చెల్లించడ మన్న మాట. ఒక్కమాటలో చెప్పాలంటే వయస్సు వచ్చిన పిల్లను నెత్తిమీద నుంచి దింపి తీసుకెడుతున్నందుకు భర్తకు ఇచ్చే లంచం కట్నం. ఎంత దూరం ఆమె పెళ్ళయి వెళ్ళిపోతే అంత సంతోషం. వెంట వెంట రాదుకదా అనిసంతోషం. వరులకు మార్కెట్ వుంది పిల్లను వదిలించుకోవాలి. ఎలా? కట్నం పారేసి పంపేస్తే సరిపోతుంది కదా? అసలు పిల్లనిస్తామని అడగటంలోనే కట్నం అనే ఈ ధ్వని వస్తుంది. మంచి సంపన్న కుటుంబం అని చెప్పుకోవటంలోనే హెచ్చుగా ఇస్తామనే భావం ఇమిడి వుంటుంది. ప్రతిచోటా దానం ఇచ్చేవాడు గొప్పకాని ఇక్కడ ఇచ్చి కూడా ఆడపిల్లను కన్నాను కనుక లొంగి వుండక తప్పదని భావిస్తారు. ఈనాడు కట్నానికి కూడా ఫిక్సెడు రేట్లు వున్నాయి. ఏ పదవీ, ఆస్తి లేకపోయినా మగా

తుగా పుడితేనే కట్నం చెల్లించాలి. ఇక డిగ్రీలున్న వారి విషయం సరేసరి. ఇలా వరకట్నం స్త్రీ పురుషుల మధ్య అధికార సంబంధాన్ని తెలియజేస్తుంది. వ్యాపార దృష్టిని సృష్టిస్తుంది.

ఆడపిల్లలే అడిగి కట్నం ఇప్పిస్తున్నారని వింటున్నాం. అసలు వాళ్ళు పెళ్ళి చేసుకోవటమా? లేదా అనేదే వాళ్ళ చేతుల్లో లేదే ఇక కట్నం ఇమ్మని ఎలా చెప్తుంది. కుటుంబమే ఆ విషయం తేల్చుకుంటుంది. కాకపోతే చీరల రంగులు, గాజుల డిజైన్స్ ఆమెను అడుగుతారు. కట్నకానుకలు అత్తా, ఆడబిడ్డలు అడుగుతారని నిందిస్తారు. కాని మగవాళ్ళు గట్టిగా వొద్దంటే వాళ్ళేమీ చేయలేరు. వాళ్ళు అడిగినా చెల్లదు ఇదొక పోజు తప్ప మరేమీకాదు. వరకట్నం, అత్తింటి కాపురం అమ్మాయికి గొడ్డలిపెట్టు లాంటివి. పిల్లకు పెళ్ళికాగానే నెట్టేస్తారు. అదేదో దైవనిర్ణయ మయినట్లు పురుషుడికి మాత్రం పెళ్ళి అయినా పుట్టింట్లో వుండే హక్కు వుంది. మరి ఇది ద్వంద్వ నీతికాదా? వరకట్న మరణాలకు మూలం సగం అంటే యాభయి శాతం భర్త అయితే మిగతా సగం అత్తమామలు. ఆడబిడ్డలు వగైరా అవుతున్నారు. కనుక పెళ్ళికాగానే దంపతులు వేరుగా వుండగలిగితే సగం చికాకులు సమసి పోతాయి. అంతమాత్రాన పెంచినవారిని పరిత్యజించమనికాదు.

డబ్బుతో స్త్రీని ఖరీదు చేస్తే వ్యభిచారం అంటున్నాం. ఆడది కట్నం ఇచ్చి పెళ్ళిపేరుతో మగాడి సాంగత్యం కోరితే దాన్ని పవిత్రమయిన వివాహ బంధంగా పొగుడుతున్నాం కదా! మరి ఇది అసమానత్వ చిహ్నం కాదా! అసలు స్త్రీకి మాత్రమే పెళ్ళి అవసరమా? యువతులంతా కట్నం ఇచ్చి పెళ్ళాడబోమని ప్రతిజ్ఞలు చేసి నిలబడితే ఈ పురుషులంతా ఏమవుతారు. తగిన భర్త స్త్రీకి ఎంత అవసరమో తగిన భార్య పురుషుడికి అంతకన్నా అవసరమనే జ్ఞానోదయ లోపం వల్లనే ఈ కట్న పిశాచిని ప్రోత్సహిస్తున్నారు. తమ కుమార్తెలకు కట్నం ఇచ్చే బాధపడేవాళ్ళే కోడళ్ళను ఒత్తిడి చేస్తూ వుంటారు. మరి ఇదెక్కడి న్యాయమో? అలాగే పిల్ల తండ్రిగా కన్నతండ్రి తలవొంచాల్సిందే. ఇక అమ్మాయి ఆజన్మాంతం అందరికీ తలవొంచాలి. పెళ్ళాడేది భర్తనా లేక అత్తమామలనా, ఆడబిడ్డలనా అన్నట్లు వుంటుంది ఆమెచర్య. ఆడపిల్లను బరువుగా భావించడంవల్ల, అమ్మాయిని స్వీకరించేటప్పుడు కట్నం అడుగుతున్నారు. ఆమెపనికిరానిదిగా ఆమె తెచ్చే సొమ్మాగినే విలువైనదిగా భావించడం వల్ల ఆమె చేసే చాకిరికి విలువ లేకపోవటం

వల్ల వరకట్నాలు పెరిగి అమ్మాయిలను వరకట్న దురంతాల విషజ్వాలలకు ఎర వేస్తున్నారు. ఇలా అందరూ ఇటువారు, అటువారు, సమాజం, భర్త ఆమెను అగాధంలోకి నెట్టేస్తున్నారు.

వధువు కట్నం వరుడు అని నిర్వచించవచ్చు. ఇలాంటి వ్యత్యాసం తేడాలు, హెచ్చుతగ్గులే ఈ దుర్నీతికి కారణమనే భావంతో స్త్రీకి ఆస్తి హక్కు వస్తే ఈ దురాచారం పోతుందనే నిర్ణయంతో 1956 నాటి హిందూ వారసత్వ చట్టాన్ని సవరిస్తూ 18 మార్చి 1983న ఒక బిల్లు పెట్టింది ఆంధ్రప్రభుత్వం. ఆ బిల్లు 1983 ఏప్రియలులో చట్టమయింది. ఆస్తికి అమ్మాయి వారసురాలయితే కట్నం పోతుందనేది కేవలం భ్రమ మాత్రమే. ఇప్పుడు కట్నం పేరు మారి దాని ఛాయల రూపంలో మరో మార్గాన పయనిస్తుంది. అంటే ఇంతవరకూ కట్నం విలువైతే ఇప్పుడు అమ్మాయికి రాబోయే ఆస్తి విలువ తేల్చి చెప్పమని అడుగుతారు. ఆమె ఆస్తిని వెంటనే అమ్మించి ఆ డబ్బుతో వ్యాపారాలు వగైరా చేస్తారు. అమ్మాయి ఆస్తి బాగా తక్కువైతే ఇంకా డబ్బు పుచ్చుకుంటారు. అదనంగా లాంఛనాలు లైలు ఖర్చులు వగయిరా తేల్చి చెప్పమంటారు. కనుక చట్టాలకు కట్నాలు పోవని తేలిపోయింది. అంతమాత్రాన ఆమెకు ఆస్తి వద్దని కాదు. చట్టాలను అధిగమించి స్వార్థాలకు విలువనిచ్చే ప్రబుద్ధులున్నంత కాలం వ్యక్తులకు భవిష్యత్తు శూన్యమవుతుంది.

వరకట్న సమస్య ప్రధానంగా హిందువుల ఆచారంగా సాగుతున్నది. ఇటీవల చదువులు, హోదాలు, ఆడంబరాలు బాగా పెరిగిన తర్వాత సమాజంలో ఇతర మతాలవారు కూడా దీన్ని చేపట్టారు. మేము ఇంజనీర్లం, డాక్టర్లం, పెద్దపెద్ద వ్యాపారస్తులం మాకుమాత్రం కట్నం ఎందుకివ్వరూ అని అన్ని మతాలవారూ "డిమాండ్" చేస్తున్నారు. అన్ని కులాలలో అంతస్తుల వారీ వరదక్షిణ వుండనే వుంది.

ఇన్నేళ్ళుగా కట్నం ఇస్తున్నారు, పుచ్చుకుంటున్నారు. ఇది తప్పు అనే భావం ఇటీవలే కలుగుతోంది. ప్రభుత్వం కూడ ఈ విషయంలో కొంత శ్రద్ధ వహించినట్లు కనబడుతోంది. వరశుల్కానికి ముందు కన్యాశుల్కం వున్నదని మనకు తెలుసు. సంస్కర్తలు అనేకమంది ఆనాడు పోరాడి కన్యాశుల్కాన్ని

అరికట్ట గలిగారు. కనుక కన్యాశుల్కం గురించి కొంత తెలిస్తే అది వరశుల్కంగా ఎలా మారిందో తెలుస్తుంది.

వరుడు ఆడపిల్ల తండ్రికి ధనమిచ్చి ఆ పిల్లను పెళ్ళాడటం అసురవివాహం అంటారు. తండ్రికి ఇవ్వబడిన డబ్బును శుల్కం అంటారు. అసుర వివాహన్ని నాటి శాస్త్రకారులు గర్హించారు. ఆడపిల్లను అమ్ముకోవడం అతి దారుణమని, దురాచారమని అభివర్ణించారు. వేదకాలంలో పిల్లను అమ్మే ప్రసక్తి లేదు. భారతములో శల్యుడు మాద్రిని పాండురాజుకు అమ్మినట్లు, కన్యాశుల్కం పుచ్చుకున్నట్లు వుంది. ధర్మ శాస్త్రజ్ఞులు ఈ ఆచారాన్ని నిశితంగా ఖండించారు. ఆడపిల్లలను అమ్మినవారి సంరక్షకులు ఘోరమైన నరకానికి పోతారని, ఆ స్త్రీ అతని భార్య కాదని బోధాయనుడు ప్రకటించాడు. ఆమె తండ్రి గోత్రంలోనే వుంటుందని ఆమె కుమారులు తండ్రికి, పితరులకు తర్పణాలు విడిచే హక్కు లేదని అత్రి చెప్పాడు. ఆడపిల్లలను విక్రయించినవాడి ముఖం చూడరాదని పద్మపురాణం శాసించింది. 20వ శతాబ్దంలో కూడా ఆంధ్ర బ్రాహ్మణులు ఈ ఆచారాన్ని పాటించారు. కనుకనే గురజాడవారి కన్యాశుల్కం నాటకం వెలిసింది. కాగా శూద్రులలో 'ఓలి' అనే పేరుతో కన్యాశుల్కం సాగుతోంది. అయితే ఓలి లాంఛనంగా వుందికాని స్త్రీయొక్క బజారు ధర మాత్రంకాదు. స్త్రీని విక్రయించిన అలవాటు యొక్క అవశేషంగా ఓలి ఈనాడు ఇంకా వుంది, ఇది అనార్యుల ఆచారమని చెప్పవచ్చు. ఒక విధంగా ఇది గర్హనీయమే.

వేదకాలంలో వరకట్నం వుండేదా? అనే విషయాన్ని గురించి గమనిద్దాం. శారీరక సౌందర్యం, లలిత కళలలో కృషి ఉన్న కన్యలకు పెళ్ళి తేలికగా అయ్యేది, కావున ఋగ్వేద కాలంలో కట్నం అంటే తల్లిదండ్రులు కుమార్తెకు ఇచ్చే ధన కనక వస్తు వాహనాదులు అన్నమాట. అంతే వరునికి ఇచ్చేది కాదు. ప్రాచీన హిందువులలో వరకట్నం లేదు. ద్రౌపది, సుభద్ర, ఉత్తర తమతోపాటు అత్తవారింటికి గుర్రాలను, ఏనుగులను, సొమ్ములను తెచ్చారట. స్మృతులలో వరకటాన్ని గురించి ఒప్పందాలు కనపడవు. కన్యాదానం సమయంలో దక్షిణగా కొంత పైకం మాత్రం వరునికి ఇచ్చేవారు. క్రీ. శ. 13, 14 శతాబ్దాల్లో రాజస్థాన్‌లో వరకట్నం పెరిగిపోయింది. 19వ శతాబ్దం మధ్య కాలంలో దారుణరూపం దాల్చింది. పళ్ళెంలో రూపాయలు నింపి వరునికి కుమ్మరించే ఆచారం వచ్చింది. ఇప్పుడూ అలా ఇస్తున్నారు కాని రహస్యంగా సాగుతున్నది. అయితే అది బహి

రంగ రహస్యం. ఎవరూ కేసు పెట్టరు, ఎవరూ సాక్ష్యం చెప్పరు, ఇది జరుగుతున్న చరిత్ర.

ప్రాచీన కాలంనాటి కుటుంబ చరిత్ర పరిశీలిస్తే వివాహ పరిధి అంతకంతకూ సంకుచిత మవుతూ వచ్చింది. ప్రారంభంలో స్త్రీల గుంపు, పురుషుల గుంపు వుండేవి. పురుషుల గుంపుకంతకూ ప్రతి స్త్రీ భార్య—అలాగే స్త్రీల గుంపుకంతకూ ప్రతి పురుషుడు భర్త. ఈ విధమైన గుంపు పెళ్ళిలో అనేక మార్పులు వచ్చాయి. గుంపులు పరిమితమవుతూ వచ్చాయి. జంట పెళ్ళిళ్ళు వచ్చాయి. అందులో తల్లులే పిల్లలకు సంబంధాలు ఏర్పరచేవాళ్ళు. ఆ దంపతులకు గుంపులోను, తెగలోను స్థానం వుండేటట్లు కుదిర్చేవారు. క్రమంగా వ్యవసాయం వృత్తి గా అయింది. సొంత ఆస్తి ఏర్పడింది. తన బిడ్డలకు ఆస్తి ముట్టచెప్పాలనే తాపత్రయం వచ్చింది, అలా తండ్రికి కుటుంబంపై హక్కు వచ్చి పితృసామ్యం నెలకొల్పడం జరిగింది. తర్వాత వివాహ వ్యవస్థలో అనేక మార్పులొచ్చాయి. స్త్రీకి, పురుషుకి కూడా విలువకట్టారు. స్త్రీ పురుషుల గుణగణాలకు కాక వారి ఆస్తిని పట్టి విలువ వచ్చింది. అలా పురుషాధిపత్యం పాదుచేసుకోవడం జరిగింది. వివాహానికి పరస్పర ప్రేమ ముఖ్యమని ఆనాడే కాదు, ఈ నాటికి గ్రహింపు రాలేదు. అలా మధ్యయుగాల నాటికి వివాహానికి సంబంధించి వధూవరుల సమ్మతికి ప్రాముఖ్యత పోయింది. వివాహ మనేది ఒక సామాజిక ప్రక్రియ అయినా వివాహానికి సంబంధించి జీవిత భాగస్వామిని ఎంచుకోవడంలో పురుషునికి వున్న స్వేచ్ఛ స్త్రీకిలేదు. కొంతకాలం సంతలో వస్తువుకు కొన్నట్లు శుల్కం ఇచ్చి పిల్లను కొనేవారు. ఆ పిచ్చిపోయి ఈనాడు కట్న దయ్యం పట్టింది. ఏదేమైనా ఈ రెండు దురన్యాయాలకు బలి అవుతున్నది స్త్రీలేనని వేరే చెప్పాల్సిన పనిలేదు.

ఇన్నేళ్ళు కట్నం ఇస్తున్నారు, పుచ్చుకొంటున్నారు. ఇది తప్పు అనే భావ ఇటీవల మాత్రమే కలుగుతున్నది. కొంతమంది ఆందోళనల ఫలితంగా సమ పుష్పరూపం దాల్చింది. ప్రజల అలజడి మాత్రమే చాలదని ప్రభుత్వం కూ కట్టుదిట్టమైన శాసనాలు నిర్మిస్తే కొంత భయంతోనయినా వెనకాడతారనే ప్రజా ప్రాయం మీద కొన్ని శాసనాలు చేసింది ప్రభుత్వం. తర్వాత ఒక కమిటీని నియమించి తద్వారా కొన్ని సవరణలు చేసింది. ఆ శాసనాలు గురించి వాటి ఫలితా గురించి విశదీకరించుకొందాం. అది చాలా అవసరం కూడాను.

వరకట్న నిషేధ శాసనం మొదట్లో మన రాష్ట్రప్రభుత్వం 1958లో ఒక చట్టాన్ని ప్రవేశపెట్టింది. ఆ చట్టం గురించి అసలు ఎవ్వరూ పట్టించుకోనే లేదు. ఈ రాష్ట్ర చట్టాన్ని రద్దుచేసి కేంద్రప్రభుత్వం 22 మే 1961న దేశానికి కంతటికీ వర్తించే వరకట్న నిషేధ చట్టాన్ని (DOWRY PROHIBITION ACT)ని ప్రవేశపెట్టింది. అందులో కట్నం ఇచ్చినా, పుచ్చుకున్నా, సహాయపడినా ఆరు నెలల వరకు శిక్ష లేక జరిమానా విధించవచ్చు అని శాసించారు. కాని 1981 నాటికి నమోదయిన కేసు ఒక్కటి మాత్రమే. నగదు, సొమ్ము, వస్తువులుగా ఇవ్వటాన్ని అంటే బహుమానాలుగా ఇస్తే వాటికి శిక్షలేదు. కాని పెళ్ళి చేసుకున్నందుకు ప్రతిఫలంగా ఇస్తే అది కట్నమని నిర్వచించారు ఆనాడు చట్టంలో. కట్నం ఇవ్వటానికి, పుచ్చుకోటానికి జరిగే ఒప్పందం చెల్లదని ఆ చట్టంలో వ్రాశారు. కట్నం తీసుకున్న సం॥ లోపల ఆ ఆస్తి భార్యకు అందచేయాలని, వధువు మైనరుగా వున్నప్పుడు కట్నం పుచ్చుకుంటే ఆమె మేజరైన సం॥ లోపలే కేసు పెట్టాలని, ఈ కేసు ఎత్తివేసుకోటానికి కోర్టు అనుమతి వుండాలని కూడా చెప్పారు. ఈ కేసులు పోలీసులు పెట్టరాదని 1961 నాటి చట్టం నిర్వచించింది. అసలు ఈ చట్టానికి, మానవనైజానికి అవినాభావ సంబంధం కుదరనే లేదు. అందువల్లే చట్టం వచ్చిన 20 సం॥లకు ఒక్క కేసు మాత్రమే నమోదయింది. చట్టాలలో వుండే లోపాలు సమస్యను తీవ్రతరం చేస్తాయే తప్ప పరిష్కారానికి ఉపయోగపడవు. అలా ఈ చట్టం నీరు కారిపోయింది.

అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగా దేశంలో స్త్రీల పరిస్థితిని సర్వేచేసి రిపోర్టు అందించమని కేంద్రప్రభుత్వం ఒక కమిటీని "స్టేటస్ కమిటీ" సమానత్వం వైపు Towards EQUALITY (Govt. of India 1974)ని నియమించింది. స్త్రీల హోదాకు సంబంధించిన ఆ కమిటీ తన నివేదికలో వరకట్న నిషేధ చట్టం విజయవంతం కాకపోవటానికి తగుకారణాలను వివరించింది. అందులో కొన్నింటిని పరిశీలిద్దాం.

వరకట్నం ఇవ్వటం పుచ్చుకోవటం విషయంలో కోర్టు స్వయంగా జోక్యం కలిగించు కోలేదు కనుక బాధితుడు గాని, అమ్మాయి కాని లేదా ఆమె సన్నిహిత బంధువులుగాని కోర్టుకు వెళ్ళాలి. కాని అలా చేయడానికి కట్నం ఇవ్వడానికి

సిద్ధంగా వున్నవాళ్లెవ్వరూ కోర్టుకు వెళ్ళటానికి ఇష్టపడరు. పైగా ఈ చట్టం తల్లి దండ్రులు. అత్తమామలు వధూవరులకిచ్చే "బహుమానాల" ను వస్తు రూపములో అంగీకరిస్తుంది. ఇవీ చట్టంలోని లోపాలని వివరించింది "స్టేటస్ కమిటీ." ఇంకా ఈ కమిటీ కొన్ని సిఫారసులను చేసింది ఆ సిఫారసులు చాలా విలువైనవిగా వున్నాయి.

1. వరకట్నం ఇవ్వటంకూడా నేరంగా గుర్తించాలి, కాని కావాలని తీసుకోవటం మాత్రమే తప్పు కాకూడదు. 2. వరకట్నం తీసుకున్నా లేక డిమాండు చేసినా 6 నెలలనుండి రెండు సంవత్సరాలవరకు శిక్ష విధించాలి. 3. వరకట్నానికి సంబంధించిన ఫిర్యాదులు చేయటానికి ఎటువంటి నియమ నిబంధనలు వుండరాదు. 4. వరకట్న నిషేధ చట్టాన్ని గురించి మాట్లాడుతూ కమిటీ బహుమానాలకు సంబంధించిన సీలింగు వార్షిక ఆదాయంతో 20 శాతం గాని లేక 15000 రూ. కాని ఏది తక్కువైతే దానిని దాటరాదని, వివాహానికి అయ్యే ఖర్చు 7 శాతం ఆదాయంకాని, 3000 రూ. లు కాని మించరాదని లేదా ఏది తక్కువైతే దానిని దాటరాదని సూచించింది. పైగా అనుమానాస్పద పరిస్థితులలో కనుక అమ్మాయి మరణించినట్లయితే వరునకు ఇచ్చిన బహుమానాలను వధువు తల్లిదండ్రులకు తిరిగి పంపించవలసి వుంటుందని కూడా కమిటీ సిఫారసు చేసింది. ఇంకా వరునికి కాని, తల్లిదండ్రులకు గాని 500 రూ. మించి ఇవ్వబడిన బహుమానాలు, లేక వారికి ఖర్చు తగ్గింపునకు (వరుని ప్రయాణపు ఖర్చులు, పెళ్ళి ఖర్చులు వగైరా ) జరిగే చర్యలు శిక్షార్హం కావాలని సిఫారసు చేసింది. వరకట్న నిషేధ చట్టం రూపొందించిన నియమ నిబంధనలకన్నా, నిషేధాలకన్నా, సంయుక్త కమిటీ సూచించిన సిఫారసులు ఎక్కువ ఉదారంగా వున్నాయి. అలా ఉండడానికి కారణాన్ని ఈ కమిటీ ఇచ్చిన సిఫారసులు తల్లిదండ్రులు శక్తికి మించకుండా పెళ్ళికి ఖర్చుపెట్టరాదనే సూచన సమాజానికి కూడా ఆమోదయోగ్యం కావడం వల్లనే వాటికి అంత విలువ, హోదా వచ్చింది. ఈ స్టేటస్ కమిటీ సిఫారసుల్లో మరో ముఖ్యవిషయం వుంది. ఈ కేసులను పోలీసులు పెట్టే వీలువుండాలని, వారంటు లేకుండా నేరస్తుని అరెస్టు చేసే హక్కు ఇవ్వాలని అయితే కేసుల దర్యాప్తు, నిర్వహణ, దాఖలు స్వచ్ఛంద సంస్థలు నిర్వహించాలని సూచించారు. ఆ నివేదికను స్టేటస్ కమిటీవారు 1974 లో కేంద్రానికి సమర్పించారు. దౌరి సవరణ బిల్లులో వీరి సిఫారసులన

కొన్ని పొందుపరచటం జరిగింది. కొన్ని సూచనలు చట్టంలో చేర్చనివి కూడా వున్నాయి అవి వరకట్నాన్ని ఇవ్వటంకాని, పుచ్చుకోవటంకాని ప్రభుత్వోద్యోగుల నడతకు సంబంధించిన రూల్సు (Government Conduct Rules)కు భిన్నంగా ప్రవర్తించటంగా పరిగణించాలని చెప్పారు. ఇంకా 1961 వరకట్న నిషేధ శాసనపు అమలు తీరును, ఫలితాలను ఐదు ఏళ్ళ తరువాత తిరిగి సమీక్ష చేయాలని కూడా హెచ్చరించడం జరిగింది.

1961 నాటి చట్టాన్ని సవరించే బిల్లును కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టింది. ఈ సవరణ బిల్లుకు సలహాలివ్వటానికి కేంద్రం ఒక జాయింటు కమిటీని 1982 ఆగస్టులో సాక్ష్య సేకరణ చేసి తమ నివేదికను అందజేసింది. ఆ కమిటీ చట్ట సవరణను, సమస్యను పరిష్కరించడానికి కొన్ని సిఫారసులు చేసింది. ఏదైనా నేరం స్పష్టంగా నిర్వచించలేదు ఆ బిల్లులో. అంటే పెళ్ళికి ముందుకాని, వివాహ సమయంలో కాని, వివాహం తర్వాత కాని, ఇచ్చిన డబ్బు, పొలము, డిపాజిట్లు వస్తువులను కట్నం (పెళ్ళికి ప్రతిఫలంగా) అని ఆ శాసనంలో వుంది. నేరం అంటే ఏ రూపంలో ఇస్తే, ఎప్పుడు ఇస్తే నేరమో బిల్లు చెప్పలేదు. నేరం రుజువు అయితేనే కదా శిక్ష. నేరం ఏమిటి అనే దానిపై భాష్యాలకు తావుంటే నేరం ఎలా రుజువు అవుతుంది అని కమిటీవారు విమర్శించారు. మొత్తంమీద ఈ సవరణ బిల్లులో కొన్ని లోపాలు వున్నాయని విమర్శలు వచ్చాయి. రహస్యంగా ఇచ్చే దానిని పట్టుకోలేము కదా. కాకపోతే పదిమందికి కనిపించే ఆడంబరాలను, ఖర్చును కొంత నిరోధించవచ్చు.

1961 వరకట్న నిషేధ శాసనం 1984లో సవరించబడింది. సవరణ చట్టము తే. 2-10-84 నుండి అమలులోకి వచ్చింది. ముఖ్యమైన మార్పులు జరిగాయి. శిక్షల పరిమితి, బహుమతుల జాబితాలు, జరిమానాల పెంపు, కేసు పెట్టడానికి అర్హత, వరకట్నాన్ని వివాహమాడిన స్త్రీకి తిరిగి ఇవ్వడానికి నిర్దేశించిన కాలవ్యవధి మొదలగు విషయాలలో మార్పులు వచ్చాయి. కట్నంయొక్క నిర్వచనాన్ని కూడా మార్చడం సంభవించింది. ఈ శాసనం అందరికి వర్తిస్తుంది. అయినా వరకట్న దురాచారం హిందువులలో ఎక్కువగా ఉన్నది. ఈ శాసనాన్ని ప్రత్యేకంగా హిందువులకే వర్తింప చేయకపోయినా ఆచారంగా. సంప్రదాయంగా హిందువులలో హెచ్చుగా జరుగుతోంది. ఇటీవల మిగతా మతాలవారు కూడా

కట్నాన్ని 'డిమాండ్' చేస్తున్నారు. వివాహంలో ఒక పార్టీ మరియొక పార్టీకి, లేక ఒకపార్టీ తల్లిదండ్రులుగాని మరెవరైనా గానీ రెండవ పార్టీకి లేక మరియొక వ్యక్తికి ఆ పార్టీల పెండ్లి సందర్భంగా ప్రత్యక్షంగాగాని, పరోక్షంగా గాని ఆస్తి, లేక విలువగల ధనం, పత్రం, చరాస్తి వగైరా ఇచ్చుటకు అంగీకరించినది కట్నమన బడును. ముసల్మాను ధర్మశాస్త్ర ప్రకారం పేర్కొనబడిన 'మహర్' (DOWER) దీని క్రిందకు రాదు. (సెక్షను 2) ఏ వ్యక్తి అయినా కట్నం ఇచ్చినా, పుచ్చుకున్నా, లేక ఇచ్చుటలో పుచ్చుకొనుటలో, సహాయపడినా అతనికి ఆరు మాసములకు తక్కువగాని జైలుశిక్ష అది 2 సంవత్సరముల వరకు ఉండవచ్చును. మరియు 10 వేల రూపాయలకు లేక కట్నానికి ఏది ఎక్కువైతే దానికి మించని జరిమానాకు పాత్రుడు లేక పాత్రురాలు కాకపోతే ప్రత్యేక కారణాలను పేర్కొని కోర్టు ఆరుమాసాలకు తక్కువ శిక్ష వేయవచ్చును. వివాహకాలమందు ఎవరూ కోరకుండా, వధువుకు ఇవ్వబడిన బహుమతులు ఈ శాసనం క్రింద తయారయిన నిబంధనల ప్రకారం ఏర్పడిన జాబితాలో పేర్కొనబడినచో కట్నం క్రిందికి రావు.

అలాగే, ఎవరి చేతా కోరబడకుండా, వరునికి వివాహమపుడు ఇవ్వబడిన బహుమతులు– జాబితాలో వ్రాయబడితే– కట్నం క్రిందికి రావు. కాగా వరునికివచ్చే బహుమతులకు సంబంధించి మరో షరతు ఉన్నది. అవి వధువు తరపునగాని లేక వధువుకు బంధువైన వ్యక్తి తరపునగాని ఇవ్వబడి, అవి ఆచార ప్రకారం ఇవ్వబడే బహుమతులు అయి, ఎవరి వల్ల లేక ఎవరి తరపున ఆ బహుమతులు ఇవ్వబడినవో, ఆ వ్యక్తి యొక్క ఆర్థికస్తోమతును పరిగణనలోకి తీసుకొనినచో అధిక విలువ కానివి అయినచో అవి కట్నం క్రిందకు రావు (సెక్షను 3) ఏ వ్యక్తి అయినా ప్రత్యక్షంగా కాని, పరోక్షంగా కాని వధువు లేక వరుని యొక్క తల్లిదండ్రుల నుండి, బంధువులనుండి లేక సంరక్షకుని నుండి కట్నం 'డిమాండు' చేసినచో ఆ వ్యక్తికి రెండు సం॥లకు మించకుండా, ఆరు నెలలకు తగ్గకుండా జైలు శిక్ష మరియు 10 వేలకు మించని జరిమానా వేయవచ్చును. కాకపోతే తగిన కారణాలు ఉంటే కోర్టువారు 6 నెలల లోపున శిక్ష వేయవచ్చును (సెక్షను 4). కట్నం ఇవ్వడానికి, పుచ్చుకోడానికి చేసుకున్న ఒప్పందం చెల్లనేరదు (సెక్షను 5).

ఏ స్త్రీ వివాహ సందర్భంగా కట్నం ఏ వ్యక్తి చేతనైనా తీసుకొనబడినచో ఆ స్త్రీ కాక – ఆ వ్యక్తి ఆ కట్నాన్ని ఆ స్త్రీకి ఈ దిగువ విధంగా తిరిగి ఇచ్చివేయవలెను.

(i) కట్నం పెళ్ళికి ముందే తీసుకుంటే పెళ్ళి తేదీ నుండి 3 మాసాల లోపల

(ii) కట్నం వివాహమపుడు కాని లేక తరువాతగానీ తీసుకుంటే తీసుకున్న తేదీ నుండి 3 నెలల లోపల

(iii) స్త్రీ మైనరుగా ఉన్నపుడు కట్నం తీసుకుంటే, ఆ స్త్రీకి 18 సం॥ నిండిన 3 మాసాలలోగా, అది ఆమెకు అందజేయాలి. (సెక్షను6.)

అలా చేయని వ్యక్తికి 6 మాసాలకు తక్కువ కాకుండా రెండు సం॥ మించని జైలు శిక్ష లేక పదివేలకు మించని జరిమానా లేక ఆ రెండు శిక్షలు విధించ వచ్చును. అలా హక్కుదారయిన స్త్రీ చనిపోతే ఆ కట్నం ఆమె వారసులకు చెంద వలెను (సెక్షను 6 (3). ఏ వ్యక్తి అయినా కట్నాన్ని, శిక్ష చెప్పకముందు ఆ స్త్రీకి అందజేయకపోతే శిక్ష వేయడమేకాక ఆ ఆస్తిని ఆ స్త్రీకి చేర్చమని అతనికి లేక ఆమెకు ఉత్తరువును కోర్టువారు ఇవ్వవచ్చును. అలాంటి ఉత్తర్వును కోర్టువారు ఇచ్చిన గడువు లోపల ఆ వ్యక్తి ఖాతరు చేయకపోతే ఆ కట్నపు విలువను అతని ఆస్తినుండి కోర్టువారు విధించిన జరిమానాను వసూలు చేసే పద్ధతిలో రాబట్టవచ్చును (సెక్షను 6) (3A). ఈ కేసులను ఫస్టుక్లాసు మేజిస్ట్రేట్ విచారించగలడు. కోర్టు వారు ఇలాంటి కేసులను స్వయంగా తమకు తెలిసిన విషయాన్ని ఆధారంగా ఫైలు లోకి తిసుకోగలరు. లేక పోలీసు రిపోర్టు పైన, ఆ నేరంవల్ల బాధిత వ్యక్తి లేక తల్లి దండ్రులు లేక బంధువు లేక గుర్తింపబడిన సంక్షేమ సంఘం వారి ఫిర్యాదు పైన మేజిస్ట్రేటు కేసును స్వీకరించగలరు. కేంద్ర, లేక రాష్ట్ర ప్రభుత్వాలచే గుర్తింపు పొందిన సామాజిక సంక్షేమ సంఘము గుర్తించబడిన సంక్షేమ సంఘంగా పరిగ ణింపబడును. ఈ శాసనం క్రింద నమోదయ్యే నేరాలు 'కాగ్నిజిబులు' నేరాలు. అంటే పోలీసువారు నిందితులను వారంటు లేకుండా అరెస్టు చేయడానికి వీలయిన నేరాలు. ఈ కేసులో జామీనుపై నిందితుని విడుదల చేయవచ్చును. అయితే ఈ కేసులో రాజీ పడటానికి వీలులేదు. బహుమతుల జాబితాను ఎవరు తయారుచేయాలి ఎలా తయారు చేయాలి అనే దాని విషయమై కేంద్ర ప్రభుత్వం నిబంధనలను పొందించవచ్చును.

నిబంధనలను తే 19-8-1985న గెజిటులో ప్రకటించారు. బహుమతుల జాబితాను వరుడు వ్రాయాలి. ప్రతి బహుమతి, దాని వివరం, దాని సుమారు విలువ ఇచ్చినవారి పేరు, బహుమతి వధువు బంధువుగాని వరుని బంధువుగాని ఇస్తే ఆ బంధుత్వం ఈ అంశాలన్నీ ఆ జాబితాలో ఉండాలి. ఈ జాబితాపై వధూవరుల

దస్కతులు లేక వేలిముద్రలు ఉండాలి. అంతేకాక పెండ్లి సమయంలో హాజరయిన, బంధువుల, లేక ఇతర వ్యక్తుల సంతకాలు కూడా ఆ జాబితాపై తీసుకొనవచ్చును. ఈ సవరణ చట్టం చాలా విలువైనది, బరువైనది కూడా. ఇలా ఎన్ని కట్టుబాట్లు శాసనపరంగా చేసినా ఈ సామాజిక దురాచారాన్ని అరికట్టడం కష్టం.

తిరిగి 1986 అగష్టు 21 వ తేదీన కేంద్ర ప్రభుత్వం రాజ్యసభలో మరో సవరణ బిల్లును ప్రవేశపెట్టింది. 1961వ సం॥పు వరకట్న నిషేధపు శాసనం, 1984లో సవరించబడిన ఆ చట్టం తగినంత కట్టుదిట్టంగా లేదని మహిళా సంఘాల ప్రతినిధులు అభిప్రాయాలు ప్రకటించిన సందర్భంగా ఈ బిల్లు రూపొందించబడింది. ఈ బిల్లులో మూడు అంశాలు వున్నాయి.

1) వరకట్న మరణానికి కారణభూత మయినందున కనీసం 5 ఏళ్ళ శిక్ష మరియు 5 వేలు జరిమానా విధించాలి.

2) కట్నం తీసుకోలేదు అని రుజువు చేసుకోవలసిన బాధ్యత తీసుకున్న మనిషి మీద లేక తీసుకొనుటకు సహాయం చేసిన వ్యక్తిమీద వుంటుంది.

3) కుమారుని లేక కుమార్తెను వివాహం చేసుకుంటే ఆస్తిలో కాని డబ్బులో కాని వాటాను ప్రతిఫలంగా ఇస్తామని ప్రకటించుట, ప్రసార సాధనాల ద్వారా ప్రచారం చేయుట నేరము. దీనికి 6 నెలల నుండి 5 సం॥ ల వరకు జైలు శిక్ష విధించవచ్చును; లేక 15 వేలకు మించకుండా జరిమానా వేయవచ్చును. ఇది అనతి కాలంలో మరో సవరణ చట్టం కాబోతున్నది. ఎన్ని చట్టాలు పెట్టినా, సవరణలెన్ని చేసినా ప్రజల మనస్తత్వానికి, చట్టాలకు అవినాభావ సంబంధం వుండటంలేదు.

వరకట్నం సామాజిక దురాచారం కనుక సంఘంలోని వ్యక్తులే పోరాడాలి. సామాజిక మార్పు వల్లనే పరిష్కరింపబడాలి. అంటే వ్యక్తుల మనోభావాల మార్పు వల్లనే అది సాధ్యమవుతుంది. వరకట్నాన్ని పిశాచమని, మూఢాచారమని, దురాచారమని నిందిస్తే చాలదు. దానికొక నిర్మాణాత్మకమైన కార్యక్రమాన్ని చేపట్టాలి ప్రచారం చెయ్యాలి. తిరుగుబాటు చెయ్యాలి. త్యాగాలు చెయ్యాలి. కష్టాలు భరించాలి. ప్రభుత్వం కూడా పటిష్టంగా చిత్తశుద్ధితో పని చెయ్యాలి. మహిళా సంఘాలు కట్నం పుచ్చుకున్న భర్తను, అత్తమామలను అల్లరి పెట్టాలి. వారిని సాంఘికంగా బహిష్కరించాలి. ప్లాకార్డులతో వారి ఇంటిముందు ప్రదర్శనలు చేయాలి. కట్నం

పుచ్చుకున్న వివాహాలకు మనం హాజరు కారాదు. పుచ్చుకోని ఆదర్శ వివాహాలకు పిలువక పోయినా వెళ్ళి వధూవరుల్ని అభినందించి రావాలి. ఆ దంపతుల్ని సభలు పెట్టి సన్మానించాలి. స్కూళ్ళ సిలబస్‌లలో వరకట్న దురాచారాన్ని విమర్శించే పాఠ్యాంశాలు చేర్పించాలి, స్త్రీకి మాత్రమే పెళ్ళి అవసరమనే అపోహ నశించాలి. తగిన భర్త స్త్రీకి ఎంత అవసరమో, తగిన భార్య పురుషుడికి కూడా అంతే అవసరమనే జ్ఞానోదయం పురుషుల్లో కలిగించాలి. మా జీవిత భాగస్వామిని డబ్బుతో ఖరీదు చేయమని యువతులు ప్రతిజ్ఞలు పూనాలి. తుచ్ఛమైన ధనానికి అమ్ముడు పోమని విద్యార్థి సంఘాలు ప్రతిజ్ఞలు చేయాలి. ఈ విషయంలో తల్లిదండ్రులను వ్యతిరేకించి అయినా వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలి. బ్యాంకులు ఎల్. ఐ. సి. వారు "పెండ్లి ఖర్చుల నిమిత్తం అదా చేయండి" అని వివాహ ప్రకటనల పేరుతో వ్యాపార ప్రకటనల పేరుతో వరకట్నాన్ని పొగుడుతున్నారు. "హుందాగా గొప్పగా పెళ్ళి చేయబడును." అని వివాహ ప్రకటనల్లో రాస్తున్నారంటే బాగా కట్నం ఇస్తామని అర్థం. ఆ ప్రకటనలు నిరశించాలి. అలాగే స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వం, రాజకీయపక్షాలు, భారీ ఎత్తున ప్రబోధ కార్యక్రమాలు చేపట్టాలి. పత్రికలవారు వరకట్న నైచ్యాన్ని ఘాటుగా విమర్శించాలి. వరకట్న మరణాలను వెలికి తేవాలి.

న్యాయవాదులు, న్యాయాధికారులు తమ బిడ్డలకే అన్యాయం జరిగినట్లు భావించి తీర్పు ఇవ్వాలి. ఇలా అన్ని రంగాలలో విప్లవాత్మక పద్ధతుల్లో పని చెయ్యాలి. 'కట్నం ఇస్తే పెళ్ళి చేసుకోను' అనమని పిల్లలకు తల్లులు ప్రబోధించాలి. వధువుకు ఉత్తమమైన, న్యాయమైన స్వతంత్ర జీవనం కలిగి ఉండటానికి తగిన భద్రతను ఇచ్చేదాన్ని అంటే జీవనోపాధిని ఆమెకు అందజేయాలి. ఆమెకు విద్య, ఉద్యోగం, వ్యాపారం లేక వృత్తివిద్య లాంటివి ఇవ్వగలిగితే భర్తలచేతుల్లో బాధలు పడుతూ వుండదు; నోరు మూసుకుని సహించాల్సిన పని వుండదు. భార్యను చంపి మళ్ళీ పెళ్ళికి తయారయ్యే వాడికి పెళ్ళి కాకుండా సమాజం అరిజడి ద్వారా ఆపించగలగాలి.

వధువుకు ఎలా సాయపడితే ఆమె బ్రతికి బైటపడుతుంది అని ఆలోచిస్తే— కుటుంబంయొక్క వనరులలో, ఆస్తిలో కుటుంబ వ్యవహారాల నిర్ణయంలో స్త్రీకి (వాటా) భాగస్వామ్యం వుండాలి. కూతుళ్ళకు వారసత్వం లేకుండా తండ్రులు వ్యవహరించరాదని శాసనం చేయాలి. కూతుళ్ళకు ఆస్తిలో వాటా ఇవ్వకుండా

పేరెంట్సు పీలునాహూ వ్రాయరాదు. అలా వాటా నిషేధిస్తే కట్నం ఇవ్వాలని ఉత్సాహం చూపుతారు. అమ్మాయి పెళ్ళినాడు ఏమీ ఇవ్వకుండా పెళ్ళయినతర్వాత ఆమెకు ఆదాయం వచ్చే వాటా ధనంగా ఇవ్వాలి. ఆమె చనిపోతే ఆమె ఆస్తి ఆమె భర్తకు లేక భర్త ఆధీనంలో వుండే ఆమె మైనరు పిల్లలకు కాక పెద్ద పిల్లలకు ఇవ్వాలి. ఆమెకు పిల్లలు లేకపోతే పుట్టింటివారికి చెందేటట్లు చేయాలి. కట్నం డబ్బు పది సం॥ ఆమె పేర డిపాజిట్‌లో వుంచాలి. అది ఆమెకు అత్యవసరమైతేనే (జబ్బు, పిల్లలకొరకు) తెచ్చుకోవాలి. అమ్మాయి స్వతంత్ర జీవనాన్ని సాగించటా నికి తగిన విద్యాబుద్ధులు ఉద్యోగం ఆమెకు కలుగజేయాలి. తల్లిదండ్రుల ఆస్తిలో వాటా వుండి అక్కడే ఆమె స్థిరపడటానికి అవకాశం వుంటే ఆమెను పరాయి మనిషిగా చూడరు. కుమారుణ్ని ఎవరైనా బాధలుపెడితే సర్దుకుని బ్రతకమని చెప్పరు కదా? అలాగే అమ్మాయికి కూడా చెప్పాలి. వివాహం స్త్రీకి సర్వస్వం అని చెప్ప రాదు. ఆమె కన్యగా వుండటానికి అయినా హక్కు వుండాలి. అప్పుడే ఆమె స్వతంత్రజీవిగా వూహించుకోగలదు.

స్త్రీలలో అవివాహితులు, విడాకులవారు, విధవలు హుందాగా స్వేచ్ఛగా భద్రతతో జీవించగలిగే సమాజం ఏర్పడినప్పుడే ఈ సమస్య కొంత పరిష్కారింప బడుతుంది. శాసనకర్తలు, పోలీసులు, న్యాయమూర్తులు దీన్ని తమ బాధ్యతగా భావించాలి.

ప్రేమ వివాహం వల్ల కూడా వరకట్నం పోతుంది. కనుక యువతీ యువ కులు కలిసి చర్చించుకొనే అవకాశం కలుగజేయాలి, ఎన్ని ఘోరాలు జరుగుతున్నా ఎంత అన్యాయం జరుగుతున్నా, జీవితాలు అభాసవుతున్నా స్త్రీలు కష్టాలను భరించటం, సహించడం నేర్చుకొన్నారే కాని ఎదిరించడం, దెబ్బకు దెబ్బ తీయటం నేర్చుకోలేదు. అవసరమైతే బాధితురైన స్త్రీలే తిరుగుబాటు చెయ్యాలి. ఎవరూ దోపిడీ చేయని సామాజిక వ్యవస్థను నిర్మించుకోవాలి. అందుకు వస్తారని, తోడు నిలుస్తారని ఎదురు చూడటం కన్నా తామే ఉద్యుక్తులయి లయి అన్ని రంగాలలో తమకుజరుగుతున్న అన్యాయాలను అక్రమాలనుఎ టానికిస్త్రీలు సంసిద్ధులు కావాలి. ఏమార్పు రావాలన్నా బాధితులు త్యాగాలు చేయ తప్పటంలేదు. అందువల్ల ఆడపిల్లలు ధైర్యంతో విజ్ఞతతో నిలబడాలి. ఎన్ని విమర్శలు ఎదురయినా సరే ఈసమాజంలో తమకు జరుగుతున్న అన్యాయాన్ని అసమానతను వారే వ్యతిరేకించాలి. అంటే త్యాగం ధైర్యం రెండూ కలిగి

వుండాలి. అంతగా అవసరమైతే వరవిక్రయాన్ని నిరోధించటానికి తాము కన్యలుగానయినా జీవించటానికి స్త్రీలు సిద్ధపడాలి. ముఖ్యంగా అత్తగార్లు తాము ఒకప్పుడు కూతురిననీ, కోడలిననీ తల్లిననీ గుర్తుంచుకొని కోడల్ని కూతురిగా చూస్తే "స్త్రీకి స్త్రీయే శత్రువు" అనే అపప్రధ తొలగిపోతుంది. తన భర్త, కుమారుడు పురుషులనేది విస్మరించరాదు. వారి ఆశాపాశాన్ని త్రెంచి వేయాలి. వారికి నీతిబోధ చెయ్యాలి. వారి మనస్సులు మార్పుగలగాలి. అలా సమాజం, యువతీ యువకులు, అత్తమామలు, తల్లిదండ్రులు, ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలూ కలిసి ఐక్యతతో స్థిరచిత్తంతో నిలిస్తే వరకట్నం పటాపంచలవుతుంది.

ముఖ్యంగా స్త్రీలలో చైతన్యం వెల్లివిరిసిననాడు వరకట్నం ఇవ్వడానికి వారు నిరాకరించిననాడు, వివాహం స్త్రీకి తప్పనిసరి సంస్కారమని భావించటం మానివేసిననాడు, కట్నం తీసుకున్న పురుషుని సమాజం ఈసడించి, అసహ్యించే స్థితికి కొంతగా కొంత వచ్చిననాడు ఈ దురాచారం నశిస్తుంది. ఆ శుభ సమయాన్ని దగ్గర చేయడానికి స్త్రీలు ఉద్యమించాలి.

వరకట్న దురాచారాన్ని తొలగించాలంటే కులమతాల ప్రసక్తి లేని ప్రేమ వివాహాలకు అవకాశంగల వ్యవస్థ ఏర్పడాలి. ఆ సమాజంలో కులమత తేడాలు తొలగిపోతాయి. ఆస్తుల, అంతస్తుల తేడాలు నశించిపోతాయి. ముఖ్యంగా స్త్రీలకు దూరమైపోతున్న స్వేచ్ఛ దగ్గరవుతుంది. సమాజంలో సమతుల్య స్థితి నశించకుండా వుంటుంది. ఇందులో ఇద్దరూ నశించకుండా వుంటుంది. ఇందులో ఇద్దరూ స్వతంత్రించి తమకు నచ్చిన వారిని స్వీకరిస్తారు. కులం, గోత్రం, ఆస్తి, అంతస్తు గణనలోకి రావు. కష్టాలు కలిగినా ఓర్మితో భరిస్తారు. కుటుంబంలో సామరస్యం పెరుగుతుంది. అయితే ఈనాటి వ్యవస్థలో ప్రేమ వివాహాలు సాధ్యమా? అనే ప్రశ్న రావచ్చు. కాని మనం చిత్తశుద్ధితో తల పెడితే ఏదీ అసాధ్యం కాదు. విద్యాలయాల్లో సహవిద్యను పెంచాలి. వివాహానికి ముందుగానే దంపతులిద్దరూ తమ లక్ష్యాలు, ఆదర్శాలు గురించి చర్చించుకొనే అవకాశం వారికి మనం కలిగించాలి. దాంపత్య విధానం, కుటుంబ వ్యవస్థా, బాధ్యతలూ గురించి వారు ఆలోచించుకోవాలి. ఆ వివాహాలలోనే వరకట్న ప్రసక్తి అంతరిస్తుంది. కనుక ఈ వివాహాలు జరిపించేందుకు కొంత సామాజిక మార్పు అవసరం. ఆ మార్పుకు మహిళా సంఘాల తోడ్పాటు, ప్రజల సహకారం చాలా అవసరం. అన్ని రంగాలలో అనిర్వచనీయమైన మార్పులు తోడ్పాటు వచ్చిననాడు మాత్రమే ఈ వరశుల్క నిర్మూలన జరుగుతుంది. ఆ రోజుకై అందరం ఎదురుచూస్తూ వుందాం.

•

మహిళా వికాసానికి

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం

| | | |
|---|---|---|
| చరిత్ర | 1. ఆం. ప్ర. మహిళోద్యమం(1860–1983)రు. | 25–00 |
| విమర్శనాత్మక | 2. హైందవం : స్త్రీలు | 25–00 |
| గ్రంథాలు | 3. ఇస్లాం : స్త్రీలు | 15–00 |
| | 4. క్రైస్తవం: స్త్రీలు | 12–00 |
| వ్యాస సంపుటాలు | 5. సమస్యలు, సంస్కరణలు | 25–00 |
| | 6. మహిళా దశాబ్దం | 7–50 |
| | 7. స్త్రీ విమోచన | 7–50 |
| | 8. ఓ మహిళా ; ముందుకు సాగిపో | 7–00 |
| | 9. వనితాలోకం | 12–00 |
| | 10. మనం; మన సంస్కృతి | 12–00 |
| | 11. బానిసా కాదు, దేవతా కాదు | 10–00 |
| | 12. స్త్రీలపై అత్యాచారాలు | 7–00 |
| | 13. స్త్రీల హక్కులు: సమస్యలు | 6–00 |
| | 14. మత ధర్మశాసనాలు; మహిళలు | 8–00 |
| | 15. బంగారు సంకెళ్ళు | 10–00 |
| | 16. హేతువాదం; స్త్రీలు | 5–00 |
| | 17. లైంగిక విప్లవం | 4–00 |
| సంకలనాలు | 18. వివాహం; నేడు, రేపు | 20–00 |
| | 19. మహిళా వికాసం: శ్రమ, ఉద్యోగం | 15–00 |
| | 20 వివాహం సంతానం కోసమేనా? | 10–00 |
| | 21. వరకట్న విశ్లేషణ | 10–0 |
| | 22. స్త్రీల లైంగికత : లైంగిక స్వేచ్ఛ | 20– |
| | 23. అశ్లీలం; అసభ్యత | 15– |
| నవలలు | 24. వంశాంకురం | 20–00 |
| | 25. ప్రేమ+సెక్స్=నీతి | 17–00 |
| | 26. వెలిగిన జ్యోతి | 12–00 |
| | 27. కాంతి కిరణాలు | 12–00 |
| | 28. చీకటి వెలుగులు | 10–00 |
| | 29. ఈ దేశం నాదేనా? | 5–00 |
| కథలు | 30. మాతృత్వానికి మరోముడి | 20–00 |
| ప్రణాళిక | 31. స్త్రీ విముక్తి | 6–00 |
| | 32. **Atrocities on Women** | 30–00 |
| | 33. **Saga of Women's Struggle** | 10–00 |
| | 34. **Women's Liberation** | 10–00 |

# శిక్షణా కేంద్ర సాహిత్యం

| | |
|---|---|
| 1. స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా? | 2-00 |
| 2. మానవ హక్కులు; మహిళల హక్కులు | 2-00 |
| 3. స్త్రీల హోదా ; వివక్ష | 2-00 |
| 4. వరకట్న మరణాలు : శిక్షలు | 2-00 |
| 5. స్త్రీలపై అత్యాచారాలు | 3-00 |
| 6. మతం ; మూఢ విశ్వాసాలు | 3-00 |
| 7. మత సమాజాలు ; మహిళలు | 1-00 |
| 8. మత ధర్మశాసనాలు ; మహిళలు | 3-00 |
| 9. కుల సంకెళ్ళు | 2-00 |
| 10. వివాహ వ్యవస్థ | 2-00 |
| 11. ఆడది : వంటపని, ఇంటిచాకిరి | 2-00 |
| 12. ఇల్లాలి ఇంటిపేరు ఎందుకు మారాలి? | 2-00 |
| 13. ప్రేమ వివాహాలు సఫలత చెందాలంటే | 3-00 |
| 14. సామాజిక పరిణామం | 2-00 |
| 15. జాతీయ సమైక్యత | 3-00 |
| 16. హేతువాదం | 1-50 |
| 17. హ్యూమనిజం : స్త్రీ విమోచన | 1-50 |
| 18. స్త్రీ విముక్తి నూతన సిద్ధాంతం | 3-00 |
| 19. కామన్ సివిల్ కోడ్ : స్త్రీలు | 2-00 |
| 20. సెక్సు అపోహలు | 2-00 |
| 21. సాహిత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ | 2-00 |
| 22. మహిళా దశాబ్దం ; సాధించిన విజయాలు | 2-00 |
| 23. ప్రపంచ స్త్రీల స్థితిగతులు : పోరాటాలు | 2-00 |
| 24. మహిళోద్యమ చరిత్ర ; అభివృద్ధి | 2-00 |
| 25. మహిళాభ్యుదయానికి మహిళా పత్రికలు | 2-00 |
| 26. వివాహం ; దాంపత్య జీవితం | 2-00 |
| 27. ప్రజాస్వామ్య వ్యవస్థ : స్త్రీలు | 2-00 |
| 28. మాతృత్వం ; శిశుపోషణ ; కుటుంబ నియంత్రణ | 2-00 |
| 29. ప్రజోద్యమాలు ; మహిళోద్యమాలు | 2-00 |
| 30. ఫెమినిజం అవసరమా? | 2-00 |
| 31. లైంగిక విప్లవం | 3-00 |
| 32. స్త్రీ స్వేచ్ఛ : యుటోపియా | 2-00 |
| 33. సమానతా నువ్వెక్కడ? | 4-00 |
| 34. అతివలపై అఘాయిత్యాలు, స్వచ్ఛంద సంస్థల ప్రతిఘటనలు | 3-00 |
| 35. మహిళా జాగృతి ; చైతన్యం | 3-00 |
| 36. మూఢనమ్మకాలు నశించేదెలా ? | 3-00 |

# వైవాహిక కుటుంబ సలహా



రచన

మల్లాది సుబ్బమ్మ

ఎం. వి. రామమూర్తి

ఎం. రాధారమణయ్య



కుటుంబ సలహా కేంద్రం

(మహిళాభ్యుదయ సంస్థ విభాగం)

9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం

హైదరాబాద్ – 500 028

# వైవాహిక కుటుంబ సలహా

**కుటుంబ సలహా కేంద్రపు ప్రచురణ సంఖ్య - 1**

ప్రతులు : 1000
మలి ముద్రణ : ఆగష్టు 1990



ప్రచురణ కర్త :
**కుటుంబ సలహా కేంద్రం**
C/o మహిళాభ్యుదయ సంస్థ
9, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ,
**హైదరాబాద్–28**

**వెల : రు.. 5-00**

ప్రతులకు :
**కుటుంబ సలహా కేంద్రం**
C/o మహిళాభ్యుదయ సంస్థ
9, ఎం. ఐ. జి. హెచ్. మెహిదీపట్నం
హైదరాబాద్ – 28

ముద్రణ :
**సౌజన్య ఆర్ట్ ప్రింటర్స్**
**గాంధీనగర్, విజయవాడ**

# వైవాహిక కుటుంబ సలహా



రచన


మల్లాది సుబ్బమ్మ

ఎం. వి. రామమూర్తి

ఎం. రాధారమణయ్య





కుటుంబ సలహా కేంద్రం

(మహిళాభ్యుదయ సంస్థ విభాగం)

8, ఎం. ఐ. జి. హెచ్. కాలనీ, మెహిదీపట్నం

హైదరాబాద్ - 500 028

# విషయ సూచిక

## వైవాహిక కుటుంబ సలహా

పుట

# వైవాహిక, కుటుంబ సలహా ఎవరికి? ఎందుకు?

— మల్లాది సుబ్బమ్మ

భారతదేశంలో స్త్రీల స్థితి శోచనీయంగా ఉంది. కొన్ని ప్రాంతాలలో వారిని ప్రాణమున్న వస్తువులుగా చూస్తున్నారు. మరికొన్ని సమాజాలలో వారిని ద్వితీయ శ్రేణి పౌరులుగా పరిగణిస్తున్నారు. వారికి పురుషులతోపాటు సమానస్థాయి గౌరవం లభించటం లేదు. వారు అనేక ఇబ్బందులను ఎదుర్కొంటున్నారు. అనేక కష్ట నష్టాలకు గురి అవుతున్నారు. వారి ఇక్కట్లు ఒక రంగానికి పరిమితం కావటం లేదు. సామాజిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, కౌటుంబిక రంగాలన్నింటా వారు వివక్షకు, స్వేచ్ఛాలేమికి లోనవుతున్నారు. వారికి కలిగే బాధను తొలగించాలని సామాజిక సంస్కర్తలు, స్వచ్ఛంద సంస్థలవారు ప్రభుత్వాలు వైవాహిక సలహా కేంద్రాలను, కుటుంబ సలహా కేంద్రాలను నెలకొల్పి వీలయినంత సాయం చేయడం జరుగుతున్నది.

ఏ ఏ సందర్భాలలో సలహా దొరుకుతుంది?

**కౌటుంబికం ;** ఆడపిల్ల జీవితానికి పెళ్ళి ముఖ్యలక్ష్యంగా, ఆదర్శంగా రూపొందింది. ఆమెకువివాహం గమ్యం. పిల్లపుట్టినదిమొదలు ఆమె వివాహప్రసక్తి ఉదయిస్తుంది. మగపిల్లవానికి చదువు, ఉద్యోగం ముఖ్య విషయాలట. ఆమెకు మాత్రం పెండ్లి తప్పనిసరి అట. పెండ్లిమాటతో ఆమె కష్టాలు మొదలుకావు. పుట్టుకతోనే ప్రారంభమవుతున్నాయి. బాలురను బాలికలను పెంచే తీరులోనే తేడా ఉంటున్నది. పని, పెంపకం, పోషణ, పరిగణన ఇట్లా అన్నింటిలోనూ వివక్ష చోటు చేసుకుంటున్నది.

**పెళ్ళి :** ఆడపిల్లకు పెళ్ళి ఒక సింహస్వప్నం. భర్తతో కాపురాన్ని గురించి కాదు ఆ విషయాన్ని గురించి ఆమె తీయని కలలు కంటుంది. పెండ్లి కావడం ఎలా? పిల్ల అందచందాలు, చదువు, సంస్కారం, కుటుంబ సంప్రదాయం, గుణగణాలు ఇవి లెక్కలోకి వచ్చే రోజులు గతించాయి. వరకట్నం ఇస్తేగాని, లాంఛనాలు ఇవ్వటానికి అంగీకరిస్తేగాని పెళ్ళికి అంగీకరించరు మగపిల్లవాని తల్లిదండ్రులు. పెళ్ళి అనగానే కొండ ఎక్కి కూర్చుంటాడు వరుడు. తనకు పెళ్ళి అక్కరలేదన్నట్లు, పెళ్లాడటానికి అంగీకరించి తనేదో ఎవరినో ఉద్ధరించినట్లు మాట్లాడతాడు. ఆపిల్లను యావజ్జీవం పోషించటానికి అతనికి ప్రోత్సాహక చర్యగా వరకట్నం

ఇవ్వాలట. నిజానికి అది జీవితాంతం ఆ పనికి సరిపోతుందా ? చాలదు. వ
ఎందుకు అడుగుతున్నారు ? తాత్కాలికంగా అతనికి ఖర్చు తగ్గించటానికే
అదీకాదు. ఎందుకంటే అవసరం కన్నా ఎక్కువ తీసుకుంటున్నాడు కదా. అదే
కాదు. మగవాడు ఆడదానికన్న అధికుడు అనే భావానికి నిదర్శనమా? ఈ మాట
చాలావరకు సత్యం ఉన్నది. దీనిని నిరూపించుకోవటానికి వరకట్నం పెద్ద ఎత్తు
అడగటం, శక్తిలేకపోయినా ఇవ్వటం జరుగుతున్నది.

**లాంచనాలు, బహుమతులు :**

మర్యాద సూచకంగా ఇష్టపూర్వకంగా ఇచ్చి పుచ్చుకునే బహుమతు
శుభంగా జరిగే వివాహంలో ప్రముఖ పాత్ర వహించి వాతావరణాన్ని కలుషితము
దుఃఖభాజనమూ చేసే స్థితికి వచ్చాయి. ఇపుడు మగపిల్లల తల్లిదండ్రుల స్వార్థ
పేక్షకు చిహ్నాలయినాయి. మగపిల్లవాని పెళ్ళంటే లాభసాటి వ్యాపారమయ్యింది
అబ్బాయి పెళ్ళిద్వారా వచ్చిన డబ్బు, పెళ్ళిలో చేసిన అదాయం తమ కుమా
వివాహానికి వాడే ఉద్దేశ్యంతో ఆడపిల్ల తల్లిదండ్రులవద్ద గుంజడం జరుగుతున్న
తమ పెళ్ళికి కావలసిన ధనాన్ని తన సోదరులు వరకట్నం ద్వారా సంపాదిం
పెటాలని కుటుంబంలోని ఆడబిడ్డలు తహతహ లాడటం కన్పిస్తుంది. దాంతో పె
ి ఆ అమ్మాయి కాపురానికి వచ్చేటప్పటికే ఆడబిడ్డకు ఆమెకు విరోధ భావా
గుతాయి. తన తల్లిదండ్రులను బాధించి వరకట్నం పేరుతో డబ్బు గుంజి
త్తగారిమీద, దోహదం చేసిన ఆడబిడ్డమీద, లాంఛనాల పేరుతో తన తండ్రి
బికారిని చేసిన భర్త సోదరి మీద ద్వేషభావంతో ఆమె అత్తింట అడుగు పెట్టుంది
అత్తాకోడళ్ళమధ్య, ఆడబిడ్డ, వదిన,మరదళ్ళ మధ్యరుసరుసలు, ఈసడింపులు, వై
ధ్యాలు కార్పణ్యాలు,ద్వేషాసూయలు వెల్లివిరుస్తాయి.దాంతో భార్యాభర్తలమధ్య క
తలు, చీకాకులు, అభిప్రాయభేదాలు, కొట్లాటలు తప్పనిసరిగా వస్తాయి. మెయిల్
బండిలాగా త్వరత్వరగా ఇంటికి రావలసిన భర్త గూడ్సు బండిలాగ ఆఫీసునుండి
కర్మాగారం నుండి కాళ్ళీడ్చుకుంటూ వస్తాడు. గుమ్మం దగ్గర తల్లి భార్యమీ
చెప్పవలసిన సాడీలన్నీ జాబితాగా ఏకరువు పెడుతుంది. గదిలోకి పోతే భార్య
దండకం ఎత్తుకుంటుంది. అందులో ఆమె తప్పేమున్నది. గంపెడంత బలగాన్ని
పుట్టింట విడిచి ఒక్కతే అత్తింటికి కాపురానికి వచ్చిన ఆమెకు భర్త ఒక్కడే రక్ష
కుడు? దిక్కు. స్నేహితుడు. ఆ మాటకు వస్తే సర్వస్వమూను. కనుక తన గోడ
అతనికి వినిపిస్తుంది. బాధలోఉన్న వ్యక్తికి ఉచితానుచితాలు తోచవు. ఆ రోజంత
తనుపడ్డ బాధ, అత్తా ఆడబిడ్డల ఆరళ్ళ వల్ల తనకు కలిగిన మనోవ్యధ

ఒక్కసారిగా పెల్లుబుకుతుంది. భర్తకు అశాంతి కలుగుతుంది. ఆమెపై విసుక్కుంటాడు. ఆమె మనోవ్యథకు అంతుండదు. విశ్రాంతికని అతడు బైటికి వెళ్తాడు. క్లబ్బులకు పోవటం, చీట్లపేక ఆడటం, త్రాగటం, వృథాగా కాలాన్ని దుర్వ్యయం చేసుకుంటూ తన దేహాన్నిమనస్సును పాడుచేసుకోవటం సంభవిస్తున్నది.

ఇంట్లో విధవాడపడుచు ఉంటే ఆమె సంసార సుఖానికి నోచుకోలేదు కనుక ఆమె కోడలిపై అసూయ పెంచుకుంటుంది. ఆమె పైన లేనిపోని సాడీలు చెప్తుంది, నిందలు వేస్తుంది. తన తల్లిచేత, సోదరునిచేత ఆమెను తిట్టిస్తుంది. ఇదీ ఆమె వరస భర్తను వదిలిపెట్టి పుట్టింటికి చేరిన ఆడబిడ్డ కూడా ఇలాగే ప్రవర్తిస్తుంది. దాంతో ఇంటికోడలు పరిస్థితి కుడితిలోపడ్డ ఎలుకలా ఉంటుంది.

కొన్ని సందర్భాలలో భార్యకు సర్దిచెప్పలేక, తన తల్లిని శాసించలేక, ఆడబిడ్డ ఆగడాలను ఆపలేక అతడు అయోమయావస్థలో పడి తన సుఖాన్ని ఇతర్రతా వెదుకనారంభిస్తాడు. సాని కొంపలకు యాత్రలు సాగిస్తాడు. కబుర్లకోసం మిత్రుల పంచన చేరతాడు. దుర్వ్యసనాలకు లోనవుతాడు. దుబారా ఖర్చులకు పూనుకుంటాడు. అశాంతి అతనిని వెన్నాడుతుంది. కొన్ని సందర్భాలలో వయసు మళ్ళిపోయినా ఇంకా వివాహం కాని యువతి తటస్థిస్తుంది. సర్వసాధారణంగా ఆమె సంపాదనపరురాలు, ఒంటరి అయి ఉంటుంది. ఆమె కుటుంబ పోషణ చేస్తున్నందున ఆమె ఇష్టారాజ్యం సాగుతుంది. ఆమెను అడ్డుపెట్టేవారు ఉండరు. ఆమె ఇతనిని చేరదీస్తుంది. ఓదారుస్తుంది, సేదదీరుస్తుంది, మనశ్శాంతిని ప్రసాదిస్తుంది. కృతజ్ఞతా సూచకంగా అతడు ఆమెకు సన్నిహితుడవుతాడు. అలా అతనికి మరో స్త్రీతో సంబంధం ఏర్పడుతుంది. ఇల్లాలిని నిరాకరిస్తాడు. చివరకు వదిలేస్తాడు. ఆ పరిస్థితిలో అత్త ఆడబిడ్డలు విజృంభిస్తారు. కోడలును చంపివేస్తే అతనికి మరో పెళ్ళి చేయవచ్చని ఆశిస్తారు. మరికొంత పైకం కట్నంగా వస్తుంది, ఆడబిడ్డకు లాంఛనాలు వస్తాయి, అత్తకు గౌరవ మర్యాదలు వస్తురూపంగా జరుగుతాయి. ఈ ఆలోచనలతో కోడలుపిల్లను కిరసనాయిలు పోసి సజీవంగా తగలేస్తున్నారు. కొన్ని కేసులలో భర్త సంపూర్ణంగా సహకరించటం కూడా కద్దు. వరకట్న మరణాలు పెచ్చు పెరుగుతున్నాయి.

ఇలా చెపితే చాలమందికి బాధ కలుగుతుంది. అన్ని కుటుంబాలలో ఇలా జరగటంలేదు, ఏవో కొద్దిసంఖ్యలో ఉన్న కుటుంబాలను పేర్కొని సర్వసాధారణంగా ఇలా జరుగుతున్నదని ప్రచారం చేయటం ద్రోహం, అన్యాయం, అక్రమం

అని కొందరు కులీన స్త్రీలూ పురుషులూ ఘోషించటం కద్దు. నిజమే అన్ని కుటుంబాలలో ఇలాగే జరగదు. కుటుంబానికి కుటుంబానికి తేడాలుంటాయి. వరకట్నం తీసుకోనని కుటుంబాలు బహుస్వల్పం. కట్నం తీసుకోకపోయినా లాంఛనాలను ఆశించని కుటుంబాలు బహుఅరుదు. బేరసారపు పద్ధతిలో వీటిని గురించి ప్రస్తావించి స్వీకరించే కుటుంబాలు అత్యధిక సంఖ్యలో ఉంటున్నాయి. దీంతో మొదలవుతుంది పైన చెప్పిన కథ. రూపం మారవచ్చు, వైరుధ్య స్వభావం ఒక్కటే.

ఎంతో సంస్కారం ఉన్న కుటుంబాలలో కూడా అత్తా కోడళ్ళ మధ్య తగాదా తలెత్తుతుంది. కారణాలు అనేకం. అందులో ఏదో ఒకటి చాలు. వారిద్దరి మధ్య పచ్చగడ్డివేస్తే భగ్గుమనటానికి. కొడుకు ప్రేమ తనపైన తగ్గిపోయిందని అత్తకు బాధ. తనకు ఆ ఆంట్లో మరెవ్వరున్నారని కోడలు అనుకొని భర్త అనురాగమంతా తనకే దక్కాలని కోడలు ప్రయత్నం. ఇందులో ఎవరి తప్పూ లేదు. పరిస్థితి ప్రభావం అంతే. అత్తాకోడళ్ళిద్దరూ మానసికబాధకు లోనవుతారు. మరో అంశం కూడా ప్రాధాన్యత వహిస్తుంది. కుటుంబానికి తను యజమానురాలు కనుక తన మాట నెగ్గాలని అత్తభావం. నేను ఇంత కట్నం తెచ్చాను, ఇంత డబ్బు పెట్టి మొగుడ్ని కొనుక్కున్నాను, అత్తగారి ఆజ్ఞలను పాలించటానికి నేను దాసీ దానిని కాదు...అని కోడలు యోచన. ఇద్దరూ చెరో రకపు మనస్తత్వంతో సంచరించ నారంభిస్తారు. అధికారం కోసం, పెత్తనం కోసం పోరాటం ప్రారంభమవుతుంది. ఇలా ఎన్నో కుటుంబాలలో ఈ తగాదాలు చూడవచ్చును.

ఇదంతా వింటే స్త్రీలు సంకుచిత మనస్కులని, కుటుంబంలోని స్త్రీలవల్లనే ఈ తగాదాలు వస్తున్నాయని, స్త్రీ బుద్ధి ప్రళయాంతకం అని స్త్రీలే స్త్రీలకు శత్రువులని పురుషులు త్వరపడి నిర్ణయాలు చేసి దులుపుకోవడం చూస్తున్నాం. అజ్ఞానంలో వున్న స్త్రీలు ఆమోదించడం జరుగుతున్నది. ఈ సమాజాన్ని శాసిస్తున్నదెవరు? ఈ సమాజంలో నీతిసూత్రాలను, ధర్మ ప్రవచనాలను వల్లిస్తున్నదెవరు? గృహ యజమానులెవ్వరు? మతాలను నెలకొల్పిందెవరు? ఎవరు కుటుంబాలలో ఆర్థిక వ్యవహారాలను అజమాయిషీ చేస్తున్నారు? ఎవరు అధికారాలను చలాయిస్తున్నారు? తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోవటానికి తమ భార్యలను పావులుగా వాడుకుంటున్నది ఎవరు? శాసనాలు చేసేది, న్యాయస్థానాల ద్వారా, ప్రభుత్వ యంత్రాంగం ద్వారా రక్షకభటులద్వారా అమలు పరచేది ఎవరు? పురుషులే. అలాంటపుడు కుటుంబాలను జైళ్ళగా మార్చి, అందులో అత్తలను

ఖైదీ వార్డెన్‌లుగా తయారుచేసి కోడళ్ళపై కూతుళ్ళపై నిఘా వేయించేది పురుషులు కాక మరెవ్వరు? తమ చర్యలకు తాము బాధ్యత వహించక తప్పంతా అత్తమీద త్రోసే మామలను ఏమనాలి? తన ఇష్టం లేకుండా కట్నం తీసుకోవడం జరిగిందా? తనకు అక్కరలేక పోతే తన భార్య కట్నం అడగగలదా? అమాయకులయిన స్త్రీలను మభ్యపెట్టి, మోసగించి వారిచేత అవ్యక్తపు పనులు చేయించి, చేస్తుంటే చూస్తూ ఊరుకొని చివరకు తను పెద్దమనిషిగా పోజుపెట్టే మామను ఏమనాలి? ప్రధాన దోషి అతడు. మరోరకంగా ఆలోచిస్తే అతడు సమాజ ప్రభావానికి లోనయిన వ్యక్తి. అతడూ సంప్రదాయానికి, సమాజానికి బానిసే కావచ్చును. కాని దోషానికి బాధ్యతను నిర్ణయించవలసి వచ్చినపుడు కుటుంబ యజమాని అయిన తన భార్యమీద నెపంవేసి తను తప్పించుకొని పోలేదని గ్రహించాలి.

**దుర్మార్గులయిన కోడళ్ళు :**

ఇలా అని అత్తమామలను బాధించే కోడళ్ళు లేరనికాదు. వారి సంఖ్య బహుస్వల్పం. ఇతర దేశాలలో ప్రతిదానికి గణాంక లెక్కలుంటాయి. అమెరికాలో చికాగో నగరంలో ఏటా ఒక లక్షమంది స్త్రీలను భర్తలు కొట్టారట. మన దేశంలో మనకు అలాంటి లెక్కలు లేవు. అదే పనిగా పెట్టుకొన్న ప్రభుత్వ శాఖలు లేవు. అందుచేత ప్రతివ్యక్తి తన పరిమితమైన అనుభవాన్ని పురస్కరించుకొని సిద్ధాంతీకరించడం ఆరంభిస్తాడు. ఒకటిలేక రెండుశాతంవున్న కోడళ్ళు దౌష్ట్యం ప్రదర్శించే కేసులు తీసుకొని సమాజం యావత్తు వారితో నిండిపోయిందనే వాదున్నారు.

**కీలక ప్రశ్న :**

కుటుంబాలలో కోడళ్లు చనిపోతున్నారు లేక చంపబడుతున్నారు. అత్తలు చంపబడటంలేదే. కొడుకులు మామలు భద్రంగా క్షేమంగా ఉన్నారే. ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పి తరువాత సమస్యను గురించి విశ్లేషణకు దిగడం న్యాయం.

ఇంతవరకు సమష్టి కుటుంబాలలో కోడళ్ళపై జరిగే అత్యాచారాలను గురించి వ్రాయడం జరిగింది. ఇక భార్యా భర్త విడిగా ఉన్నపుడు వారి మధ్య వస్తున్న తగాదాలు, కొట్లాటలు వీటిని గురించి కూడా మనం చర్చించాల్సిఉంటుంది.

పూర్వంలాగా కాకుండా ఇపుడు వివాహాలు వధూవరులకు బాగా వయస్సు వచ్చిన తరువాత జరుగుతున్నాయి. అప్పటికి ఇరువురికి అలవాట్లు, అభిరుచులు అభిప్రాయాలు గట్టిపడుతున్నాయి. దాంతో ఇద్దరిమధ్య సర్దుకునే స్వభావం నశి ఇరువురు మామాటే నెగ్గాలని తాపత్రయ పడతారు. ఈ పరిస్థితి సంఘర్షణకు

తీస్తుంది. అంతేగాక భార్యాభర్తలు తమ పుట్టిళ్ళను వదలి వచ్చినా ఆ వాసనలు పోవు. భర్త అస్తమానమూ భార్యను తన తల్లితో పోల్చి ఆమెను నిందిస్తాడు. భార్య తన భర్తను తన తండ్రితో పోల్చుకుని అతనిని తప్పుపట్టడం సాగిస్తుంది. ఇలా కలతలు పెచ్చుపెరుగుతాయి. భర్త పురుషాధిక్య సమాజపు విలువలను తనువిగా చేసుకొని భార్యపై పెత్తనం సాగిస్తాడు. ఆమె నిరసిస్తుంది. అలాగే తగాదాలు వస్తాయి. పెళ్ళి కాగానే ఇరువురు అన్యోన్యంగా ఉంటారని అనుకోవడం పొరపాటు. అనురాగంతో కలసి మెలసి ఉండటానికి ఇరువురూ కృషి చేయాలి. అది యాంత్రికంగా జరిగే పనికాదు. ప్రేమించడం, ప్రేమింపబడటం ఒక కళ. దానిని అభ్యసించాలి. ఆమె కాపురానికి వచ్చిన కొత్తలో వారిద్దరి మధ్య కామం పెచ్చు పెరుగుతుంది. దాని ఉధృతం తగ్గిన తరువాత మోహం ప్రవేశిస్తుంది. ఇది ఇరువురి మధ్య ప్రేమగా మారడానికి ఎంతో యత్నం అవసరం. ఈ యత్నం చేయడానికి ఇరువురికి సహనం, ఓపిక, పట్టుదల కావాలి. ఇరువురికి ఈ గుణాలు ఉండటం కష్టం. దాంతో చిర్రుబుర్రుమంటూ పోట్లాడుకుంటారు. భార్యాభర్తల మధ్య ఉండవలసిన నమ్మకం, పరస్పర విశ్వాసం సన్నగిల్లుతాయి. అపుడు పురుషుడు మరొక స్త్రీ సాంగత్యాన్ని అభిలషించటం జరుగుతుంది. సాధారణంగా ఇటువంటి విషయాలలో స్త్రీ తొందర పడదు. సమాజపు కట్టుబాట్లు ఆమెను హద్దు దాటనివ్వవు. పురుషుడికి ఆ భయంలేదు. అతడు స్వైర విహారం సాగిస్తాడు.

కొంతమంది పురుషులకు మానసిక జాడ్యాలు ఉంటాయి, అస్తమానమూ భార్యను అవమానించటం, నసపెట్టటం సాగిస్తుంటారు. కొంతమంది తమ భార్యలను హింసించి ఆమె బాధపడుతుంటే సంతోషిస్తుంటారు. కొంతమందిలో స్వార్థపరత్వం పరాకాష్టకు చేరుతుంది. భార్యాపిల్లలు ఆకలితో నకనకలాడుతున్నా, తను వారి యెదుట సుష్టుగా తిని త్రాగుతుంటారు. వచ్చిన ఆదాయాన్నంతా త్రాగుడు జూదంలాంటి వ్యసనాలకు ఖర్చుపెడతారు. భార్యలు పనిపాటలు చేసుకొని కాస్తో కూస్తో సంపాదించుకుని గుట్టుగా గౌరవంగా ఇల్లు గడుపుకుంటూ కాలం వెళ్ళబుస్తుంటే భర్తలు తమ వ్యసనాలకు పైకం కావాలని భార్యల పైకాన్ని బలవంతాన లాక్కుపోతున్నారు. ఈ దుర్భర పరిస్థితిని సహించలేకపోతున్నారు. కాపురాలు దెబ్బతింటున్నాయి.

## కుటుంబాలలో స్త్రీల బాధలకు కారకులెవ్వరు?

భర్తల ప్రవర్తన,అత్త ఆడబిడ్డలఆరళ్ళు, మామల ఉదాసీనతనుగూరించివివరణ వచ్చింది. మరొక అంశాన్ని ప్రస్తావించాలి. కూతురు తనఅత్తగారింట తన యెద

జరుగుతున్న అత్యాచారాలను, అన్యాయాలను, అక్రమాలను తల్లిదండ్రులకు చెప్పుకుని తన అత్తగారి ఇంట్లో కాపురం చేయలేనని, తన జీవితానికే ప్రమాదమని ఘోషించినా చెవిన పెట్టక "నీకు అత్తిల్లే శరణ్యం. నీవు భర్తను విడిచి పుట్టింటికి వస్తే మా పరువు పోతుంది" అని చెప్పి తిరిగి అత్తగారింటికి నెట్టి ఆమెను వారు చావుదెబ్బలు కొట్టినా పట్టించుకోక చివరకు వారు చంపితే భోరున ఏడ్చే తల్లిదండ్రులది తప్పు కాదా? పెళ్ళి కాగానే తమ బాధ్యత అయిపోయినదని తలచే ఆడపిల్ల మాతాపితలది తప్పుకాదా? "భర్త దుష్టుడయినా, దుర్మార్గుడయినా, నీచుడయినా, పతితుడయినా అతనితోడిదే నీ జీవితమని" ఆడపిల్లకు చిన్నప్పటినుండి పాఠాలు నూరిపోసి సాగనంపే తల్లితండ్రులది కాదా? వారి నడతను నిర్దేశించే పురుషాధిక్య సమాజపు నీతిది కాదా?

**కుటుంబంలో వచ్చే సమస్యలు**

1. భార్యలపై హింస; కొట్టటం
2. భార్యను వదిలివేయటం; లేక పోషించక పోవటం
3. భార్యను వేధించటం; ఆమెయెడ దుర్మార్గంగా ప్రవర్తించటం
4. భర్త మరోస్త్రీతో సంబంధం పెట్టుకోవడం; మరో స్త్రీని వివాహమాడటం
5. స్త్రీని కుటుంబసభ్యులు అయిన పురుషులు మానభంగం చేయటం
6. భార్యకాని భర్తకాని త్రాగుడు, మాదక ద్రవ్యాల వాడకంలాంటి దురలవాట్లకు లోను అవటం
7. భార్యాభర్తలు వేరుగా ఉండాల్సి వచ్చినపుడు పిల్లల పోషణ, సంరక్షణ బాధ్యత
8. భార్యాభర్తలు ఒక ఇంట్లోనే ఉంటున్నా ఇద్దరి మధ్య కలతలు, సర్దుకు జీవించలేక పోవటం
9. మానసిక రుగ్మతలు
10. కట్నం ఇవ్వలేక ఆడపిల్లలకు, ఓలి ఇవ్వలేక పురుషులకు పెళ్ళికాక పోవటం
11. వరకట్నాన్ని బహుమతులను అడిగినా భార్యకు తిరిగి ఇవ్వక పోవడం
12. భర్త నిరాదరణకు గురి అయి అతనిచేత ఇంటినుండి గెంటివేయబడిన స్త్రీకి ఆశ్రయం, రక్షణ లేకపోవటం
13. స్త్రీ పురుషుల దాంపత్య జీవితంలో అజ్ఞానంవల్ల, దురంహకారం వల్ల వచ్చే ఒడిదుడుకులు. ఇలా ఎంతెన్నో ।

**హెూమాటీకం**

స్త్రీని కేవలం సంతానాన్ని కనటానికి సాధనంగా పరిగణించే సమాజంలో, సెక్సు సింబల్‌గా మాత్రమే గుర్తించే సమాజంలో స్త్రీలను గౌరవించడం జరుగదు. సంస్కారంలేని పురుషులు, పురుష దురహంకార సమాజపు అలవాట్లను, ఆలోచనలను, కుసంస్కారాన్ని పుణికి పుచ్చుకున్న యువకులు, మధ్యవయస్కులు, వృద్ధులు స్త్రీలను చిన్నచూపు చూడటం, వారిని లైంగికంగా వేధించటం (Sexual harassment) విచిత్రం కాదు. పని ప్రదేశాలలో, ఆఫీసులలో, పొలాలలో యజమానులుగాను, వారి తాబేదార్లుగా ఉంటున్న కొందరు పురుషులు అలా దుష్ప్రవర్తనకు పూనుకోవడం సంభవిస్తున్నది. స్త్రీల సమ్మతిలేకుండా వారి దేహాలను తాకడం, వారిని గురించి బూతుకూతలు కూయడం, వారికి చీకాకు కల్గించే మాటలు విసరడం, వారిని న్యూనత పరిచే విధంగా పాటలు పాడటం, వారిని ఉద్దేశించి ఈలలు వేయటం, వారిని పట్టి పీడించటం, వారి పొందును కోరడం, అందుకు సమ్మతించమని వారిని బెదిరించడం, చివరకు వారిపై అత్యాచారాలు చేయడం, మానభంగం చేయడం సమాజంలో తరచుగా జరుగుతున్నాయి. స్త్రీలను వేధించే యువకులను కొద్దిపాటి జరిమానాతో శిక్షించే కోర్టులు ఈ దుర్మార్గాన్ని పరోక్షంగా పోషిస్తున్నాయి. ఈ మధ్య రోడ్లప్రక్క "పేవుమెంట్లమీద, బస్సు స్టాపుల" వద్ద, కాలేజీ ఆవరణల ముందు ఇలా విద్యార్థినులను, యువతులను వేధించే (Eve Teasing) యువకుల సంఖ్య పెరుగుతున్నది. ఇది శోచనీయం. దీనిని అరికట్టటం పౌరుల బాధ్యత. స్త్రీలపట్ల వేధింపు, లైంగిక వేధింపు సామాజిక సమస్యలుగా రూపొందుతున్నాయి.

**శాసనపరమైన చిక్కులు**

మన దేశంలో ధర్మశాస్త్రాలు మతానుసారంగా ఉన్నాయి. హిందువులకు ముసల్మానులకు, క్రైస్తవులకు, పార్శీలకు ఇలా వేరువేరుగా ధర్మశాస్త్రాలు అమలులో ఉన్నాయి. కొన్ని మతాల శాసనాలు స్త్రీల శ్రేయస్సుకూ, స్త్రీల హోదాకు, వ్యక్తిత్వానికి వ్యతిరేకంగా ఉన్నాయి. బహు భార్యాత్వాన్ని అంగీకరించి, తమ సంతానపు రక్షణ బాధ్యతను స్త్రీలకు నిరాకరించి, పురుషులకు విశేషాధికారాలను ప్రసాదిస్తుంది ఇస్లాం ధర్మశాస్త్రం. అలాగే విడాకులు పొందటాన్ని విపరీతంగా కష్టతరం చేసింది క్రైస్తవమత ధర్మశాసనం. ఇవి మచ్చుతునకలు మాత్రమే. ఎన్నో మంచి మార్పులకు లోనయిన హైందవ ధర్మశాస్త్రంకూడ సరిగా లేదు. మనస్సులు కలవని కారణాన విడాకులు పొందే సౌకర్యం లేదు. అంతేకాదు కారణం చెప్పకుండా

వివాహ రథం కుంటుపడిందనే అంశాన్ని రుజువు చేస్తే విడాకులు పొందే మార్గం లేదు. భార్యలూ, విడాకులివ్వబడిన స్త్రీలు తమ భర్తల వద్ద నుండి లేక తమ మాజీ భర్తలనుండి మనోవర్తిని క్రిమినల్ కోర్టులో పొందే సౌకర్యం ఇటీవల వరకూ సర్వులకూ – అన్ని మతాల వారికీ ఉంది. ఇటీవల విడాకులు పొందిన ముస్లిం స్త్రీలకు ఆ హక్కు నిరాకరింపబడింది.

ఒక పురుషుడు పరాయి స్త్రీని మానభంగం చేస్తే 10 సంవత్సరాల జైలుశిక్ష కోర్టుద్వారా వేయపడిన భార్యపై – విడాకులు పొందకుండా – అత్యాచారం చేస్తే 2 సంవత్సరాలు జైలుశిక్ష. ఇంట్లో తనతోపాటు కాపురం చేస్తున్న భార్యను మానభంగం చేస్తే ఏ శిక్షాలేదు. అది నేరం కాదు.

భర్త మరొక స్త్రీతో లైంగిక సంబంధం పెట్టుకుంటే ఆ స్త్రీమీద భార్య నేరారోపణ చేయటానికి వీలులేదు. ఒక స్త్రీ పరాయి పురుషునితో వ్యభిచరిస్తే ఆమె భర్త ఆ పరపురుషునిపై క్రిమినలు కేసుపెట్టి అతనిని 3 సంవత్సరాల జైలుశిక్షకు పాత్రుణ్ణి చేయగలడు. ఇలాంటి సందర్భాలలో ఇరువురిని సమంగా నేరస్తులను చేసి కేసులు పెట్టమనటం లేదు. వారిరువురు నిందార్హులే అని గుర్తు చేస్తున్నాం. నిరసిస్తున్నాం నింద్యము వేరు, నేరం వేరు.

అన్యాయమైన శాసనాలవల్ల స్త్రీలకు కలిగే చిక్కులనుండి వారిని బయట పడవేయవలసి ఉంది. రెండు రకాలుగా అది జరగాలి. 1) శాసనాల మార్పు ప్రయత్నాలు 2) శాసనాల అమలులో స్త్రీలకు న్యాయస్థానాలలో సహాయం.

**ఆర్థికపరమైన బాధలు**

నిరుద్యోగం సమాజాన్ని వెంటాడుతున్నది. స్త్రీల విషయంగా కొన్ని వృత్తులలో స్త్రీలకు ప్రవేశం ఉండటంలేదు. తాపీమేస్త్రీలుగా, పంపులను పెట్టేవారుగా వడ్రంగులుగా, విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని అమర్చేవారుగా స్త్రీలులేరు. మోటారు సైకిళ్ళు, కార్లు బాగుచేసేవారుగా లేరు. ఇలా ఎన్నో వృత్తులను పేర్కొనవచ్చును.

పురుషుల వేతనాలలో, స్త్రీల వేతనాలలో తేడా వుంది. ఒకే పనిచేసే స్త్రీ పురుషులకు కట్టుబడి పరిశ్రమలో వేతనాలు వేరు వేరుగా వుంటున్నాయి.

**సాంస్కృతికం :**

స్త్రీలను గురించిన ఆలోచనలు పాతకాలపువి. అవి మార్పుకు లోనుకావాలి. వాటిని పురుషులు ప్రచారం చేసినంతకాలం స్త్రీలు ఆమోదించినంతకాలం స్త్రీలకు బాధలు తప్పవు. మచ్చుకు కొన్నింటిని ఉదహరిద్దాం.

1. నీవు ఇల్లాలుగా ఉండాలి
2. నేను కోరినప్పుడు నీవు తల్లివి కావాలి.
3. నీకేమీ తెలియదు
4. నేనే నీకు యజమానిని

5. నేను నీకన్నా అధికుడ్ని (ఎంత అప్రయోజకుడయిన పురుషుడయినా తన ప్రయోజకురాలయిన భార్యకన్నా గొప్పవాడన్నమాట)
6. నీ సంపాదన,నీ ఆదాయం,నీ సంపద అన్నింటిపైన నాదే సర్వాధికారం
7. నీ తను ధన మనః ప్రాణాలపై నాది ఆధిపత్యం

ఈ మాటలవల్ల, ఈ భావాల ప్రభావం పొందిన భర్తల ప్రవర్తనవల్ల స్త్రీలు మానసిక వ్యథ మాత్రమేకాక కష్టనష్టాలపాలు అవుతున్నారు. వారి వ్యక్తిత్వాలు చిదిమి వేయబడుతున్నాయి.

**సలహా కావలసిన స్త్రీలు ఏం చెయ్యాలి ?**

ఎవరికి వారు తమ బాధలను మననం చేసుకొంటూ ఊరికే కుమిలిపోవటము విజ్ఞుల లక్షణం కాదు. పరిస్థితిని తనకు అనుకూలంగా మార్చుకోవటంలోనే మనిషి ప్రజ్ఞ ఉంది. ఒక్కరైకు ఏమీ ఆలోచన పాలుపోవనప్పుడు ఆమె ఇతరులను సలహా అడగాలి. పూర్వం అనుభజ్ఞులయిన పెద్దలుండేవారు. ఇపుడు సామాజికశాస్త్రజ్ఞులూ మానసిక శాస్త్రజ్ఞులూ, వైద్యశాస్త్ర ప్రవీణులూ, న్యాయశాస్త్ర పారంగతులూ, సంఘసేవా శాస్త్రాన్ని అధ్యయనం చేసినవారూ ఉన్నారు. సలహాలందివ్వటానికి తగు సహాయం చెయ్యటానికి అనేక స్వచ్ఛంద సంస్థలూ, వైవాహిక, కుటుంబ సలహా కేంద్రాలు ఉన్నాయి. వీటిని ఇబ్బందులలో ఉన్న స్త్రీలు సంప్రదించి సహాయ సహకారాలు పొందాలి.

**కేంద్రాలు ఏం చేస్తాయి?**

భార్యాభర్తల కలతలు, తగాదాలు వస్తే ఇరువురిని పిలిపించి వారి మధ్య రాజీ చేసి సఖ్యత నెలకొల్పుతాయి. వారిద్దరూ విడిపడాల్సి వస్తే ఆ సంబంధమైన ్పాట్లను సూచిస్తాయి. వైద్య సలహాను, సహాయాన్ని అందిస్తాయి. న్యాయపర ర సహాయం పొందటానికి మరో సంస్థవద్దకు పంపుతాయి. పోలీసుల సహాయం ం పంపుతాయి. ఆశ్రయం కోసం శరణాలయాలలో చేరుస్తాయి. వరకట్నం సం జరిగే వేధింపును విరోధిస్తాయి. వరకట్నాన్ని, సొమ్మును తిరిగి ఇప్పించ టానికి ప్రయత్నిస్తాయి. ఉద్యోగావకాశాలకు సూచనలను ఇస్తాయి. కట్నరహిత వివాహాల సందర్భంగా సలహా సహాయాలు అందిస్తాయి.

**చివరిమాట ;**

స్వరాజ్యం రాకముందు స్త్రీల స్థితివేరు. ఈనాటి స్థితి వేరు. స్త్రీలకు సహా యము చేయాలనే తపన స్వచ్ఛంద సంస్థలకు, ప్రభుత్వాలకూ కలిగింది. అందుకు ూయ సిద్ధంగా ఉన్నారు. కాకపోతే మనం ఆశించినంతగా సహాయ సహకారాలు ందకపోవచ్చు. ఏదయినా స్త్రీలు తమ జీవితాలపై రోత చెంది మరణాలకుప ్పడక అవివేకం. చచ్చి సాధించేదేమీ లేదు. చావకూడదు, ఇతరులచేత చం ాదదు. ఇలా కృతనిశ్చయులయిన స్త్రీలను—బాధలకు వ్యథలకు గురిఅయిన ను—ఆదుకోవటం జాగృత, చైతన్యం కల స్త్రీల విధి, సమాజపు బాధ్యత.

# వాహిక, కుటుంబ సలహా
# ప్రయోజనాలు - ఉపయోగాలు

**ఎం. వి. రామమూర్తి**

సలహా కేంద్రాలను గురించి కొందరికి విడ్డూరమయిన భావాలు
వ్యం ఇలాంటి కేంద్రాలు ఉన్నాయా, సలహా చెప్పటానికి స్వచ్ఛంద
యా, అయినా సలహా చెప్పటమే వృత్తిగా పెట్టుకున్నవారున్నారా
వీణ్యత సంపాదించడానికి ప్రత్యేకంగా పాఠ్యప్రణాళికలు, కళా
హా, ఇవన్నీ లేకపోయినా జీవితాలు అందులో దాంపత్య జీవితాలు
లేదా అని ప్రశ్నిస్తున్నారు. ఆలోచించగల ప్రతివ్యక్తికి ప్రశ్నలు
అది సహజం. ఆ ఫలితమే ఈ రకపు ప్రశ్నలు. ఈ ప్రశ్నల
లోచనా ధోరణిని అర్థం చేసుకోవడం కష్టంకాదు. పూర్వం
వాస్తవమే. పూర్వము భార్యాభర్తలమధ్య ఒకరకపు శాంతి ఉన్న
దానిని కొందరు అవహేళనగా స్మశానశాంతి అనవచ్చు. ఏదయినా
చేయాలి. పూర్వం బహు చిన్నవయస్సులో బాలికలకు వివాహాలు
నలు రాని ఈడులో వారికి పెళ్ళిళ్లు జరిగేవి. భర్త చెప్పినట్టు విన
రికలనే తన కోరికలుగా భావించుకోవాలని, అతని మాట ఆజ్ఞ
శ్ని ఊసు రాకముందునుండి బాలికలకు బోధించేవారు. తల్లిదండ్రు
ఆదేశాలుగా స్వీకరించేది. ఇద్దరు వ్యక్తులలో ఒకరు త
ంపుకొని రెండవవారికి ఛాయగా మాత్రమే జీవయాత్ర సాగించ
టే తగాదా ఎలా వస్తుంది? కనుక శాంతి నెలకొని వుంటుంది
గే.

పరిస్థితి వేరు. 1. బాగా వయస్సు వచ్చిన తరువాత బాలికలకు
న్నాయి. 2. అప్పటికి బాలికలకు ఊహలు, ఆశలు, ఆశయాలు
. వారికి ఇష్టాయిష్టాలు గట్టిపడతాయి. 4. కొన్ని జీవిత విధానాలు
తాయి. అలాగే యువకునికికూడా. కనుక వివాహమాడేనాటికి వారి
పొందుతాయి. ఇలాంటి పరిస్థితిలో వారిద్దరిమధ్య సామరస్యయుత
గాలంటే ఎన్నోస్థితిగతులు ఒనగూడాలి.
పై ఒకరికి గౌరవము. రెండవవారి గుణగణాలపై, శక్తిసామర్థ్యాల
వం.

2. ఇరువురు ఒకరినొకరు ప్రేమించాలి, ప్రేమ అంటే ఏమిటో ఇరువురికి అవగతం కావాలి.

3. ఒకరు మరియొకరి మంచితనాన్నేగాక బలహీనతలను కూడా ప్రేమించ గలగాలి, అంటే సహించగలగాలి. అంటే ఇరువురికి సహనం, ఓర్పు సర్దుకుపోయే మనస్తత్వమూ ఉండాలి.

4. ఒకరు మరియొకరిని తమ సొత్తుగా భావించి యజమానిగా భావించరాదు.

ఇంకా ఎన్నో అంశాలున్నా ముఖ్యమయిన వాటిని పొందుపరచటం జరిగింది.

**దాంపత్య జీవితంలో ఒడుదుడుకులు :**

మొదట్లో అభిమానించుకొని, ప్రేమించి పెళ్ళాడిన భార్యాభర్తల మధ్య కూడా తగాదాలు తలెత్తడం చూస్తున్నాం. అలా కాక పెద్దలు, బంధువులు కుదిర్చిన వివాహాలలో కూడా కలతలు వస్తున్నాయి. ఈ కలతలను సకాలంలో త్రుంచి వేయకపోతే అవి పెరిగి పెద్దవయి వారిరువురిమధ్య పెద్ద అగాధాన్ని సృష్టించ గలవు. ఏకముగమూ పెడముఖంగా ఉండటమో, వేరుగా జీవించడమో చివరకు విడాకులకు దారితీయడమో జరుగుతుంది.

**ఈ పరిస్థితిని నిరోధించడమెలా?**

మున్ముందు కలతలను నిర్మూలించటం. అది చెప్పినంత తేలికగా జరిగే కాదు. కలతలు ఎందుకు వచ్చాయో, ఎందుకు వస్తున్నాయో తెలుసుకోగలిగితే ని అది సాధ్యంకాదు. పైన ఉటంకించిన సూత్రాలకు భిన్నంగా దంపతులలో ఎవరు ప్రవర్తించినా అలాంటి శోచనీయ పరిస్థితి ఉత్పన్న మవుతుంది. ఎవరి పొరపాట్లను వారు గుర్తించగలగటం చాల కష్ట సాధ్యం. సహజంగా దంపతులు ఎవరి బందుగులను వారు ముఖ్యంగా తల్లిదండ్రులను, అక్కచెల్లెళ్ళను, అన్నదమ్ములను మేనమామ మేనత్త లను సంప్రదిస్తారు. వీరందరు చేరి సామూహికంగాకాని, విడివిడిగాగాని దంపతులమధ్య జరిగిన తగాదాలను అభిప్రాయ బేధాలను చర్చకు తెస్తారు. ఈ చర్చలో ఈ బంధువుల ఆలోచనా విధానాలు, వ్యక్తిత్వాలు, అహంకారాలు పనిచేయనారంభిస్తాయి. దాంతో సమస్య మరీ క్లిష్టమవుతుంది. పరిష్కార మార్గం కనుపించదు. దంపతులమధ్య అంతకు మునుపులేని అంశాలు వారి సంబంధాలలో జొరబడుతాయి అవే ఈర్ష్యాద్వేషాలు. దాంతో దంపతుల మధ్య తగాదాలికి చిలికి గాలివాన అవుతుంది. ఇరువురికి జీవితంలో నిరాశా నిస్పృహలు ఏర్పడయి. అయితే ఈ పురుషాధిక్యత గల సమాజంలో స్త్రీ బేల అవుతుంది, జీవితం

మీద విసుగు, అసహ్యం పెంచుకుంటుంది. జీవితాన్ని ఎలా చాలిద్దామా యని మార్గాలు, అవకాశాలు అన్వేషణ చేస్తుంది. అందుకని యత్నాలు సాగిస్తుంది.

**నిర్భాగ్యజీవితం గడిపే స్త్రీకి సలహాకేంద్రం ఏమి చేయలుగుతుంది?**

ఇందాక చెప్పాము కదా కొందరు స్త్రీలు జీవితంపై రోసిపోతారు అని, అలాంటివారు సలహాకేంద్రానికి వస్తే వారికి ఏమి ఒనగూడుతుంది అనేది ప్రశ్న. సాధారణంగా అలాంటివారిలో వందకి పదిమంది మాత్రమే కేంద్రానికి వస్తారు. రాగానే సలహాదారు ఆమె బాధామయ చరిత్ర అంతా ఓపికగా, సహనంతో, సాను భూతితో వినటం తటస్థిస్తుంది. ఇంకా ప్రపంచంలో ఇంత సానుభూతి చూపే వాళ్ళున్నారాయని వచ్చిన ఆమె విస్తుపోతుంది. సలహాదారు సరాసరి కేసులోకి పోకుండా, ప్రశ్నలు అడగకుండా జీవితంయొక్క విలువను గురించి, విశిష్టతను గురించి ముచ్చటిస్తుంది. ఈ మాటలు బాధితురాలయిన ఆ స్త్రీకి ఊరట కలిగించ టమే కాక జీవితంపై ఆశలు రేకెత్తిస్తుంది. సమయం చూసి సలహాదారు ఆ స్త్రీ చేత "ప్రాణ త్యాగం చెయ్యను" అని వాగ్దానం చేయించుకుంటుంది. తరువాత మరొక సారి రమ్మని ఆమెను కోరుతుంది, ఆమె అంగీకరిస్తుంది. ఇది సలహాదారుకు ప్రథమ విజయం క్రింద లెక్క. ఎందుకంటే ఎంతో వ్యథతో కేంద్రానికి వచ్చిన స్త్రీ బ్రతుకుమీది తీపితో తిరిగి వెళుతుంది. ఇలా ఒక ఆత్మహత్య తప్పిపోతుంది. ఇది సలహాకోసం వచ్చిన స్త్రీకి; సమాజానికి ఇరువురికీ లాభం.

జీవితంమీద రోత ఏర్పరచుకొని, జీవితం చాలిద్దామనుకునే స్థితికి ఇంకా రాని స్త్రీ కూడా సలహాకేంద్రానికి రావడం కద్దు. అలాంటి ఆమెకు ఏమి ప్రయో జనం సిద్ధిస్తుంది అనేది ప్రశ్నగా ఉదయించవచ్చును. సలహాదారు ప్రత్యేకతను గురించి ఈ సందర్భంలో కొంత వివరించడం అవసరం. సలహాదారుకు సామాన్య ముగా ఈ లక్షణాలు ఉంటాయి.

1. ప్రపంచజ్ఞానం
2. దాంపత్య సంబంధాల వెలుగు నీడల పరిజ్ఞానం
3. మానవ విలువలపై గౌరవం, అభిమానం
4. స్త్రీ పురుష సంబంధంగా సెక్సుజ్ఞానం
5. మానసిక శాస్త్ర పరిచయం
6. సామాజిక శాస్త్ర పరిచయం
7. దాంపత్య సంబంధాలపై ప్రభావం చూపే వ్యాధులు, వాటి

క్షయాలు, నివారణోపాయాలు ఇలా వీటిని గురించిన వైద్యశాస్త్ర పాండిత్యం

8. తోటి మానవులపై, ముఖ్యంగా చెప్పాలంటే పీడిత తాడిత జనావళిపై స్పష్టంగా చెప్పాలంటే...స్త్రీజాతిపై సానుభూతి కరుణ

9. ఆవేశకావేషాలకు వీలయినంతవరకు అతీతంగా వుండటం.

10. నిష్పక్షపాత దృష్టి

ఒకే సలహాదారులో ఈలక్షణాలుఅన్నీ లేకపోవచ్చును. అప్పుడుఅనేకమంది సలహాదారులుఅవశ్యకం కావచ్చును. కాని ప్రతి సలహాదారుకు 1,2,3,8,9,!0 లక్షణాలు ఉండాలి. సామాజిక, మానసిక, వైద్య, లైంగిక శాస్త్రాల పరిజ్ఞానం ఒక్క వ్యక్తికే ఉండకపోవచ్చును. అపుడు నలుగురు సలహాదారులు కేసును పరిశీలించి తగుసలహాను ఇవ్వగలరు.

ఈ సలహావల్ల సలహాకోసం వచ్చిన వ్యక్తికి విషయం తెలుస్తుంది. దాని విస్తరణ ఎలా వుంటుంది? పరిశీలిస్తే ఈ అంశాలు వెలుగులోకి వస్తాయి.

1. తగాదాలో తన పాత్ర విశ్లేషణ

2. తన తప్పులు ఒప్పులు తెలుస్తాయి. దీనినే ఆత్మ సాక్షాత్కారమన్నా తప్పులేదు.

3. తన జీవిత భాగస్వామికిగల సుగుణాల జాబితా

4. తన భర్త లేక భార్యయొక్క దుర్గుణాలు, లోపాలు, బలహీనతలు వీటి పట్టిక.

5. తగాదాలకు ఎవరు ఎంతవరను కారణభూతులు?

6. తగాదాలను పరిసమాప్తం చేయగల సామర్థ్యత ఇరువురికి ఉన్నదా? లేక ఏ ఒక్కరికయినా వున్నదా? ఎవరికి?

7. వైవాహిక సంబంధాన్ని లేక దాంపత్య సంబంధాన్ని కొనసాగించాలనే భావం ఇరువురిలో గట్టిగా ఉందా? ఉంటే ఏమేరకు?

8. దంపతులకు సెక్సు జ్ఞానం లేమి వారి జీవితాలను ఇబ్బందుల పాలు చేసిందా?

9. దంపతులు ఇరువురుగాని, లేక అందులో ఒకరుగాని ఏదైన మానసిక బలహీనతకు, వగ్మతులకు, బలవత్తర భావాలకు, అసంకల్పిత విధి నిషేధ స్వభావాలకు లోనవుతున్నారా?

10. దంపతుల జీవిత విధానాలలో ఏమైన మార్పులు అవసరమా?
11. ఇద్దరికీగాని, లేక ఒక్కరికి గాని వైద్య సహాయం అవసరమా?
12. దాంపత్య సంబంధాన్ని మెరుగు పర్చుకునే కృషి చేయటానికి అవశ్యకమైన ఓపిక, ఓర్మి, సహనం, పట్టుదల ఇరువురికి కొంతగాను, ఒక్కరి మరింత ఎక్కువగాను ఉన్నదా?

పై చెప్పిన విషయ గ్రహణం దంపతులు తమంత తాముగా చేయలేదు- నిష్పక్షపాతంగా, వస్తునిష్టతో సమస్యను పరిశీలించి సలహా యివ్వగల వ్యక్తి, లేక వ్యక్తుల జోక్యం వల్లనే అది సాధ్యమవుతుంది.

**పరిష్కార మార్గాలు**

సమస్య విశ్లేషణ జరిగిన తరువాత, దంపతులకు లేక సలహాకోసం వచ్చిన ఒక వ్యక్తికి విషయం అవగాహన అయిన తర్వాత పరిస్థితిని బాగు చేయటానికి కృషి ప్రారంభించటం జరుగుతుంది. కృషికి ముందు పరిష్కార మార్గాలను ఎంపిక చేయటం తప్పనిసరి.

పరిష్కార మార్గాలు బాధిత వ్యక్తికి తోస్తాయి. లేక సలహాదాత చేత సూచింపబడ్తాయి. బాధిత వ్యక్తి లేక దంపతులు వాటిని అనుసరిస్తే వారి దాంపత్య సంబంధంలో ఆప్యాయత, అనురాగం, స్థిరత్వం, బద్ధత, నమ్మకం, విశ్వాస పునఃప్రవేశం చేస్తాయి.

వైద్యం చేయించుకుంటే పరిస్థితి బాగుపడవచ్చును. ఉదాహరణకు తమ సంతానం కలుగలేదనే బాధ దంపతులు ఇరువురికి లేక అందులో ఒకరికి మిక్కుటంగా ఉండవచుచ్చును. అందులో ఇరువురుగాని, ఒక్కరుగాని పరీక్ష చేయించుకుంటే ఒకరి సామర్థ్యంపై మరొకరికి అపనమ్మకం వీగిపోతుంది. కాకపోతే స్త్రీకి ఏదయినా ఆపరేషను వల్ల ప్రయోజనం సిద్ధించవచ్చును. పురుషునికి మధుమేహం లాంటి వ్యాధుల ఉధృతం నుండి విముక్తి కలుగవచ్చును. లేక సుఖవ్యాధులకు వైద్యం ద్వారా ఆరోగ్యాన్ని తిరిగి పొందవచ్చును. ఇలా ఎన్నో అవకాశాల స్ఫురిస్తాయి; లాభం చేకూరుస్తాయి.

సెక్సు జ్ఞానంలేక అమాయకతవల్ల ఇరువురుగాని, అందులో ఒక ఇబ్బందులకు గురి అవుతుంటే ఆ పరిజ్ఞానం ఉన్న సెక్సు సలహాదారు ప్రకారం సంచరిస్తే ఆ ఇబ్బందులు తొలగిపోతాయి. దంపతులు సుఖమై రాన్ని చేయగల్గుతారు

సామాజిక సంబంధమైన చిక్కులు కొన్ని ఉంటాయి. సమిష్టి కుటుంబం వల్ల వచ్చే తగాదాలు దీని క్రిందకు వస్తాయి. అత్తాకోడళ్ళ తగాదాలు, ఆడబిడ్డల ఆరళ్ళు, తోడికోడళ్ళ మధ్య కలతలు, మామగారి నిరంకుశత్వం, ఇవి కుటుంబ వాతావరణాన్ని కలుషితం చేస్తాయి. వీటి ఉధృతాన్ని భరించలేని భార్య భర్తతో మొరపెట్టుకుంటే దానిని "నస"గా భర్త పరిగణించడం కద్దు. మొదట్లో భార్య ఫిర్యాదులను పెడచెవిన పెట్టిన భర్త, విసుగు పెంచుకొని ఆమెనే నిందించ ప్రారంభిస్తాడు. దాంతో భార్యా భర్తల మధ్యసదవగాహన లోపిస్తుంది.

ఒకరికి మరొకరికిపై నిర్లక్ష్యభావం పెరుగుతుంది. ప్రేమ సన్నగిల్లనారంభిస్తుంది. ఈ స్థితికి పరిష్కారమార్గం లేకపోలేదు. వేరువేరుగా కాపురాలు పెట్టుకోవడం. ఇది కష్టదాయకం కావచ్చు. ధనరూపంగా నష్టదాయకం కావచ్చు. అయినా గత్యంతరం లేదు. లేక ఆస్తి విషయికమైన తగాదా అయితే ఆస్తుల పంపిణీ లేక అత్తమామలు, భార్యాభర్తలు వేరువేరు పట్టణాలలో గ్రామాల్లో కాపురం ఇలా ఎన్నో మార్గాలు.

కొందరు పిల్లను అత్తవారింటికి పంపి అస్తమానమూ భార్యాభర్తల విషయాలలో విపరీతంగా జోక్యం కలుగచేసుకుంటారు. వారు వండుకునే కూరలు, చూచే సినిమాలు, వేసుకునే దుస్తులు, వెచ్చించవలసిన పైకం, ఆదా చేసే మార్గాలు అన్నింటిమీద వీరే అజమాయిషీ చేయ ప్రయత్నిస్తారు. దాంతో అల్లునికి అత్తమామలపై ద్వేషం పుడుతుంది. వారింటికి "నేను రాను" అంటాడు. అది భార్య మనోవ్యథకు కారణమవుతుంది. ఇది వారి మధ్య కొట్లాటకు దారి తీస్తుంది. తమ సంబంధాలను తాము సరిచేసుకోవటానికి భార్యాభర్తలకు అవకాశం ఇవ్వాలి. పిల్ల తల్లిదండ్రులు జోక్యాన్ని నిషేధించటం ద్వారా పరిస్థితిని మెరుగుపరచవచ్చు. అలాగే కొన్ని సందర్భాలలో భార్యాభర్తలు విడిగా కాపురముంటున్నా పిల్లవాడి తల్లిదండ్రుల జోక్యం విపరీత స్థాయిలో ఉంటుంది. అది కోడలును బాధిస్తుంది. తన ఇంటికి తానే యజమానురాలుగా ఉండాలని ఆమె అభిలషిస్తుంది. ఆ ఆశ నిరాశ అవుతుంటే ఆమె సహించలేదు. వారి జోక్యం ఆపించమని భర్తను ప్రోత్సహిస్తుంది. అతడు అంగీకరించడు లేక పట్టించుకోడు. తద్వారా భార్యకు చికాకు, కోపం పెరిగి నరాల బలహీనత ఏర్పడుతుంది. భార్యాభర్తల సంబంధాలు కలుషితమవుతాయి. ఇక్కడ పిల్లవాని తల్లిదండ్రుల జోక్యాన్ని నిరసించి, లేకుండా చేయవలసి ఉంటుంది. 80సం॥ వచ్చి కాపురం చేస్తున్న యువతీ యువకులను వాళ్ళ

తల్లిదండ్రులు వారిని బాలబాలికలవలె పరిగణించి వారికి ఇంకా అనుక్షణం విద్యా బుద్ధులు నేర్పాలని ప్రయత్నించటం అవ్యక్తపు పని.

ఇన్ని కారణాలవల్ల అంటే సామాజిక, వైద్య విషయిక లైంగిక అజ్ఞాన సంబంధంగా వచ్చిన ఇబ్బందులను తేలికగా తొలగించవచ్చును. కాని మానసిక శాస్త్ర సంబంధమైన రుగ్మతలు, అసంకల్పిత చర్యలు, బలవంతపు భావాలు, అసహజ వాంఛలు దంపతులలో ఇరువురికిగాని ఏ ఒక్కరికిగాని ఉంటే వీటిని వది లించటం చాల కష్టం. దంపతులు ఇరువురు, కేసునుబట్టి ఏ ఒకరో ప్రత్యేక కృషి చేస్తే కాని సాధ్యం కాదు. అంతేగాక కొన్ని సందర్భాలలో మానసిక వైద్యునిచేత వ్యాధినివారణ చేయించవలసి ఉంటుంది. శరీరంలో ఏ అవయవానికైనా జబ్బుచేస్తే నయం చేయించుకుంటారు. మెదడుకు ఘాత కలిగితే, మనస్సుకు వికారం సంభ విస్తే జాడ్యాన్ని చెప్పుకోవటానికైనా వెనుతీస్తారు. దానిని పిచ్చి అంటారేమోనని భయం. "పిచ్చి" అనేది ఒక రకం కాదు. 140 రకాల మానసిక జాడ్యాలు ఉన్నాయి. చాలావరకు వైద్యంవల్ల నయమవుతాయి. ఈ సంబంధంగా సిగ్గుపడ వలసినదేది లేదు. జీవిత భాగస్వామి సహకారం ఉంటే మానసిక రుగ్మతలు చాల వరకు నయం చేయవచ్చును.

కొన్ని మానసిక వైఖరులు దంపతులలో తిష్టవేసుకుంటాయి. వాటిని గుర్తిం చడం ఒక ఎత్తు. విడనాడటం మరొక ఎత్తు. భార్యాభర్తల సంబంధాన్ని కలుషితం చేసే అంశాలలో ఒకటి వారిలో ఒకరికిగాని ఇరువురికిగాని తమ తల్లిదండ్రుల యెడ వైఖరి. భార్య తన తండ్రిని అభిమానిస్తుంది, మెచ్చుకుంటుంది. గౌరవిస్తుం వ్యక్తిని పోలిన మరోవ్యక్తి ఉండడు కదా। ఆమె తన భర్తను తన తండ్రి పోల్చుకొని తన భర్తను తక్కువవానిగా అంచనా వేసుకుంటుంది. అతడు ఏమి చేసినా తప్పు పట్టుంది. అలాగే భర్తకూడా. చిన్నప్పుడు తనకు విద్యాబుద్ధులు నేర్పించిన తల్లిమీద అవసరమైతే శిక్షించిన తల్లిమీద ఆ కుటుంబంలోని భర్త ఎన లేని అభిమానాన్ని, భయభక్తులను పెంచుకుంటాడు. తన భార్య ఏ పని చేసినా దానిని తన తల్లి చర్యతో పోలుస్తాడు. భార్య తన తల్లితో తూగలేదని నిర్ణయించు కుంటాడు. ఆమెను నిందిస్తాడు, అపహాస్యం చేస్తాడు, చివరకు అవమానిస్తాడు.

అలా ఇరువురూ తమ జీవితాలను దుఃఖభాజనం చేసుకుంటారు. వయస్సు వచ్చినా తమ చిన్ననాటి అనుభవాల జ్ఞాపకాల మూటను నెత్తిన వేసుకొని మోస్తూ తత్ఫలితంగా అసంతృప్తికి లోనవుతూ ఒకరిపై నొకరు విసుక్కుంటూ, మాటల విసురుకుంటూ, తిట్టుకుంటూ చివరకు కొట్లాటకు దిగుతున్నారు. ఈ బాధన

ద్వారా బయటపడాలంటే సలహాదారు సహాయంతో తమ లోపాలను గుర్తెరిగి వాటిని అధిగమించాలి. ఈ క్రమంలో సలహాదారు విశేష ప్రాధాన్యతగల పాత్రను నిర్వహించగలడు లేక నిర్వహించగలదు.

## దాంపత్య జీవిత సంబంధాల ఎరుక

వివాహం కాగానే దాంపత్య జీవితం దానంతటదే సుగమమవుతుందని సాధారణంగా చాలామంది భావిస్తారు. ఇది నిజం కాదు. వివాహం కాగానే భార్యాభర్తలకు ఒక వ్యక్తిత్వం ఏర్పడదు. అంతకు క్రితం వారిరువురు ఇద్దరు వ్యక్తులు. వారిరువురికి వేరువేరు మనస్సు ఉంటున్నది. "ఇద్దరికి ఒకేమాట, ఒకే బాట" కావాలనడం అన్యాయం. అది అసహజం, అక్రమం. అయితే ప్రేమ అనేది వారిరువురి మనస్సులను బంధించే సూత్రం. ఈ అంశాన్ని గమనించి వారిరువురు తమ సంబంధం సామరస్యపూర్వకమయ్యేలా కృషి చెయ్యాలి. నిరంతర కృషివల్ల ప్రేమ వృద్ధి అవుతుంది. జీవితం సుఖమయం అవుతుంది. ఈ అంశాన్ని సరియైన సలహాదారు ఎరుక పరచటం సంభవిస్తుంది.

దాంపత్య సంబంధాలలో ముఖ్యమయినది దంపతీ వ్యవస్థమీద దంపతులకు కల అంకిత భావం. భార్యాభర్తలలో ఒకరికి — సాధారణంగా పురుషులకు— ఏక పత్నీత్వ ఏకపతిత్వ వ్యవస్థపై అంకితభావం లేకపోతే వారి సంబంధాలను కలుషితం చేసే మూడో వ్యక్తి ప్రవేశించడం జరుగుతుంది. పురుషులు వ్యభిచార సంబంధంలోకి దిగటం, భార్యను వేధించటం, తిట్టటం, కొట్టటం, బాధించటం జరుగుతుంది. అంతటితో ఆగక తన ప్రియురాలితో ఒకే ఇంటిలో కాపురం ఉండమని తన భార్యను బలవంతం చేయటం కూడా చూస్తున్నాం. ఇది ఎందుకు జరుగుతున్నది. కారణాలు ఇలా ఉంటాయి :—

1. ఇది పురుషాధిక్య సమాజం
2. ద్వంద్వనీతి చలామణీ అయ్యే సమాజం పురుషులకు ఒక నీతి, స్త్రీలకు మరో నీతి.
3. స్త్రీలు కూడా పురుషుని స్వైర విహారాన్ని, వ్యభిచారాన్ని నిందించి ఖండించని సామాజికస్థితి.
4. ఆధునికత, ప్రజాస్వామ్యం, స్వేచ్ఛ, సమానత్వం ఈ భావాలను గురించిన పరిజ్ఞానం ప్రజలకు లేకపోవటం.
5. అక్రమసంబంధాల వల్ల స్త్రీకి కలిగే నష్టంకన్నా పురుషునికి సంభవించే ఇబ్బంది బహు స్వల్పంగా ఉండటం

6. కేవలం ఇల్లాలుగా మాత్రమే బ్రతుకుతున్న భార్యకు బ్రతుకుతెరువు సాగకపోయినా వ్యభిచారి భర్తనువిడనాడితే పరువుపోతుందనే భావజాలం

భారతదేశపు కుటుంబాలలో, వెలిచవి మరిగిన పురుషుల సంఖ్య మింద గాడితో సంబంధం పెట్టుకున్న స్త్రీల సంఖ్య అత్యధికం. ఈ అంశంలో పురుషులే అవినీతిపరులు, నింద్యులు.

తను వ్యభిచరిస్తూ, చీకటి తప్పుచేసిన తన భార్యను నరికి పారేసే పురుషులున్నారు ఈ దేశంలో.

పురుషాధిక్య సమాజపు విలువలను విడనాడితేగాని ఈ పరిస్థితి అంతం కాదు. దంపతీ వ్యవస్థపై భార్యాభర్తలిరువురికి గౌరవం ఏర్పడదు. ఈ విలువలను గౌరవించమని ప్రబోధం చేయడం సలహాదారు కర్తవ్యం. అతని ప్రబోధం వలన బాధిత స్త్రీజాతిలో జాగృతి, చైతన్యం వెల్లివిరుస్తాయి.

## పురుషులలో మద్యపానం

కారణాంతరాలవల్ల మద్యపానాన్ని అలవాటు చేసుకున్న భర్తలు ఇళ్లు గుల్లచేస్తున్నారు. తమ ఒళ్ళు గుల్ల చేసుకుంటున్నారు. ఇంట్లో భార్య తిన్నా తినకపోయినా తనకు చియలింది సారా ఉండాలని పట్టుబట్టి సాగించుకునే భర్తల సంఖ్య పెరుగుతున్నది. అంతటితో ఊరుకోక పెళ్ళాలను క్రూరంగా కొట్టటం; దారుణంగా హింసించటం [illegible] ఇతర[illegible] ఏ దుర్గుణాలు లేకపోయినా ఈ ఒక్కటి చాలు దాంపత్య సంబంధాన్ని మలినం చేయటానికి. దీనికి పరిష్కార మార్గాలు లేవా? ఉన్నవి. ఆతడు [illegible] అనేక మార్గాలు వున్నవి- కొన్ని ఔషధాలు వాడితే [illegible] తుంది. కాదు [illegible] ప్రక్రియ సాగించే వైద్య సంస్థల [illegible] తుంది. అతనికి నచ్చచెప్పడం రెండవ పద్ధతి, గుండెకు దెబ్బ [illegible] మవుతుందనీ నిజం చెప్పి అతనిని భయపెట్టటం. అలాకాక [illegible] నిద్రలోకి (Hypnotise చేసి) పంపి అతనికి అసహ్యమైన [illegible] పోల్చి చెప్తే కనీసం ఏడాదివరకు అతడు మద్యపానం చేయడు. త్రాగ[illegible]ప్పుడు తనకు అసహ్యమని తోచే వస్తువు జ్ఞాపకం వచ్చి సారానీ[illegible] వేస్తాడు. ఇంతకూ అతడు సహకరిస్తేనే "హిప్నటిజం" సాధ్యం. ఈ విషయాలను ప్రజ్ఞకల సలహాదారు దంపతులకు తెలియజెప్పగలడు. అంతేకాదు అతని బంధువులచేత ఛీ అనిపించమని భార్యకు నచ్చచెప్పగలడు. [illegible]త్రాగి, తూలి, కాపు

రాన్ని బదాబదలు చేసుకునే వానిని సమాజం బహిష్కరించే స్థితి రావాలని సలహాదారు భార్యను హితబోధ చేస్తే ఆమె పూనిక వహించి ఆ కృషికి పూనుకోగలదు.

**సర్దుబాటు**

భార్యాభర్తల మధ్య తగాదా వస్తే భార్యను సర్దుకొని పొమ్మంటారు. స్త్రీ జీవితం సర్దుబాటుతో మొదలవుతుంది. సహనం ఆమె సొమ్మని అభినందించి ఆమెను బానిస స్థితికి తెచ్చింది సమాజం.

నిజానికి దాంపత్యంలో సర్దుబాటు మనస్తత్వం భార్యాభర్తలిద్దరికి అవసరం. ఈ సర్దుబాటు ఎలా జరగాలి అనే అంశాన్ని సలహాదారు వివరిస్తాడు.

**కలతలకు మామూలు కారణాలు**

1. కోపం
2. అసూయ
3. అవతల వ్యక్తిని అంటే జీవిత భాగస్వామిని స్వంతం చేసుకోవటం
4. మాటలద్వారా జీవిత భాగస్వామిని బాధించటం
5. చేతలద్వారా ఆమెను/అతనిని వేధించటం
6. మౌనం వహించటం
7. ప్రతి దానికీ వాదనకు దిగడం
8. జీవిత భాగస్వామి మీది కోపంతో తాను వేరే ఇతర కార్యక్రమాలలో మునిగితేలటం.

సలహా కేంద్రానికి వచ్చిన వ్యక్తి స్త్రీగాని, పురుషుడుగాని అన్ని విషయాలు వివరించి చెప్తే సలహాదారు తన ప్రత్యేక శాస్త్రజ్ఞానాన్ని, అనుభవాన్ని, ప్రపంచ జ్ఞానాన్ని వినియోగించి అసలు తగాదాకు కారణభూతమైన అంశాన్ని వెలికితీసి దంపతులకుగాని ఒకరికిగాని తెలియజేయటం జరుగుతుంది.

కోపం అనే అంశాన్ని తీసుకుందాం. కోపం మనిషియొక్క వైఖరికి లక్షణం అంతేకాని అది అసలు కారణంకాదు. కోపానికి లోను అయిన వ్యక్తి స్త్రీ అయినా పురుషుడయినా తన జీవిత భాగస్వామిపై గల భావంవల్ల అలా ప్రవర్తించటం ంభవిస్తుంది. అవి ఇలా ఉంటాయి.

1. ఆమె తన తల్లితో సరితూగదు / అతడు తన తండ్రితో సరితూగడు.
2. అతడు తనను న్యూనతగా చూస్తున్నాడు / ఆమె తనను చిన్న చూపు చూస్తున్నది.

3. అతడు | ఆమె తనను వ్యక్తిగా గుర్తించటంలేదు.

4. అతడు | ఆమె తనను లైంగికంగా తృప్తిపరచటం లేదు.

5. అతడు | ఆమె తనను వాడుకుంటున్నారు.

6. అతనిలో | ఆమెలో తను సహించలేని లోపాలున్నాయి.

ఇలా ఎన్నో కారణాలు, సలహాలవల్ల వీటిని గుర్తించటం, రూపు మాపటం తేలిక

**అసూయ**

కించిత్తు అసూయ ప్రేమకు చిహ్నం. అది విపరీతమయితే దుఃఖభాజనం.

**స్వంతం చేసుకోవటం**

భార్యాభర్తలు ఇరువురు వ్యక్తులు అని అన్నాం. వారికి సంబంధంలేని విషయాలలో ఇరువురికి కొంత స్వేచ్ఛ ఉండాలి. భారతదేశపు స్త్రీలకు స్వేచ్ఛ బహు స్వల్పం కనుక ఉదాహరణకు పురుషుని తీసుకుందాం. అతడు తన భార్యయెడ భర్తగా, తల్లిదండ్రులకు కుమారుడుగా, స్నేహితులకు స్నేహితుడుగా, క్రీడా సంఘంలో క్రీడాకారుడుగా, క్లబ్బులో మెంబరుగా, ఉద్యోగసంబంధమైన సంఘంలో సభ్యుడుగా, తన పిల్లలకు తండ్రిగా, తన మనుమలకు తాతగా, ఇలా ఎన్నో సంబంధాలలో జీవితం కొనసాగిస్తుంటాడు. ఒకరి సంబంధమే అన్ని సంబంధాలను శాసించాలంటే కుదరదు. అల్లాగే తన భర్త అన్ని విషయాలలోనూ తన మాటే వినాలంటే పొసగదు. అతనికి, తన సంబంధంలోని ఆప్యాయతలకు అనురాగానికి భంగం లేకుండా, ఇతర సంబంధాలలో కొన్ని బాధ్యతలు ఉండవచ్చును. వాటిని వదులుకోమని, లేక తన ఇష్టం వచ్చినట్లు వాటిని నిర్వర్తించమని అతని బలవంతం చేయటం అతనిని బానిసను చేయటం అవుతుంది. ప్రతి వ్యక్తికీ పరిమిత స్వేచ్ఛ అవసరం. తన స్వంతం అంటూ స్వేచ్ఛ (PRIVATE SPACE) ఉండాలి. ఈ అంశాన్ని గుర్తించరు చాలమంది భార్యలు. ప్రతిదానికి అతని నెత్తిన ఎక్కి శాసించ ప్రయత్నిస్తారు. అది మంచి పద్ధతి కాదు. దానిని పురుషుడు నిరసిస్తాడు. ఇదే పరిస్థితి సంభవిస్తే స్త్రీ పురుషుని వైఖరిని నిరసిస్తుంది. అంటే దాంపత్యంలో ఒకరు మరియొకరిని పూర్తిగా స్వంతం చేసుకోవటం సాధ్యపడదు. సాధ్యమయినా మంచిది కాదు. వాంఛనీయం కాదు. పైగా ప్రమాదకరం. అలాచేస్తే ఆ దాంపత్యం ఎక్కువకాలం సాగదు. ఈ అంశాన్ని మనోశాస్త్ర విశ్లేషణ చేయగల సలహాదారు గుర్తించగలరు.

టివి? వాటి స్వభావమెట్టిది? ఏ స్థాయిలో అవి ప్రదర్శితమవుతున్నాయి? వాటిని నివారించగలమా? వాటి బలాన్ని నిరోధించగలమా? ఈ ప్రశ్నలకు సమాధానాల మీద ఆ దాంపత్యపు మనుగడ యొక్క స్థిరత్వం ఆధారపడుతుంది. మనిషిని మనిషి అనేక రకాలుగా దుర్మార్గంగా వాడుకోవచ్చును (Explotation). అది అనేక రంగాలలో ప్రదర్శితం కావచ్చును. సామాజిక, ఆర్థిక, రాజకీయ, కౌటుంబిక సాంస్కృతిక, తాత్విక రంగాలన్నీ ఆ దుష్టభావనకు కార్యక్షేత్రాలే. కుటుంబ రంగంలో ఈ మౌలిక సూత్రాన్ని వెలికి తీయగల సత్తా కుటుంబ సలహాదారుకు మాత్రమే ఉంది.

## దాంపత్య సంబంధాలను ఎలా బాగుచేసుకోవాలి?

దాంపత్య సంబంధాలు ఎలా చెడిపోకుండా జాగ్రత్తపడాలో, ఏ ఏ అంశాలను గుర్తించి వాటిని దాంపత్య సంబంధంలోకి చొరనీయకుండా ఏమి చేయాలో, ఎలా ప్రవర్తించాలో తెలియజెప్పిన తరువాత ప్రయోజనాత్మకంగా కుటుంబ బంధాన్ని ఎలా గట్టి చేసుకోవాలో వ్యక్తీకరించడం సలహాదారు కర్తవ్యం. దంపతులలో ఒకరు మరియొకరియెడ ఎలా సంచరించాలో ఎరుక పర్చటానికి సలహాదారు పూనుకోవటం ప్రముదావహం. ఆ కర్తవ్యబోధ ఇలా ఉంటుంది:-

1. జీవిత భాగస్వామి తనకు ఇష్టంలేకపోయినా నీకోసం ఏపని అయినా చేస్తే వెంటనే నీ కృతజ్ఞతను సంతోషాన్ని వెల్లడించు. అది అతని/ఆమె ప్రేమకు చిహ్నంగా పరిగణించాలి.(Appreciate)

2. జీవితభాగస్వామిని గురించి సంతోషంగా, గర్వంగా భావించు. అతడు/ఆమె నీకుగాను అంటే నీకొరకు చేసిన పనిని గుర్తించటంకాక అవతలివ్యక్తిని గుర్తించటం, అతడు/ఆమె చేసే పనితీరును ప్రశంసించటం(Admire)అన్నమాట.

3. నీవు చాల అందంగా వున్నావు. నీవు తెలివికలవాడివి, తెలివిగలదానివి. నీవు చాల సామర్థ్యంకల వ్యక్తివి. ఇలాంటి మాటలు జీవితభాగస్వామిని గురించి అనడం అతనిని పొగడటం(Praise) క్రింద లెక్క.

4. జీతతభాగస్వామి యెడ అనురాగం (Affection) ప్రదర్శించు. చేతల ద్వారా అభిమానాన్ని చూపటం మంచిది.

5. ప్రేమను తెలిపే మాటలను ఉచ్చరించటం (Loving Endearments). వీటివల్ల అనురాగబంధం రోజురోజుకూ స్థిరత్వం పొందుతుంది.

## స్త్రీలకు హెచ్చరిక

వైవాహిక సలహా మీద, కుటుంబసలహాను గురించి ఆంగ్లభాషలో విశేష సారస్వతం వుంది. అలాంటి పుస్తకాలు తెలుగు పాఠకులకు అందుబాటులో లేవు. పాశ్చాత్యదేశాల పరిస్థితులు వేరు, మనదేశ పరిస్థితులు వేరు. కొన్ని సామ్యాలు ఉంటాయి. కొన్ని ముఖ్యమైన తేడాలుంటాయి. ఏదయినా ఈ సలహా విధానాన్ని గురించి, దాంపత్య సంబంధాలను గురించి ఇతోధికంగా సారస్వతం తెలుగు భాషలోకి వచ్చేదాకా సలహాకేంద్రాలను ప్రజలు దర్శించక తప్పదు. అంతేకాదు. స్త్రీలలో అక్షరాస్యత 18శాతంగా ఉన్నపుడు పుస్తకాలు ఉండిమాత్రం ఏమి ఉపయోగం? పుస్తకాలు ఉన్నా, చదువరులు వున్నా ప్రతి ఒక్క కేసు ప్రత్యేకమయినదే. దేనికదే విశిష్టం. కనుక బాధితులు ముఖ్యంగా స్త్రీలు సలహాకేంద్రాలను దర్శించి, వారి సమస్యలను సలహాదార్లకు వివరంగా, స్పష్టంగా తెలియజెప్పి, వారు శాస్త్రీయ దృక్పథంతో, పాండిత్యంతో, ప్రజ్ఞతో, ప్రపంచజ్ఞానంతో యిచ్చే సలహాలను పాటించి, వాటిని అనుసరించి తద్వారా జీవితాలను సరిదిద్దుకోవటం, మెరుగు పర్చుకోవటం తప్పనిసరిగా జరగాల్సిన పని.

# వైవాహిక, కుటుంబ సలహా విధాన మార్గాలు

ఎం. రాధా రమణయ్య

వివిధ అత్యాచారాలకు గురి అయిన స్త్రీలు తమ బాధలను, వారు అనుభవించిన నైచ్యాన్ని ఏకరువు పెడుతుంటే మన చుట్టూ విషాదం, నైరాశ్యం అలముకుంటాయి. సమస్య బహుముఖం. సమస్యయొక్క బృహత్తర స్వభావం ఆ స్త్రీల బాధలను తగ్గించే ప్రయత్నాన్ని విరమింపచేయరాదు. తద్భిన్నంగా జాగృతి పొందిన స్త్రీలు స్వామి వివేకానంద వాక్యాలవల్ల ఉత్తేజితులు కావాలి. "జీవితం బహుస్వల్ప కాలవ్యవధి కలది. ప్రపంచంలోని వ్యామోహాలు అస్థిరమైనవి. ఇతరులకోసం జీవించేవారే జీవించియున్నట్లు లెక్క; తతిమ్మావారు బ్రతికివున్నా చనిపోయినట్లే ఎంచుకోవాలి." అలా ఉత్తేజం పొందిన ప్రతి మహిళ నెలకు ఒక్క మంచి పని అయినా చేయటానికి ప్రతిన పూనాలి; సమస్య తీవ్రతను తగ్గించటానికి సహాయపడాలి. ఒక్క మంచి పని లేక ఒక్క మంచి కార్యం వెయ్యి సదుద్దేశ్యాలకన్నా మెరుగయినది.

ప్రతిదినము ఉదయపు పత్రికలు స్త్రీలపై అత్యాచారాల వార్తలతో నిండి ఉంటాయి. వరకట్న మరణాలు, స్త్రీల హత్యలు, మహిళల ఆత్మహత్యలు, మానభంగాలు వీటిని గురించిన సమాచారం విపరీత పరిమాణంలో దర్శనమిస్తున్నది. మోసగింపబడి, నిరాదరణకు గురిచేయబడిన అవివాహితమాతల సమస్య ఆందోళనకరంగా ఉంది. వరకట్నంకోసం భార్యలను వేధించడం కొట్టడం సాగుతున్నది. కాగా ఆ వార్తలు బయటికి రావు; వాటిని గురించి ఎవరూ పట్టించుకోరు అనేక మంది స్త్రీల సమస్యలు ఒకే రకంగా కనబడినా వాటిని గురించి పరిష్కారమార్గాలను అన్వేషించేటప్పుడు 'కేసు'లలోని వైవిధ్యాలను తప్పక పరిగణలోకి తీసుకోవాలి. ప్రతి మనిషికి ఒక విశిష్ట వ్యక్తిత్వము ఉంటుంది. విలువలను గురించి ఒక అవగాహన ఉంటుంది. అతడు లేక ఆమె ఒక ప్రత్యేక మానవ సముదాయానికి చెంది ఉండటం సంభవిస్తుంది. ఇవన్నీ సమస్యను ఎదుర్కొనే వైఖరిపై ప్రభావం చూపిస్తాయి

ఈనాడు సమస్యలతో సతమతమవుతున్న యువతులకు, స్త్రీలకు ఈ దిగువ పేర్కొన్న సహాయాలను, సలహాలను అందించవచ్చును. వైవాహిక సలహా, కుటుంబ సలహా, ఉద్యోగినుల వసతి గృహాలు, తాత్కాలిక ఆశ్రయ స్థానాలు, న్యాయ సలహా కేంద్రాలు వగయిరాలు అలాంటివి. ఈ అత్యాచారాలను

నిరోధించే ప్రయత్నంలో భాగంగా అన్ని స్థాయిలలో 'వైవాహిక జీవిత ప్రబోధ కార్యక్రమాన్ని' ప్రవేశపెట్టవచ్చును. వైవాహిక కుటుంబ సలహా ఒక నూతన వృత్తిగా రూపొందుతున్నది. ఈ వృత్తి సమాజానికి ఏమి చేయగలుగుతుంది అనే అంశాన్ని గురించి ప్రజలలో ప్రబోధం చేయటం ప్రతి నూతన వృత్తికి తప్పని సరియైన పని. ఆ వృత్తి యొక్క సామాజిక పాత్ర ఏమిటి, దాని నైతికసూత్రాలేవి, దాని అనుసరించేవారి ప్రవర్తనా నియమావళి ఎలాంటిది, ఆ వృత్తిని చేపట్టేవారి అర్హతలు ఏమిటి? వీటన్నిటినీ గురించి స్పష్టమైన అవగాహన ప్రజలలో ఏర్పరచాలి.

ఈ సలహా కార్యక్రమంవల్ల ఆశించే ఫలితం ఎలాంటిది ? దేనిని ఆశించా లనే విషయం మీద పలువురికి పలు ఆలోచనలూ, అభిప్రాయాలూ ఉంటాయి. సలహాదారులుగా తయారు కాసున్నవారు, సలహా పొందడానికి వచ్చేవారు, తల్లి దండ్రులు, ఉపాధ్యాయులు, పాఠశాలా నిర్వాహకులు, ప్రభుత్వ సంస్థల అధికారులు ఇలా వీరందరికి సలహాలవల్ల వచ్చే ఫలితాన్ని గురించి వేరువేరు ఊహలు ఉంటాయి. సలహా ప్రయోగ సందర్భంగా ఇలాంటి ఆశయాలు ఉండడం సహజం.

సలహా విధానంయొక్క అంతిమ లక్ష్యాలను గురించిన ప్రకటనలు సామా న్యంగా ఉంటాయి; అస్పష్టంగా ఉంటాయి. అనేక భావాలు అంతర్భూతంగా ఉండటం కూడా తటస్థిస్తుంది. ఏదైనా ముఖ్యమయిన 5 లక్ష్యాలను పేర్కొనవచ్చు 1) ప్రవర్తనలో మార్పుకు దోహదంచేయటం. 2) సంబంధాలను ఏర్పరుచుకోవటం, వాని నిలబెట్టుకోవటం విషయంగా సలహాకోరే వ్యక్తి సామర్థ్యతను పెంచటం. 3) సమస్య పరిష్కార విషయంగా క్లయింటు (సలహాకోరే వ్యక్తి) యొక్క శక్తి సామర్థ్యాలను పెంచటం 4) క్లయింటు నిర్ణాయక శక్తిని పెంపొందించటం. 5) క్లయింటులో పరిస్థితులను ఎదుర్కొనగలిగే శక్తియుక్తులను పెంచటం, వాటి అభి వృద్ధికి దోహదం చేయటం. ఈ లక్ష్యాలు ఒకదానితో మరొకటి సంబంధంలేకుండా ఉండేవి కావు. కొన్నింటిని కొందరు సిద్ధాంత కర్తలు పదేపదే నొక్కి చెప్తారు.

క్లయింట్లలో అధిక సంఖ్యాకులు తమ వ్యక్తిగత సమస్యలకు పరిష్కార మార్గాలను సలహా విధానంద్వారా ఆశిస్తారు. మానసికంగా బాధకల్గించే పరిస్థితుల్లో ఆ బాధయొక్క ఉపశమనాన్ని కోరతారు. ఏదో ఒక నిర్ణయాన్ని చేయటం కష్టంగా తలచేవారు ఏదో ఒక మార్గపు ఎంపిక జరుగుతుందని ఆశపడతారు. ఒంటరితనాన్ని అనుభవించేవారు మానసిక శాంతిని, ఇతరులతో వ్యవహరించే తీరు బాగుపడే మార్గాల అన్వేషణను అభిలషిస్తారు. కళాశాలలో అధ్యయనం కోరుకునేవారు కళాశాలలో ప్రవేశాన్ని లేక ఆర్థిక సహాయాన్ని కాంక్షిస్తారు.

తమ చదువులలోకాని, ప్రయత్నాలలో కాని పరాజయాన్ని పొందబోయేవారు తమ పరాజయాలను విజయాలుగా మార్చుకునే పద్ధతి కోసం ఆరాటపడతారు. ఉద్యోగ విషయంగా ప్రయత్నాలు చేసేవారు వెంటనే ఉద్యోగం రావాలని, పనిలో తృప్తి ఒనగూడాలని, త్వరలో పై ఉద్యోగానికి పోవాలని ఇవన్నీ సలహా విధానం ద్వారా పొందాలని అనుకుంటారు. (షార్టుజెర్ & స్టోన్ 1974)

చాలామంది క్లయింట్లు తమకు లేక తమ కొరకు, సలహా ప్రక్రియలో భాగంగా, ఏదయినా జరగాలని భావిస్తారు. అంతిమంగా క్లయింటే ఏదయినా చర్య తీసుకోవాలని, నిర్ణయించాలని, మారాలని, పరిణామం చెందాలని సలహాదారులు క్లయింట్లకు తెలియజెప్పాలి. అంతేకాక క్లయింట్లు విషమ పరిస్థితుల్లో చిక్కుకుని పరిస్థితి మెరుగుపడాలని ఆశిస్తూ సలహాకు వస్తారు. పరిస్థితులు విషమించకుండా నిరోధించేదానికి, క్లయింటులో అభివృద్ధికరమైన మార్పు తేవడానికి సలహా పని చేయాలని సలహాధార్లు లక్ష్యంగా పెట్టుకుంటారు. క్లయింట్ల తక్షణ అవసరాలను సలహాదార్లు తీర్చాలి. అంతేగాక సలహా విధానం ద్వారా అంతిమ లక్ష్యాలను, ఈలోగా కొన్ని లక్ష్యాలను సాధించటానికి కృషి చేయాలి.

సలహా యిచ్చే వాతావరణంపై సలహాదార్లు ప్రత్యేక శ్రద్ధ వహించాలి. గది విస్తీర్ణం, ఆసనాల్ని అమర్చే విధానం, ఏకాంతత, వెలుతురు, గది అందచందాలు అన్నీ సలహా విధానంపై ప్రభావం కలిగి ఉంటాయి. క్లయింటుకూ సలహాదారుకు మధ్య సన్నిహిత సంబంధం ఏర్పరచడానికి ఉపకరిస్తాయి.

క్లయింటుకూ సలహాదారుకు మధ్య నమ్మకం, విశ్వాసం పెరగటానికి వారి మధ్య రహస్యాలను కాపాడే సంబంధం అత్యవసరం. ఏ పరిస్థితుల్లో క్లయింటు తెలియపర్చిన విషయాలను ఇతరులకు తాము చెప్పవలసి ఉంటుందో వాటిని క్లయింటుకు సలహాదారు స్పష్టంగా చెప్పాలి.

సలహా ప్రక్రియ ముమ్ముందుగా ఊహించగలిగిన దశలలో సాగుతుంది. ప్రతి దశకు నిర్దిష్టంగా కొన్ని కార్యక్రమ నియమాలూ, వృత్తి నైపుణ్యమూ ఉంటాయి. సలహాదారు క్లయింటుతో భేటీ ప్రారంభించి అతనితో/ ఆమెతో సన్నిహితత్వాన్ని సాధించడం మొదటిది. సమావేశంలో క్లయింట్ల పాత్ర ఏమిటి సలహాదారు పాత్ర ఏమిటి అని తెలుసుకుని దానికనుగుణంగా సమావేశం జరపాలో నిర్ణయించి నడపటం రెండవది. అలాగే దాంట్లో క్లయింటు దేమిటి, రహస్యాలను దాచగల సంబంధం, సమావేశ కాలపరిమితి ఇవి క

ప్రాధాన్యత వహిస్తాయి. అవసరమనుకున్నపుడు క్లయింట్లను ఇతర సలహాదారులకు అంటే శారీరకవైద్యుల, మానసిక వైద్యుల ఉద్యోగ సంబంధమయిన సలహాదారుల వద్దకు పంపడం, అంతేకాక ఇతర సంస్థలవద్దకు ఉదాహరణకు పోలీసులు, న్యాయసలహా విభాగంబాంటివి...పంపడం చివరిదశ.

మాటలుకాక ఇతరత్రా ప్రవర్తన సలహా ప్రక్రియలో ముఖ్యపాత్ర వహిస్తుంది. క్లయింట్ల మాటలేకాక వారి ఇతర ప్రవర్తన కూడ ఎంతో తెలియచేస్తుంది. అలాగే సలహాదారు యొక్క ప్రవర్తన క్లయింట్లపై ప్రభావం కలిగివుంటుంది.

సలహా ప్రక్రియ ప్రథమ దశలో సలహాదారు క్లయింటుతో సన్నిహిత సంబంధం ఏర్పరచుకోవాలి. క్లయింటు పరిస్థితిని బాగుచేయటానికి తగిన వాతావరణాన్ని సృష్టించాలి. ఇందులో సలహాదారు వ్యక్తిత్వం, సలహా క్లయింటుకు అంద చేసే విధానం, సలహాదారు ప్రావీణ్యత, నిశ్శబ్దంగా క్లయింటు కథ వినడం, అమె నుండి/ అతనినుండి విషయసేకరణ ప్రజ్ఞ, కేసుయొక్క ముఖ్యాంశాల గుర్తింపు ఇవి సలహా ప్రక్రియయొక్క అన్ని దశలలోను ఉపయుక్తం అవుతాయి.

ఒకసారి సలహా ప్రక్రియ మొదలు కాగానే వాతావరణం అనుకూలంగా మారుతుంది. క్లయింటు తనను తాను అవగాహన చేసుకోవటం,తనుగా పరిస్థితులను పరిశోధించటం ప్రారంభం అవుతుంది. తద్వారా కోరిన మార్పులు ప్రవర్తనలో సమర్థవంతంగా సంభవిస్తాయి. కొంత ప్రావీణ్యతను సలహాదారు ఈ సందర్భంగా వినియోగించవలసి వస్తుంది. క్లయింటు తానుగా పరిస్థితులను మార్పు చేయటానికి ఉద్యమించినా ప్రత్యేక సహాయాన్ని ఆశించే క్లయింట్లకోసం సలహాదారు చర్యలను తీసుకోక తప్పదు.

అత్యాచారాలకు దోపిడీకి గురయ్యే బాలికలకు, స్త్రీలకు కుటుంబ సలహా కేంద్రాలు అనేక సేవలు అందిస్తాయి. పరిస్థితిని బాగుచేయటానికి ఉపకరించేవి, బాధితులకు సహాయం చేసేవి, దుర్మార్గ పరిస్థితులు ఉద్భవించకుండా ఉండేవి అవి. ఈనాడు హైదరాబాదులో రెండు కుటుంబ సలహా కేంద్రాలున్నాయి. ఒకటి సోషల్ వెల్‌ఫేర్ రాష్ట్ర సలహాసంఘ కార్యాలయం ఉంది. రెండోది మహిళాభ్యుదయ సంస్థ ఆధ్వర్యాన 8, ఎం. ఐ. జి. హెచ్‌లో నడుస్తున్నది. కేంద్రంలో ఒక సలహాదారు పనిచేస్తుంటారు. అమె మానసిక శాస్త్రంలో, సామాజిక శాస్త్రంలో ప్రవీణులయి ఉంటారు. శిక్షణ పొందిన ఒక సోషల్ వర్కరు అమె సహాయకులుగా పనిచేస్తారు. మనిషియొక్క వ్యక్తిత్వాభివృద్ధిని, పెరుగుదలను దోహదం చేసే మానవ సామర్థ్యతను వీలయినంతవరకు పెంచడమే సలహాదారు అంతిమ లక్ష్యం.

ప్రవర్తనా శాస్త్రాన్ని అధ్యయనం చేసిన వ్యక్తి యే సలహాదారుగా నుండదగును. ఆమె క్లయింట్లతోనే పనిచేయడం మాత్రమే కాక క్లయింట్ల కుటుంబాలు, పని ప్రదేశాలను గురించి శ్రద్ధ వహిస్తారు.

ఒకటి రెండు సమావేశాలలో దంపతులను బాధించే సమస్యలను సలహాదారు గుర్తించగలగాలి, సంఘర్షణ కారణాలను పసిగట్టగలగాలి. ఒక్కొక్కప్పుడు అది కేవలం అపోహల ఫలితం కావచ్చును లేక వ్యక్తిగత విలువల సంఘర్షణ ఫలితం కావచ్చును. అనేక సందర్భాలలో భార్య తనుగానో లేక కుటుంబ సభ్యుని వెంటబెట్టుకునో ముమ్మందుగా రావడం జరుగుతుంది. తరువాత భర్తను పిలువ నంపడం సంభవిస్తుంది. భర్త కనుక మరో స్త్రీతో సంబంధం పెట్టుకోకపోయినా లేక మద్యపానపు అలవాటుకు బానిస కాకపోయినా భార్యాభర్తల మధ్య ఉద్వేగ పరమైన సత్సంబంధాలను నెలకొల్పటం సాధ్యమే. ప్రతి "కేసు"లోను అనేక విధాల "కౌన్సిలరు" భార్యాభర్తలను కలపటానికి ప్రయత్నం చేస్తారు. వివాహ బంధాన్ని విచ్ఛిన్నం చేసుకోవాలని భార్యాభర్తలు ఇరువురు కాని, అందులో ఒకరు కాని కృతనిశ్చయులయినపుడు సలహాదారు మహిళ పక్షం వహించి విడాకులు మనోవర్తి మొదలయిన వాటికోసం న్యాయసహాయం అందించే కేంద్రాలకు పంపుతారు. విడాకులు, మనోవర్తి వచ్చిన తరువాత ఆ కేసుతో కేంద్రం సంబంధం పెట్టుకొని ఆమెకు మానసికంగాను వృత్తివిద్యాపరంగాను పునరావాసము ఏర్పరుస్తుంది, అంటే మరల ఆమెకు పునర్వివాహం చేసుకోటానికి, ఉద్యోగం పొందటానికి సహాయం చేస్తుంది.

కేసు విచారణలోని జాప్యాన్ని తగ్గించడానికి, కార్య విధాననియమ వల్ల బాధలను తప్పించడానికి కుటుంబకోర్టులను దేశమంతటా నెలకొల్పడం అవశ్య కర్తవ్యం.

ఒక మనిషి వ్యక్తిత్వానికి సంబంధించిన రుగ్మత అయితే క్లయింట్లను సలహాదారు మానసిక వైద్యుని దగ్గరకు పొమ్మని సలహా ఇస్తుంది. క్లయింట్ల భర్తకు/ భార్యకు కౌన్సిలరు సలహా చెపుతుంది. ఎంతో పెద్ద మానసిక వ్యాధి అయితే తప్ప మామూలు మానసిక రుగ్మతలు నయమవుతాయని, క్లయింటు మానసిక రుగ్మత తప్పక నయమయి, ఆమె ఆరోగ్యవంతురాలయి, అందరిలాగే సుఖముగా జీవించగలదని సలహాదారు క్లయింటు భర్తకు నచ్చచెపుతుంది. శారీరక మానసిక వ్యాధుల పరిజ్ఞానం, వాటి లక్షణాలు పరిచయం సలహాదారుకు విధిగా

ఉండాలి. అవయవాల లోపం, ఆదాయాన్ని కోల్పోవటం, బంధుమరణం, సంతాన ప్రాప్తి కలుగకపోవటం ఇవి మనిషిలో మానసికంగా క్రుంగిపోవటాన్ని విషాదాన్ని కలుగజేస్తాయి. అలాంటి మనుషులకు నిద్ర పట్టకపోవటం, ఆందోళన కలగడం, మామూలుగా స్పందించకపోవడం అనే బాధలు కలుగుతాయి. వారికి ఉద్వేగ పరంగా ఊతను ఇవ్వాలి. వారు తమ విషాదయోగం నుండి బయటపడటానికి వారికి సహాయం చెయ్యాలి.

నిరాదరణకు గురి అయిన అవివాహిత మాతల కేసులను సలహాకేంద్రం సానుభూతితో పరిశీలించాలి. అలాంటి కేసులలో ఆమెను తిరిగి స్వీకరించమని ఆమె కుటుంబాన్ని ప్రోత్సహించాలి. అది సాధ్యం కాకపోతే ఆమె స్త్రీల తాత్కాలిక ఆశ్రయానికో లేక ఉద్యోగినుల వసతిగృహాలకో పంపాలి.

సలహాకేంద్రానికి సహాయం చేయటానికి ఒక వైద్యుడు, ప్లీడరు, మానసిక శాస్త్రజ్ఞురాలు, సామాజిక సేవకురాలు వగయిరాలు ఉండాలి. వీరి సంఘం సలహా కేంద్రపు కేసులను నిర్ణీత కాలవ్యవధితో జరిగే సమావేశాలలో సమీక్షించాలి. ఆ చర్చల ఫలితంగా వచ్చే సూత్రీకరణ ముందు కేసులలో ఉపయోగపడుతుంది.

ఇంతవరకు చెప్పినట్లు సలహాకేంద్రం ముందుగా పరిస్థితిని మార్పు చేయటానికి, క్లయింటుకు పునరావాసం కల్పించటానికి ఉపకరిస్తుంది. ఇలాంటి కేసులు మరల తలయెత్తకుండా చేయటం రెండవ విధి. ప్రజలలో ప్రబోధం చేయడం మూడవ కర్తవ్యం. విద్యకు మానవీయ దృక్పథాన్ని, బహువిధ అవకాశాలున్న సమాజంవైపు దృష్టి సారించే విధానాన్ని సంతరించటానికి "కౌన్సిలింగు" యొక్క 2, 3 కర్తవ్యాలు ఎంతో సాయపడతాయి. దీనినే "కుటుంబ జీవిత ప్రబోధం" అని పేర్కొనవచ్చును. దీనిని ప్రజాజీవితం యొక్క అన్ని స్థాయిలలోను ప్రవేశపెట్టవచ్చును. ఎందుకంటే మనిషి ప్రాణిగా మొదలయి సామాజిక జీవిగా మారటం తద్వారా అతని/ ఆమె యొక్క వ్యక్తిత్వం మారడం చూస్తున్నాము. "కుటుంబ జీవిత ప్రబోధం" (Family Life Education) శిశువు జన్మించక ముందునుండే ప్రారంభం అవుతుంది. ఆ ప్రబోధ కార్యక్రమం యొక్క భాగాలు ఇలా ఉంటాయి. 1. తల్లియొక్క శిశువుయొక్క ఆరోగ్యరక్షణ 2. శిశువుకు మార్గదర్శకత్వం 3. విద్యార్థులకు సలహా 4. వివాహాత్పూర్వ సలహా 5. వైవాహిక కుటుంబ సలహా 6. వృద్ధులకు సలహా మొదలయినవి అవి. ఈ విషయంగా ఒక ప్రత్యేక సెమినారును నిర్వహించడం అవసరం.

మహిళల దృక్పథంతో ఎంతో తీవ్రమయిన మార్పు వస్తున్నది. సమాజంలో స్త్రీల సంప్రదాయ పాత్రను గురించిన భావన ఎంతో బలవత్తరమయిన మార్పుకు లోనవుతున్నది, స్త్రీల యెడ ఉన్న అహేతుక విశ్వాసాలు, వైఖరులు వీటి కోటలు బదాబదలవుతున్నాయి. అయినప్పటికి, అభ్యున్నతి పొందిన దేశాల స్త్రీల స్థితి గతుల కన్న భారతీయ మహిళల పరిస్థితి దరహం మీద... ఎంతో వెనుకబడి యున్నది. వైవాహిక కుటుంబసలహా, వివాహాత్పూర్వసలహా, వృత్తిపరమయిన సలహాలాంటి మానవ సహాయక సేవా కార్యక్రమాలు అత్యధికంగా భారీఎత్తున అవసరమవుతున్నాయి. ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలూ కుటుంబ జీవితప్రబోధ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టి తద్వారా స్త్రీలలో బలవత్తరమయిన జాగృతిని, చైతన్యాన్ని పెంపొందించడం అత్యవసరం.



# వైవాహిక జీవితం : సఖ్యత, సామరస్యం

— మల్లాది సుబ్బమ్మ

వివాహం సాంఘిక సహజీవన వ్యవస్థ. అందులో హెచ్చుతగ్గులు లేవు. విల్లూ బాణమూ ఎలాంటి పరస్పరాధేయాలో అలాంటిదే దాంపత్య జీవితం. అలాగే ఎవరిని ఎవరు అధిగమించినా ప్రయోజనం శూన్యం. వ్యక్తిత్వాలను పెంచుకోగల ఇద్దరు ప్రేమతో సమిష్టి జీవితం గడపాలంటే ముందుగా ఒకర్ని ఒకరు అర్థం చేసుకోవాలి. ఆ పైన ఆలుమగలుగా అనురాగబాటలు వేసుకొని ఆ బాటలలో పయనించిన నాడే చక్కని సంసారాన్ని చేరుకోగలరు. "వివాహం అనేది దంపతుల జీవితసమరంలో చివరి అంశంకాదు. జీవనయాత్రకు నాంది ఈ పెళ్ళితోనే ప్రారంభమవుతుంది. కనుక ఈ అలల తాకిడిని తట్టుకోగల విజ్ఞానం, ధైర్యస్థయిర్యాలు ప్రతి వ్యక్తికి చాలా అవసరం.

కష్టసుఖాల కలయికే వివాహ జీవితం. కష్టాలకు అదిరి, సమస్యలకు బెదిరితే వ్యక్తి పిరికివాడవుతాడు. బంధాలలోనే బాధలూ, సౌఖ్యాలు వుంటాయి. అయితే ఈ భవబంధాన్ని తనకు బానిసగా చేసుకొనే నేర్పు ఓర్పు విజ్ఞులకు వుంటుంది. అజ్ఞానానికి అవి నరకతుల్యమయి అతన్ని బంధిస్తాయి. కనుక వైవాహిక జీవితాన్ని ఆనందమయం చేసుకోగల సమర్థత వధూవరులదేనని విశ్వసించాలి.

పెళ్ళికాగానే తమ సంసారం స్వర్గతుల్య మవుతుందనుకోవడం భ్రమ. దానికై సర్వశక్తులూ వినియోగించి పాటుపడాలి. త్యాగాలు చెయ్యాలి. ఒండొరులు వారి వారి మనస్తత్వాల నర్థం చేసుకోవాలి. సహనం, సామరస్యం, ఓర్పు, నేర్పు వారిలో చోటుచేసుకోవాలి. ముందుగా తమ తమ పరిస్థితుల నర్థం చేసుకోవాలి. అలాంటి విషయ జ్ఞానంకల విజ్ఞత ఇద్దరిలో కలగాలంటే ప్రపంచ జ్ఞానాన్వేషణ జరగాలి.

వివాహం జరిగేవరకూ జరిగినదంతా, ఊహించినదంతా ఒక కల. ఆ కలలో ...రి జీవితం అంతా సుఖమయమేకాని ఇప్పుడు ఆ కల కరిగిపోయి కొన్ని బాధ్య...లు ఏర్పడతాయి. ఇంతవరకూ వారు నడిపించబడతారు. ఇప్పుడు ఎవరినీ ఎవరూ నడిపించేది లేదు. ఇద్దరూ నడవగలగాలి. అంటే కొంత సదవగాహన కావాలి. అది అలవరచుకున్నప్పుడు వారి హృదయాలు విడిపోవు. పగిలిన హృదయాలు అతకవు అతుకులు లేని జీవితాలకు అంతా అమృతమయమే. అందినదాన్నే అందంగా మార్చుకొని ఆనందించగల శక్తి ముందుగా దంపతులలో రావాలి. లేకపోతే జీవితంలో ప్రగతి వుండదు. అంతా శూన్యమవుతుంది.

జీవిత భాగస్వాములైన ఒండొరులయెడ కొన్ని నైతిక బాధ్యతలు వుంటాయి స్నేహరూపంలో నిర్వర్తించాల్సిన జీవిత లక్ష్యాలు కూడా లేకపోలేదు. మంచివారు చెడ్డవారు అనే రెండు రకాల వ్యక్తులు వుంటారు సమాజంలో. స్వతహాగా మంచి తనం అందరిలో వుంటుంది. భాగస్వామిలోని మంచిని ప్రోత్సహిస్తే అది ప్రస్ఫు టిస్తుంది అందుకు ఓర్పు, నేర్పూ, స్వార్థత్యాగమూ కావాలి. ఒకరు మనసారా రెండోవారి బాగుకోరితే వారూ వారి శ్రేయస్సు కోరతారు. అలాంటి ఇచ్చి పుచ్చుకో గల సౌశీల్యం భార్యా భర్తల ఇద్దరిలోనూ వుండాలి. ప్రియులయెడ దూషణరహిత సంభాషణ చాలా ఉత్తమం; అవసరం కూడాను. అలాంటి నాగరికుణ్ణి చూచి అనాగరికుడు సిగ్గుపడతాడు కాని తానెన్నటికీ గర్వపడడు. తన ప్రియుని మేలు కోరి చెప్పే నిజం అప్రియమైనా చెప్పే విధం ప్రియంగా వుండాలి. ఒండొరులు ప్రేమించుకోవడం, ప్రేమలో వుండటం ఒకటికాదు. ప్రేమలో వుండటమనేది ఒక స్థితి. ప్రేమించడమనేది ఒక క్రియ. అదే అసలైన ప్రేమ స్వరూపం. ఒండొరు లపై సానుభూతి కేవలం మానసికమే కాకుండా నిత్యజీవితంలోకూడా రాజించాలి. ముఖ్యంగా ప్రేయసీ ప్రియులలో అంతరంగాలను అతికించగల అపూర్వకారణం అన్యోన్య ప్రేమకుంది. అది నిజమైన అనురాగం గల దంపతులలో మాత్రమే గోచరిస్తుంది. జీవిత భాగస్వామిని తన్నుగా చూడగల ధీశక్తి వున్న సంసారంలో అన్యోన్యతా ఆప్యాయతలకు కొరవవుండదు. ఒకరు రెండోవారి చర్యను అర్థం చేసుకోటానికి ప్రయత్నించాలి. అలాంటి ప్రయత్నమే లేకపోతే జీవితమే వ్యర్థ మవుతుంది.

మంచి స్నేహితులుగా భార్యాభర్తలు మనగలగడం జీవిత పరమావధి కావాలి. ఒక్కొక సమయంలో స్నేహానికి త్యాగంకూడా గీటురాయి కావచ్చు అప్పుడు వారు రెండోవారికి త్యాగం చేస్తున్నట్లు భావించరు. నిజమైన స్నేహా బాహ్య ప్రకటన అవసరం. అది క్రియారూపంలో మిళితమై వుంటుంది. మిత్రు ఏడిపిస్తాడు, శత్రువు నవ్విస్తాడు అనేది ఒక లోకోక్తి. అందువల్లే ప్రియులకు చే నిజాలు చెప్పక తప్పదు. ఇద్దరు విభిన్న వ్యక్తులమధ్య సంబంధం వారి వ్యక్తిత్వా త్వాలను కలిపివేయలేదు. వారివారి ప్రత్యేకతను పెంచుతుంది. అలాంటి స్నేహ సంపదను భార్యాభర్తలలో చూచి ప్రజలు గర్వించాలి.

తొలిచూపులోనే ప్రేమపుడుతుంది అని అంటారు కాని అది ప్రేమకాదు, ఆకర్షణ. అది నిత్యం జరిగే సంఘటనే. తొలిచూపులోనే ప్రేమ పుట్టదు. కాత్కా

లిక ఆకర్షణ ప్రేమక్రిందికి రాదు. మోహానికి ప్రేమకూ తేడా వుంది. ఒక వ్యక్తి యొక్క నడతను చూచి, సంభాషణను విని, హాస్యధోరణిని తిలకించి, శారీరక సౌందర్యాన్ని గమనించి మరోవ్యక్తి ఆకర్షణకు లోను కావచ్చు. అది అంతా ప్రేమ అని భావిస్తే జీవితంలో ఎదురుదెబ్బ తినవచ్చు.

ఇద్దరు వ్యక్తులను సన్నిహితం చేసేది ప్రేమ. పరస్పరగౌరవం, అభిమానం, సహనం సర్దుకు పోవడం, ఒకరికొరకొకరు ప్రయత్నించడం ప్రేమ లక్షణాలు. అది స్త్రీ పురుషుల సన్నిహితత్వాన్ని కోరుతుంది. అది సహజం. ఒకరికి మరొకరు చేరువయ్యాక సెక్సు వారి సంబంధాలలో ప్రవేశిస్తుంది. దాంతో ప్రేమ ఫలిస్తుంది. పుష్పిస్తుంది. సంతృప్తినిస్తుంది.

ప్రేమించే అవతలి వ్యక్తిని సొంతం చేసుకోవటంకాదు. అవతలి వ్యక్తిలోని మానవతను గ్రహించడమే ప్రేమలక్షణం. మృదుభాషణాన్ని, నడతను, చిరునవ్వునూ, చూపులను ప్రేమించేది నిజమైన ప్రేమకాదు. పరిస్థితులలో మార్పువస్తే మారేది ప్రేమ కాదు. కొన్ని లక్షణాలుపోతే పోయేది ప్రేమ కాదు. అది కాలంతో పాటు మారదు. చిరకాలం వుంటుంది. తుఫానులను తట్టుకుంటుంది. దానికి చలనం లేదు. ప్రేమ వున్న చోట విశ్వాసం కూడా వుంటుంది. ప్రేమ మోహం కంటే ఉన్నతమైనది; శృంగారం కంటే విలువైనది ప్రేమ, దానికి హద్దులు, అవధులు లేవు. శృంగారాన్ని కొలవడానికి సాధనాలుండవచ్చు. కాని ఇది ప్రేమ అని నిర్వచించటానికి ఏ కొలమానమూ లేదు. ప్రేమ అంటే సంతోషంతో జీవించడం, భాగస్వామ్యం గలిగివుండడం. ప్రతి వైవాహిక నౌకకు అది ధ్రువనక్షత్రం లాంటిది.

జీవిత భాగస్వామి అభ్యున్నతికోరే సహృదయమే దాంపత్య జీవితానికి గీటురాయి. ఒకరి పొరపాట్లను ఒకరు సహనంతో సానుభూతితో చూడాలి కాని కొందరపాటువల్ల పరిస్థితులు విషమించవచ్చు. మానవజీవితం అలలలాంటిది. ...్యంగా స్థిరచిత్తంతో, ధృఢసంకల్పంతొ అధిగమిస్తే ఆనందదాయకం అవు... ఆటుపోట్లకు అదిరిపడితే అవి మనలను తుడిచి పెడతాయి. సంసార నౌకకు ...మా చుక్కాని కావాలి కాని, భర్త మాత్రమే కాాదు. అనురాగ సమ్మిశ్రితమైన సహచర్యం ఒక కళ. పరస్పరానుభూతులతో పరిమళించు జీవన గమనం. దంపతుల సంబంధమన్నది ఆలుమగలలోని మానవత్వాన్ని పరిపుష్టం చేస్తుంది సంకల్ప వికల్ప సమన్వయ సాధనకు ప్రేమా, పట్టుదల, అభిమానం అవసరమవుతాయి. దానికి త్యాగం చాలా అవసరం. అలా అర్థం చేసుకున్న జీవితాలు ఆనందమయ తరంగాలవుతాయి.

ఒకరి గుణాలు మరొకరికి తెలియాలి. ఒకరి జీవిత లక్ష్యం, ఆదర్శం ఏమిటో రెండోవారికి తెలియాలి. ఆ లక్ష్యం ఇద్దరికీ ఆసక్తిదాయకమై వుండాలి. ఇద్దరిమధ్య పరస్పర అభిమానం, గౌరవం ఏర్పడాలి. పరస్పర సమ్మతితో ఇద్దరి అభ్యుదయంకోసం కాపురం చేయటానికి ఇష్టపడితేనే అది వివాహంగా పరిణమిస్తుంది. ప్రతివ్యక్తికీ ఒక ఆలోచనాసరళి, ఒక జీవిత తత్వం వుంటాయి. తమకు అలాంటి భావాలున్నాయని వారికి తెలియకపోవచ్చు. కాని పూసలపేరులోని దారం లాగా ఏదో ఒక జీవిత తత్వం వుంటుంది. ఒక్కొక్కప్పుడు దృక్పధాలు వేరుగా వుండవచ్చు. అలా వున్నప్పటికి ఒకరు మరొకరిని గౌరవించుకుంటూ కాపురం చెయ్యాలి. జీవితం సుఖంగా నడవటానికి సహనం, సర్దుకుపోవటం మూలసూత్రాలు అయితే వాటిని పాటించేది స్త్రీ మాత్రమే కారాదు. ఏ ఇద్దరి లక్ష్యాలు, ఆదర్శాలు ఒకే మూసనుండి దిగిరావు. అయితే ద్వేషంతో, ఈర్ష్యా అసూయలతో కలిసి వుండేకంటే విడిపోవడమే మేలు. పూర్తిగా విరుద్ధ తత్వాలున్న దంపతులు ఎవరి మార్గంలో వారు పయనించడం శ్రేయస్కరం. సమాజంకోసం, పరువు ప్రతిష్టల కోసం చేసే కాపురంలో అద్వితీయానందం లేకపోగా అది నరకతుల్యంగా వుంటుంది. జీవిత లక్ష్యం, జీవనరీతి, ఆదర్శం వీటిని పరిగణలోకి తీసుకోవాలి. బాహ్య సౌందర్యంకంటే మానసిక సౌందర్యం మిన్నగా భావించాలి. నిత్య జీవితంలో హృదయ సౌందర్యాన్ని నిలుపుకోటానికి ఒండొరులు ప్రయత్నంచెయ్యాలి. దానికి సాధన, శ్రమకి శిక్షణ అవసరం. అదొక కళ. ఆ కళనాస్వాదించగల కళా తపస్వులు కావాలి నూతన దంపతులు.

స్త్రీ పురుష వాంఛ వారి వ్యక్తిత్వాలకు సంబంధించినది. ఇతరులతో అనుభవాలద్వారా వారు దానిని వమ్ముచేసుకోవటానికి ఇష్టపడరు. అవతలి మనిషి తనకు అవశ్యం కావాల్సిన మనిషి. మరో మనిషి ఆ స్థానాన్ని ఆక్రమించరాదు. అందువల్ల పరస్పర విశ్వాసం అవసరం. లైంగిక సంబంధంలో ఆనందం పొందాలంటే ప్రేమలోకాని, కోరిక సందర్భంగా కాని రెండోమనిషి ఇష్టాఇష్టాలను పరిశీలిస్తేనే అది సాధ్యమవుతుంది. ఒకరిని మరొకరు వాడుకోరాదు. ఒకరి వ్యక్తిత్వాన్ని రెండోవారి వ్యక్తిత్వంలో కలిపి వేయకుండా ఎవరి వ్యక్తిత్వాన్ని వారు పెంచుకుంటూ నూతన దాంపత్య జీవిత సౌధానికి పునాదులు వేసుకోవాలి.

ఒక స్త్రీకి ఒక పురుషుడు, ఒక పురుషుడికి ఒకే స్త్రీ అన్న భావం కలిగిననాడే దాంపత్య జీవితం పరిపూర్ణమై ఫలిస్తుంది. అది విడదీయలేని ప్రేమ, మానసిక

సంస్కారమున్న వారికే చెల్లుతుంది. చిత్తశుద్ధి, పరిపక్వదశ, స్వచ్ఛమైన ప్రేమ, లేనివారికి యావజ్జీవం ఒకే భార్య ఒకే భర్త అనేది బంధమేకాక బానిసత్వమవుతుంది. అంతేకాదు ఆ దాంపత్యాన్ని వ్యభిచారమని నిర్వచించినా తప్పులేదు. రోజూ తిట్టుకుంటూ, కొట్టుకుంటూ, మరణాన్ని కోరుకుంటూ రాత్రివేళకు రాజీపడే దంపతులు మనకు ఆదర్శం కాదు. ఈ ప్రపంచంలోని అనంత సౌందర్యాన్ని, విశాల పరిధిగల ఆకాశమంత ప్రేమను, సాటిలేని సద్గుణాలను తన భాగస్వామిలో చూడగల్గిన దంపతులే మనకాదర్శం. అలా మనసారా ప్రేమించుకున్న వారి హృదయాలలో వేరొకరికి స్థానం వుండదు. ప్రేమ, స్పందన, సౌందర్యాలతో పరిపూర్ణత్వంచెంది. రససిద్ధినిపొందే అనురాగ దాంపత్య జీవితమే వివాహానికి లక్ష్యం.

పరస్పర ప్రేమ, తపన, ఆకర్షణలేని శూన్య జీవితానికి బలవంతంగా తమ శరీరాలప్పజెప్పటం కంటే ధైర్యంగా విడిపోగల స్థిరచిత్తం అధునిక వివాహవ్యవస్థలో వుంటుంది. అందుకే ఆ వివాహాలు కావాలని పోరాటం సాగుతుంది. ఎక్కడ పరస్పర ప్రేమ, గౌరవం వుంటాయో ఎక్కడ పరిపూర్ణ స్వేచ్ఛాసమానత్వాలు వుంటాయో అక్కడ ఆనందానుభూతులు వెల్లివిరుస్తాయి. కనుక ఆ స్థితి వివాహంలోనికి వచ్చిన నాడే దాంపత్య జీవితం సార్ధకమవుతుంది. ఆ జీవితాలకు లక్ష్యసిద్ధి కలుగుతుంది.

ఈనాటి వివాహాలు రెండు రకాలుగా ఉన్నాయి—పెద్దలు ఏర్పాటు చేసిన పెండ్లిండ్లు, వధూవరులు ప్రేమించుకొని నిర్ణయించుకున్నవి. మొదటిదానిలో కలిసి ఉందామనే సంకల్పం ముందు, తదుపరి తద్వారా ప్రేమాభిమానాలు; రెండవదానిలో ముందు ప్రేమ, తరువాత కలిసి కాపురం చేద్దామనే సంకల్పం. ఏదైనా, కలిసి కాపురం చేయటం రెండింటిలోనూ ఉంటుంది. దాంపత్య జీవితం సుసంపన్నం కావాలంటే ఏయే అంశాలు ఏర్పడతాయో పైన చర్చించటం జరిగింది. ప్రేమ నశించిన వైవాహిక జీవితం ఏంత నిస్సారమో, కేవలం ప్రేమభావన మాత్రం ఉండి కదితర గుణాల సతీపతులలో లోపిస్తే ఆ కాపురం దుఃఖభాజనమవుతుంది. కనుక సమతుల్య భావనతో ఈ దశలోకి యువతీయువకులు అడుగిడడం ఆవశ్యకర్తవ్యం. అలా జరగనినాడు వారు అనవసరంగా ప్రమాదాలను కొనితెచ్చుకున్న వారవుతారు. సఖ్యత, సామరస్యం వెల్లివిరిసే దాంపత్య జీవితం సుఖప్రదం అవుతుందనడంలో అతిశయోక్తిలేదు.

## మహిళా వికాసానికి

# మల్లాది సుబ్బమ్మ సాహిత్యం.

| | | |
|---|---|---|
| చరిత్ర | 1. ఆం. ప్ర. మహిళోద్యమం(1860–1983) | రు. 40–00 |
| విమర్శనాత్మక గ్రంథాలు | 2. హైందవం : స్త్రీలు | 25–00 |
| | 3. ఇస్లాం : స్త్రీలు | 15–00 |
| | 4. క్రైస్తవం : స్త్రీలు | 12–00 |
| వ్యాస సంపుటాలు | 5. సమస్యలు, సంస్కరణలు | 25–00 |
| | 6. మహిళా దశాబ్దం | 7–50 |
| | 7. స్త్రీ విమోచన | 7–50 |
| | 8 ఓ మహిళా : ముందుకు సాగిపో | 7–00 |
| | 9. వనితాలోకం | 12–00 |
| | 10. మనం : మన సంస్కృతి | 12–00 |
| | 11. బానిసా కాదు, దేవతా కాదు | 10–00 |
| | 12. స్త్రీల హక్కులు : సమస్యలు | 6–00 |
| | 13. మత ధర్మశాసనాలు ; మహిళలు | 8–00 |
| | 14. బంగారు సంకెళ్లు | 10–00 |
| | 15. హేతువాదం : స్త్రీలు | 5–00 |
| | 16. లైంగిక విప్లవం | 4–00 |
| సంకలనాలు | 17. వివాహం : నేడు, రేపు | 20–00 |
| | 18. మహిళా వికాసం : శ్రమ, ఉద్యోగం | 15–00 |
| | 19. వివాహం సంతానం కోసమేనా? | 10–00 |
| | 20. వరకట్న విశ్లేషణ | 10–00 |
| | 21. స్త్రీల లైంగికత : లైంగిక స్వేచ్ఛ | 20–00 |
| | 22. అశ్లీలం : అసభ్యత | 15–00 |
| నవలలు | 23. వంశాంకురం | 20–00 |
| | 24. ప్రేమ+సెక్స్=సీత | 1 –00 |
| | 25. వెలిగిన జ్యోతి | 12–00 |
| | 26. కాంతి కిరణాలు | 12–00 |
| | 27. చీకటి వెలుగులు | 10–0 |
| | 28. ఈ దేశం నాదేనా ? | 5–0 |
| కథలు | 29. మాతృత్వానికి మరోముడి | 20–00 |
| ప్రణాళిక | 30. స్త్రీ విముక్తి – నూతన సిద్ధాంతం. | 6–00 |
| | 31. **Atrocities on Women** | 30-00 |
| | 32. **Saga of Women's Struggle** | 10–00 |
| | 33. **Women's Liberation** | 10-00 |

# శిక్షణా కేంద్ర సాహిత్యం

| | |
|---|---|
| 1. స్త్రీలకు ప్రత్యేక సమస్యలు వున్నాయా? | 2-00 |
| 2. మానవ హక్కులు : మహిళల హక్కులు | 2-00 |
| 3. స్త్రీల హోదా : వివక్ష | 2-00 |
| 4. వరకట్న మరణాలు ; నిషేధ శాసనాలు | 2-00 |
| 5. స్త్రీలపై అత్యాచారాలు | 3-00 |
| 6. మతం : మూఢ విశ్వాసాలు | 3-00 |
| 7. మత సమాజాలు : మహిళలు | 1-00 |
| 8. మత ధర్మశాసనాలు : మహిళలు | 3-00 |
| 9. కుల సంకెళ్ళు | 2-00 |
| 10. వివాహ వ్యవస్థ | 2-00 |
| 11. ఆడది : వంటపని, ఇంటి చాకిరి | 2-00 |
| 12. ఇల్లాలి ఇంటిపేరు ఎందుకు మారాలి? | 2-00 |
| 13. ప్రేమ వివాహాలు సఫలత చెందాలంటే | 3-00 |
| 14. సామాజిక పరిణామం | 2-00 |
| 15. జాతీయ సమైక్యత | 3-00 |
| 16. హేతువాదం | 1-50 |
| 17. హ్యూమనిజం : స్త్రీ విమోచన | 1-50 |
| 18. స్త్రీ విముక్తి నూతన సిద్ధాంతం | 3-00 |
| 19. కామన్ సివిల్ కోడ్ : స్త్రీలు | 2-00 |
| 20. సెక్సు అపోహలు | 2-00 |
| 21. సాహిత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ | 2-00 |
| 22. మహిళా దశాబ్దం : సాధించిన విజయాలు | 2-00 |
| 23. ప్రపంచ మహిళల స్థితిగతులు : పోరాటాలు | 2-00 |
| 24. మహిళోద్యమ చరిత్ర : అభివృద్ధి | 2-00 |
| 25. మహిళాభ్యుదయానికి మహిళా పత్రికలు | 2-00 |
| 26. వివాహం : దాంపత్య జీవితం | 2-00 |
| 27. ప్రజాస్వామ్య వ్యవస్థ ; స్త్రీలు | 2-00 |
| 28. మాతృత్వం : శిశుపోషణ ; కుటుంబ నియంత్రణ | 2-00 |
| 29. ప్రజోద్యమాలు ; మహిళోద్యమాలు | 2-00 |
| 30. ఫెమినిజం అవసరమా ? | 2-00 |
| 31. లైంగిక విప్లవం | 3-00 |
| 32. స్త్రీ స్వేచ్ఛ : యుటోపియా | 2-00 |
| 33. సమానతా నువ్వెక్కడ? | 4-00 |
| 34. అతివలపై అఘాయిత్యాలు; స్వచ్ఛంద సంస్థల ప్రతిఘటనలు | 8-00 |
| 35. మహిళా జాగృతి ; చైతన్యం | 3-00 |
| 36. మూఢనమ్మకాలు నశించేదెలా? | |

కుటుంబాలు సర్వవిధాలా సుఖసంతోషాలకు ఆలవాలమవుతాయి. తద్వారా శాంతి సామరస భావాలు పెరిగి భార్యా భర్తల మధ్య సహజీవనం, అత్తమామలయెడ గౌరవం, బిడ్డలయెడ అవ్యాజానురాగం సిద్ధించి కుటుంబం మూడు పువ్వులూ ఆరు కాయలుగా విరాజిల్లుతుంది. అలాంటి కుటుంబాలున్న సమాజంలోనే సంతృప్తి, ఆనందం వెల్లివిరుస్తాయి. కనుక కుటుంబానికి, సమాజానికి కూడా వ్యక్తే మూలం. ఈనాటి మానవుడు విశ్వమానవుడయినాడు కదా! కనుక కుటుంబం కూడా వసుధైన కుటుంబం అయిననాడే జాతులు, మతాలు, కులాలు, భాషలు హద్దులు అంతరించి పోతాయి, యుద్ధాలు నశిస్తాయి, సత్యాహింసల సాధనాలతో మానవాళి వికసిస్తుంది. అయితే మనం సచ్ఛీలురమైనా కుటుంబ సభ్యులు కొందరు స్వార్థం, పేరాశ, లోభత్వం, ధనాపేక్షలు కలవారై తోటివారిని హింసిస్తుంటే ఏం చెయ్యాలి అనేదొక భావం, దుర్మార్గులను సన్మార్గులను చెయ్యటం ఎంత కష్టమో వారితో సహజీవనం నెరపడంకూడా అంతకన్నా కష్టమే. అయితే మనం మాత్రం వారి దారిన నడవడం, వారిని దూషించడం అర్థరహితం, అవివేకము, మన సత్ ప్రవర్తనతో వారిని మార్చుకోగలగాలి. మరీ శృతిమించితే వారికి దూరంగా మెలగాలి. కొన్ని ముఖ్యలక్షణాలను సహనం, సశ్శీలం, సత్ ప్రవర్తన, సమరస భావన, కుటుంబ సభ్యులు అలవర్చుకోక తప్పదు.

1. నిజాయితీ:- (HONESTY) కుటుంబములో, సమాజంలో సమంజసంగా మెలగడానికి ప్రతి వ్యక్తికి కొన్ని లక్షణాలు వుండాలి. అందులో ముఖ్యమయినది సచ్ఛీలం. శీలం అంటే చాలమంది లైంగికంగా ఆలోచిస్తారు. అది సరికాదు. శీల విషయంలో నిజాయితీ అంటే వ్యక్తి నడవడి అనే లక్షణం ప్రముఖ పాత్ర వహిస్తుం నిజాయితీ అంటే మనోవాక్కాయ కర్మల పరిశుద్ధంగా ప్రవర్తించటం. ఆలోచించడ మాట్లాడటం, చేయడం ఒకే పద్ధతిలో వుండాలి. ఒకటి అనుకొని మరొకటి చెప్పడం, చెప్పేదానికి భిన్నంగా నడుచుకోవటం సరికాదు. దీనినే త్రికరణశుద్ధి అని పిలుస్తాం. చాలమంది నోటితో పొగడి నొసలుతో వెక్కిరిస్తారు. లేక మనిషి ఎదుట ప్రస్తుతించే పద్ధతిలో మాట్లాడి ఆ మనిషి కనుమరుగవగానే, అపహాస్యంగా మాట్లాడటం, ఆ మనిషిని నిందించటం తగని పని. ఒక వ్యక్తి భావాలు నచ్చకపోతే నిష్కర్షగా ఆ విషయం వెలిబుచ్చటం ఉత్తమ లక్షణం. కనీసం మెచ్చుకోకుండా వుండటం ద్వితీయ శ్రేణిది. ఒక్కొక్కపుడు రెండవ పద్ధతికూడా మాటలకన్నా శక్తివంతంగా వుంటుంది. ఏదైనా, యీ రెండు రకాల నడతలో దేనిని అమలు చేసినా ఈసు, కార్పణ్యం, ద్వేషం లేకుండా చేయగల్గాలి. భయానికి లోనయి, మరేదో ప్రయోజనాన్ని ఆశిం

అలా సంచరించ కూడదు. అంతర్యా వృత్తి లేక అంతరాత్మ సాక్షిగా చెప్పాలి అలాగే చెయ్యాలి. ఇచ్చకాలు మాటలవల్ల తాత్కాలికంగా అవతలవారు సంతోషించినా త్వరలో వారు అసలు విషయాన్ని కనుకొంటారు, మోసం బయటపడుతుంది. నిజాయితీగా వ్యవహరించిన వ్యక్తి బండారం బయటపడుతుంది. ఫలితాన్ని ఆశించి నిజాయితీని మూలకు నెట్టి ప్రవర్తించిన వ్యక్తి రెండు విధాలుగా నష్టపడటం సంభవిస్తుంది. ఎవరయినా మంచి పని చేస్తే మెచ్చుకొనడం కూడా నిజాయితీలో భాగమే బహుమతులు ఇవ్వకపోయినా, సన్మానాలు చేయలేకపోయినా కనీసం మంచి మాట పలకడం అవసరం చెడ్డ పనిని నిరసించక పోవటం ఎంత తప్పో మంచి పనిని గుర్తించకపోవడం అంతే తప్పు ఈ లక్షణం కుటుంబంలో, సమాజంలో ఇతర సభ్యులలో సుహృద్భావాన్ని కలుగజేస్తుంది. తద్వారా కుటుంబంలో, సమాజంలో శాంతి సామరస్యాలు వెల్లివిరుస్తాయి.

2 ఇతరుల పరిగణ:- (CONSIDERATION) చాలమంది మంచి మనుషులు కూడా ఒక పొరపాటుకు లోనవుతారు తమ అభిప్రాయాలే తమ చేతలే సర్వకాలం మంచివనే భావిస్తారు. ఇతరుల మాటను అసలు వినిపించుకోరు. వినిపించుకున్నా దానిని గురించి ఆలోచించరు. దానికి తగిన పరిగణన యివ్వరు. అమాయకుని భావాలని, అవివేక వ్యక్తి ఊహాలని వాటిని త్రోసివేస్తారు. ఇది వారు ఆమోదించే పవిత్రతా భావం వల్ల కలుగుతుంది. తామే పవిత్రులమని, ఆలోచనా పరులమని, సచ్ఛీలురమని అలా ప్రవర్తిస్తారు. ఇది వారి అహంకారానికి చిహ్నం. ఇది ఒక్కొక్కపుడు పైకి కన్పించకపోవచ్చు. దండలో దారంలా అంతర్లీనంగా వుంటుంది ఇది సరి అయిన పద్ధతి కాదు. ఆత్మాభిమానం కావాలి కాని దురహంకారం, దురభిమానం పనికిరాదు. నీశక్తి, ఆలోచనా ప్రతిభ ఏ ఒక్కరి సొమ్ము కాదు. ఒక్కొక్క సారి ఎంతో గొప్ప ఆలోచనాపరునికి తోచని భావం సామాన్యునికి స్ఫురిస్తుంది. ఏ వ్యక్తిలోను సంపూర్ణత్వం కనిపించదు. కనుక ప్రతివ్యక్తి ఎల్లవేళల ఇతరులనుండి తెలిసికొనడానికి, నేర్చుకోవడానికి సిద్ధంగా వుండాలి. జీవితాంతం విద్యార్థిగా వుండటం మంచి లక్షణం. దానికి ఉదారత, త్యాగం, సచ్ఛీలం, ఋజుప్రవర్తనలే వ్యక్తి వ్యక్తిత్వానికి తోడ్పడతాయి.

ఈ అంశాన్ని మరొక దృక్పథంతో గమనించవచ్చు, ఒక వ్యక్తిని తనతో సమానంగా చూడటం అంటే ఆ వ్యక్తియొక్క భావాలను లెక్కలోకి తీసుకోవడం అభిప్రాయాలకు విలువ వాటిని వెలిబుచ్చిన వ్యక్తి హోదా, పదవి, పేరుప్రతిష్ఠలు

ఎరిక్ ఫ్రామ్, రిచర్డు విలింగ్‌స్టన్ లాంటి సైకాలజిస్టుల అభిప్రాయంతో ఒక కట్టడానికి ముందు నమూనా గీసినట్లు, ఒక చిత్రపటాన్ని ఒక మోడల్ నిర్మించినట్లే ఉన్నత సమాజాన్ని నిర్మించడానికి, అందులో మానవ విలువల్ని ప్రోది చెయ్యటానికి కుటుంబాన్ని మించిన ప్రయోగశాల లేదు అన్నారు. ఇక్కడ నేర్చిన విద్యకాని, విద్వత్తుకాని, భావఘర్షణగాని, ఆప్యాయతలు, అనురాగాలు, విద్వేషాలు, విధ్వంసాలు, మరెక్కడా దొరకవు. మానవ జీవితం, కుటుంబ వ్యవస్థ, అందులోని వ్యక్తుల నడత, గుణగణాలు, ఆచార వ్యవహారాలు చిత్రాతి చిత్రం వర్ణనాతీతంగా వుంటాయి. హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడు పుట్టినట్లు ఎవరి రూపు రేఖలు వారివి, ఎవరి గుణగణాలు వారివి. అయినా పూసలోని దారంవలె అనేకత్వంలో ఏకత్వం, ఏకత్వంలో అనేకత్వం వున్నట్లే కుటుంబ వ్యవస్థ పునాది సడలి పోలేదు. కాకపోతే గ్రామికీకరణవల్ల ఉమ్మడి కుటుంబాలు చెదరిపోయి అణు కుటుంబాలు పెరిగిపోతున్నాయి. అయినా జాయింటు ఫ్యామిలీలకంటే సింగిల్ ఫ్యామి లీల్లో పేచీలు, తగాదాలు, హత్యలు, ఆత్మహత్యలు విడిపోవటాలు తగ్గిపోలేదని మనకు తెలుసు. కారణము మానవ మస్తిష్కంలో పుట్టిన భావాల పరిణామమే మన లోని స్పర్థలకు కారణాలు. ధనవంతులైనా, అందగాళ్ళయినా మనల్నాంతి లోపించటా నికి పొరపొచ్చాలు వుండటానికి మూలం మన మనోగత లక్షణాలేమూలాం. కనుక మనం మారాలి. పుర్రెన పుట్టిన బుద్ధి పుడకలతోకాని పోదంటారు. అది పొరపాటు అవ గాహన. ఈనాడు ఎన్నో అసాధ్యాలు సాధ్యాలయినాయి మానవ శక్తి అమోఘం, ద్వితీయం. పట్టుపడితే కొండలనైనా పిండి చెయ్యొచ్చు. అలాగే మనం మన దుర్గ ణాలను సద్గుణాలుగా మార్చుకోవటం అంత కష్టసాధ్యమేమీ కాదు. మనం కోరేది శాంతి, సుఖం, ఆనందం, సంతోషం. ఇవి కలిగివున్నవారే మహామనీషులు. కనుక సాధన ద్వారా మనలోని ఈర్ష్యా అసూయలను, లోభం మోహం, అవినీతి అక్రమ ధనా పేక్ష లాంటి దుర్మార్గ హీనకృత్యాలు రూపుమాపుకొని వాటి స్థానంలో దయ, సాను భూతి, ప్రేమ, అభిమానం, సేవాదృక్పథం, త్యాగం, నీతి నిజాయితీ లాంటి కొన్ని సద్గుణాలను అలవర్చుకుంటే మనకు మనమూ, మనవల్ల తోటివారు, తద్వారా కుటుంబం, సమాజం, దేశం సుభిక్షంగా మనగలవు. కనుక ఏ కార్యసాధనకైనా మూలం మానవ ప్రవృత్తి. దానిని సాఫీగా నడిపించగల బుద్ధి ఒక్క మానవునికే వుంది. ఆ బుద్ధిని దుష్టత్వం నుండి సత్యం శివం సుందరం అనే సూక్తు వైపు మరల్చగలిగితే కుటుంబ పునాది గట్టిపడుతుంది. దాని వ్రేళ్లు శాఖోపశాఖలై విరాజిల్లుతాయి. అది మన చేతుల్లో పనే. ఆనాడే యుద్ధాలు పోయి శాంతి కలుగుతుంది. ద్వేషాలు పోయి ప్రేమభిమానాలు కలుగుతాయి. స్వార్థాలు నశించి పరార్థం మనగల్గుతుంది.

కుటుంబాలు సర్వవిధాలా సుఖసంతోషాలకు ఆలవాలమవుతాయి. తద్వారా శాంతి సౌమరస భావాలు పెరిగి భార్యా భర్తల మధ్య సహజీవనం, అత్తమామలయెడ గౌరవం, బిడ్డలయెడ అవ్యాజానురాగం సిద్ధించి కుటుంబం ముద్దు పువ్వులా ఆరు తాళ్ళుగా విరాజిల్లుతుంది. అలాంటి కుటుంబాలున్న సమాజంలోనే సంతృప్తి, ఆనందం వెల్లివిరుస్తాయి. కనుక కుటుంబానికి, సమాజానికి కూడా వ్యక్తే మూలం. ఈనాటి మానవుడు విశ్వమానవుడయినాడు కదా! కనుక కుటుంబం కూడా వసుధైక కుటుంబం అయిననాడే జాతులు, మతాలు, కులాలు, భాషలు హద్దులు అంతరించిపోతాయి, యుద్ధాలు నశిస్తాయి, సత్యాహింసల సాధనాంతో మానవాళి వికశిస్తుంది. అయితే మనం సచ్ఛీలురమైనా కుటుంబ సభ్యులు కొందరు స్వార్థం, పేరాశ, లోభత్వం, ధనాపేక్షలు కలవారై తోటివారిని హింసిస్తుంటే ఏం చెయ్యాలి అనేదొక భావం, దుర్మార్గులను సన్మార్గులను చెయ్యటం ఎంత కష్టమో వారితో సహజీవనం నెరపడంకూడా అంతకన్నా కష్టమే. అయితే మనం మాత్రం వారి దారిన నడవడం, వారిని దూషించడం అర్థరహితం, అవివేకము, మన సత్ ప్రవర్తనతో వారిని మార్చుకోగలగాలి. మరీ శృతిమించితే వారికి దూరంగా మెలగాలి. కొన్ని ముఖ్యలక్షణాలను సహనం, సశ్శీలం, సత్ ప్రవర్తన, సమరస భావన, కుటుంబ సభ్యులు అలవర్చుకోక తప్పదు.

1. నిజాయితి:- (HONESTY) కుటుంబములో, సమాజంలో సమంజసంగా మెలగడానికి ప్రతి వ్యక్తికి కొన్ని లక్షణాలు వుండాలి. అందులో ముఖ్యమయినది సచ్ఛీలం. శీలం అంటే చాలమంది లైంగికంగా ఆలోచిస్తారు. అది సరికాదు. శీలం విషయంలో నిజాయితీ అంటే వ్యక్తి నడవడి అనే లక్షణం ప్రముఖ పాత్ర వహిస్తుంది నిజాయితీ అంటే మనోవాక్కాయ కర్మల పరిశుద్ధంగా ప్రవర్తించటం. ఆలోచించడం మాట్లాడటం, చేయడం ఒకే పద్ధతిలో వుండాలి. ఒకటి అనుకొని మరొకటి చెప్పడం, చెప్పేదానికి భిన్నంగా నడుచుకోవటం సరికాదు. దీనినే త్రికరణశుద్ధి అని పిలుస్తాం. చాలమంది నోటితో పొగడి నొసలుతో వెక్కిరిస్తారు. లేక మనిషి ఎదుట ప్రస్తుతించే పద్ధతిలో మాట్లాడి ఆ మనిషి కనుమరుగవగానే, అపహాస్యంగా మాట్లాడటం, ఆ మనిషిని నిందించటం తగని పని. ఒక వ్యక్తి భావాలు నచ్చకపోతే నిష్కర్షగా ఆ విషయం వెలిబుచ్చటం ఉత్తమ లక్షణం. కనీసం మెచ్చుకోకుండా వుండటం ద్వితీయ శ్రేణిది. ఒక్కొక్కపుడు రెండవ పద్ధతికూడా మాటలకన్నా శక్తివంతంగా వుంటుంది. ఏదైనా, యీ రెండు రకాల నడతలో - దేనిని అమలు చేసినా ఈసు, కార్పణ్యం, ద్వేషం లేకుండా చేయగల్గాలి. భయానికి లోనయి, మరేదో ప్రయోజనాన్ని ఆశించి

అలా సంచరించ కూడదు. అంతర్వాణి వృత్తి లేక అంతరాత్మ సాక్షిగా చెప్పాలి అలాగే చెయ్యాలి. ఇచ్చకోలు మాటలవల్ల తాత్కాలికంగా అవతలవారు సంతోషించినా త్వరలో వారు అసలు విషయాన్ని కనుకొంటారు, మోసం బయటపడుతుంది. నిజాయితీగా వ్యవహరించిన వ్యక్తి బండారం బయటపడుతుంది. ఫలితాన్ని ఆశించి నిజాయితీని మూలకు నెట్టి ప్రవర్తించిన వ్యక్తి రెండు విధాలుగా నష్టపడటం సంభవిస్తుంది. ఎవరయినా మంచి పని చేస్తే మెచ్చుకొనడం కూడా నిజాయితీలో భాగమే బహుమతులు ఇవ్వకపోయినా, సన్మానాలు చేయలేకపోయినా కనీసం మంచి మాట పలకడం అవసరం. చెడ్డ పనిని నిందించక పోవటం ఎంత తప్పో మంచి పనిని గుర్తించకపోవడం అంతే తప్పు ఈ లక్షణం కుటుంబంలో, సమాజంలో ఇతర సభ్యులలో సుహృద్భావాన్ని కలుగజేస్తుంది. తద్వారా కుటుంబంలో, సమాజంలో శాంతి సామరస్యాలు వెల్లివిరుస్తాయి.

2 ఇతరుల పరిగణ:- (CONSIDERATION) చాలమంది మంచి మనుషులు కూడా ఒక పొరపాటుకు లోనవుతారు. తమ అభిప్రాయాలే తమ చేతలే సర్వకాలం మంచివనే భావిస్తారు. ఇతరుల మాటను అసలు వినిపించుకోరు. వినిపించుకున్నా దానిని గురించి ఆలోచించరు. దానికి తగిన పరిగణన యివ్వరు. అమాయకుని భావాలని, అవివేక వ్యక్తి ఊహాలని వాటని త్రోసివేస్తారు. ఇది వారు ఆమోదించే పవిత్రతా భావం వల్ల కలుగుతుంది, తామే పవిత్రులమని, ఆలోచనా పరులమని, సచ్ఛీలురమని అలా ప్రవర్తిస్తారు. ఇది వారి అహంకారానికి చిహ్నం. ఇది ఒక్కొక్కపుడు పైకి కన్పించకపోవచ్చు. దండలో దారంలా అంతర్లీనంగా వుంటుంది ఇది సరి అయిన పద్ధతి కాదు. ఆత్మాభిమానం కావాలి కాని దురహంకారం, దురభిమానం పనికిరాదు. సీశక్తి, ఆలోచనా ప్రతిభ ఏ ఒక్కరి సొమ్ము కాదు. ఒక్కొక్కసారి ఎంతో గొప్ప ఆలోచనాపరునికి తోచని భావం సామాన్యునికి స్ఫురిస్తుంది. ఏ వ్యక్తిలోను సంపూర్ణత్వం కనిపించదు. కనుక ప్రతివ్యక్తి ఎల్లవేళల ఇతరులనుండి తెలిసికొనడానికి, నేర్చుకోవడానికి సిద్ధంగా వుండాలి. జీవితాంతం విద్యార్థిగా వుండటం మంచి లక్షణం. దానికి ఉదారత, త్యాగం, సచ్ఛీలం, ఋజుప్రవర్తనలే వ్యక్తి వ్యక్తిత్వానికి తోడ్పడతాయి.

ఈ అంశాన్ని మరొక దృక్పథంతో గమనించవచ్చు, ఒక వ్యక్తిని తనతో సమానంగా చూడటం అంటే ఆ వ్యక్తియొక్క భావాలను లెక్కలోకి తీసుకోవడం అభిప్రాయాలకు విలువ వాటిని వెలిబుచ్చిన వ్యక్తి హోదా, పదవి, పేరుప్రతిష్ఠలు

పీటిపై ఆధారపడకూడదు. పేద వ్యక్తి పలికినా, అధికారంలోవున్న మనిషి చెప్పిన పేరుప్రఖ్యాతులు లేని పౌరుడు అన్నా ఒకటిగానే వుండాలి. ఆ భావం యొక్క విలువ అంతర్గతమయిన అంశాలపైన ఆధారపడాలి ఈ సూత్రాన్ని ఎప్పుడూ గమనించడ ప్రజాస్వామ్యంలో నమ్మకం వున్నవారు చేసే పని. ఒక మాటను భార్య చెప్పిన తల్లి పలికినా, సంతానం అన్నా ఖాతరు చెయ్యడం కుటుంబంలోని పురుషుని విధ్యు ధర్మం 'నీకేం తెలుసు' అనే నిరసన భావంలో దాన్ని త్రోసిరాజనటం తగని పని.

మరొక్క అంశాన్ని గురించి ప్రస్తావించటం అవసరం. పరిగణించడం వే ఆమోదించడం వేరు. ఒకరి ఆలోచనలను, ఒకరి భావాన్ని, ఒకరి పథకాన్నీ ఓపిక వినడం వేరు; దానిని యథాతథంగా అంగీకారం తెలపడం వేరు. ఆలోచించి పని రాదని నిరాకరించవచ్చు లేక కొంత భాగం ఉపకరిస్తుందని స్వీకరించవచ్చు అంతేగాని ఫలానివారు చెప్పారు కనుక తప్పక తమ సమ్మతి తెలపాలనుకోవడ కంతవ్యంకాదు వ్యక్తులమధ్య పరస్పర గౌరవం మీద, భావాల విలువ మీద ఆధా పడే సహకారం కావాలి కాని గ్రుడ్డి అనుకరణ కాదు. కుటుంబ యజమా అభిప్రాయాన్ని ఆలోచనా రహితంగా స్త్రీలు - భార్య, తల్లి, అప్పచెల్లెళ్లు - వెంట ఒప్పుకోవడం, అలా వారు అంగీకరించాలని ఆశించడం అసమంజసం. ఈ సందర్భంల మరో హెచ్చరిక చేయడం అవశ్య కర్తవ్యం. కుటుంబ యజమాని అభిప్రాయం కను దానిని గ్రుడ్డిగా, బండగా నిరసించకూడదు; ఆమోదించకూడదు కూడాను. అల చేయడం ఆత్మవంచన పరవంచన అవుతుంది. ప్రతి వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని కాప డుకోవాలి. వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే తాపత్రయంతో సందర్భం లేకుం అర్థంతో నిమిత్తం లేకుండా మరొక వ్యక్తితో విభేదించరాదు. విశిష్టత్వం వ్యక్తిత లక్షణమే కాని అది సహజమయినదిగా వస్తుపరమైనదిగా వుండాలి. కృత్రిమంగా వుండరాదు. కేవలం మరో ప్రయోజనాన్ని ఆశించి 'వ్యక్తిత్వ వికాసం కొరకు' అ ముసుగులో వ్యవహరించరాదు.

ఎదుటి మనిషిని వినటం, అర్థం చేసుకోవటం, ఆ మనిషి మాటలకు భావాలక విలువ యివ్వటం ప్రతి వ్యక్తి చేయవలసిన పనులు. అలా అత్యధిక సంఖ్యాకుల సంచరిస్తే కుటుంబంలో, సమాజంలో అసంతృప్తి నశిస్తుంది; ప్రశాంత వాతావరణ వస్తుంది. అప్పుడే కుటుంబం, సమాజం శాంతి సౌఖ్యాలతో విరాజిల్లుతవి. ఏది ఏమయినా కుటుంబ వ్యవస్థ ఈనాటిది కాదు. మానవ నాగరికత ప్రారంభం కుటుంబం లోనే ఏర్పడింది. ఇదొక విధమైన ప్రయోగశాల.

ఎరిక్ ఫ్రామ్, రిచర్డు విలింగ్‌స్టన్ లాంటి సైకాలజిస్టుల అభిప్రాయంతో ఒక కట్టడానికి ముందు నమూనా గీసినట్లు, ఒక చిత్రపటాన్ని ఒక మోడల్ నిర్మించినట్లే ఉన్నత సమాజాన్ని నిర్మించడానికి, అందులో మానవ విలువల్ని ప్రోది చెయ్యటానికి కుటుంబాన్ని మించిన ప్రయోగశాల లేదు అన్నారు. ఇక్కడ నేర్చిన విద్యకాని, విద్వత్తుకాని, భావఘర్షణగాని, ఆప్యాయతలు, అనురాగాలు, విద్వేషాలు, విధ్వంసాలు, మరెక్కడా దొరకవు. మానవ జీవితం, కుటుంబ వ్యవస్థ, అందులోని వ్యక్తుల నడత, గుణగణాలు, ఆచార వ్యవహారాలు చిత్రాతి చిత్రం వర్ణనాతీతంగా వుంటాయి. హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడు పుట్టినట్లు ఎవరి రూపురేఖలు వారివి, ఎవరి గుణగణాలు వారివి. అయినా పూసలోని దారంవలె అనేకత్వంలో ఏకత్వం, ఏకత్వంలో అనేకత్వం వున్నట్లే కుటుంబ వ్యవస్థ పునాది సడలి పోలేదు. కాకపోతే గ్రామికీకరణవల్ల ఉమ్మడి కుటుంబాలు చెదిరిపోయి అణు కుటుంబాలు పెరిగిపోతున్నాయి. అయినా జాయింటు ఫ్యామిలీలకంటే సింగిల్ ఫ్యామిలీల్లో పేచీలు, తగాదాలు, హత్యలు, ఆత్మహత్యలు విడాకులు తగ్గిపోలేదని మనకు తెలుసు. కారణము మానవ మస్తిష్కంలో పుట్టిన భావాల పరిణామమే మన లోని స్పర్థలకు కారణాలు. ధనవంతులైనా, ఆంచగాళ్ళయినా మనశ్శాంతి లోపించటానికి పొరపొచ్చాలు వుండటానికి మూలం మన మనోగత లక్షణాలేమూలం. కనుక మనం మారాలి. పుత్రైన పుట్టిన బుద్ధి పుడకలతోకాని పోదంటారు. అది పొరపాటు అవ గాహన. ఈనాడు ఎన్నో అసాధ్యాలు సాధ్యాలయినాయి. మానవ శక్తి అమోఘం, అద్వితీయం. పట్టుపడితే కొండలనైనా పిండి చెయ్యవచ్చు. అలాగే మనం మన దుర్గుణాలను సద్గుణాలుగా మార్చుకోవటం అంత కష్టసాధ్యమేమీ కాదు. మనం కోరేది శాంతి, సుఖం, ఆనందం, సంతోషం. ఇవి కలిగివున్నవారే మహామనిషులు. కనుక సాధన ద్వారా మనలోని ఈర్ష్యా అసూయలను, లోభం మోహం, అవనీతి అక్రమ ధనాపేక్ష లాంటి దుర్మార్గ హీనకృత్యాలు రూపుమాపుకొని వాటి స్థానంలో దయ, సానుభూతి, ప్రేమ, అభిమానం, సేవాదృక్పథం, త్యాగం, నీతి నిజాయితీ లాంటి కొన్ని సద్గుణాలను అలవర్చుకుంటే మనకు మనమూ, మనవల్ల తోటివారు, తద్వారా కుటుంబం, సమాజం, దేశం సుఖికంగా మనగలవు. కనుక ఏ కార్యసాధనకైనా మూలం మానవ ప్రవృత్తి. దానిని సాఫీగా నడిపించగల బుద్ధి ఒక్క మానవునికే వుంది. ఆ బుద్ధిని దుష్టత్వం నుండి సత్యం శివం సుందరం అనే సూక్తు వైపు మరల్చగలిగితే కుటుంబ పునాది గట్టిపడుతుంది. దాని వ్రేళ్లు శాఖోపశాఖలై విరాజిల్లుతాయి. అది చేతుల్లో పనే. ఆనాడే యుద్ధాలు పోయి శాంతి కలుగుతుంది. ద్వేషాలు పోయి అభిమానాలు కలుగుతాయి. స్వార్థాలు నశించి పరార్థం మనగల్గుతుంది.

ఆలా సంచరించ కూడదు. అంతర్సృ్ వృత్తి లేక అంతరాత్మ సాక్షిగా చెప్పాలి ఆలాగే చెయ్యాలి. ఇచ్చకోలు మాటలవల్ల తాత్కాలికంగా అవతలవారు సంతోషించినా త్వరలో వారు అసలు విషయాన్ని కనుకొంటారు, మోసం బయటపడుతుంది. నిజాయితీగా వ్యవహరించిన వ్యక్తి బండారం బయటపడుతుంది. ఫలితాన్ని ఆశించి నిజాయితీని మూలకు నెట్టి ప్రవర్తించిన వ్యక్తి రెండు విధాలుగా నష్టపడటం సంభవిస్తుంది. ఎవరయినా మంచి పని చేస్తే మెచ్చుకొనడం కూడా నిజాయితీలో భాగమే బహుమతులు ఇవ్వకపోయినా, సన్మానాలు చేయలేకపోయినా కనీసం మంచి మాట పలకడం అవసరం చెడ్డ పనిని నిరసించక పోవటం ఎంత తప్పో మంచి పనిని గుర్తించకపోవడం అంతే తప్పు ఈ లక్షణం కుటుంబంలో, సమాజంలో ఇతర సభ్యులలో సుహృద్భావాన్ని కలుగజేస్తుంది. తద్వారా కుటుంబంలో, సమాజంలో శాంతి సామరస్యాలు వెల్లివిరుస్తాయి.

2 ఇతరుల పరిగణ:- (CONSIDERATION) చాలమంది మంచి మనుషులు కూడా ఒక పొరపాటుకు లోనవుతారు. తమ అభిప్రాయాలే తమ చేతలే సర్వకాలం మంచివనే భావిస్తారు. ఇతరుల మాటను అసలు వినిపించుకోరు. వినిపించుకున్నా దానిని గురించి ఆలోచించరు. దానికి తగిన పరిగణన యివ్వరు. అమాయకుని భావాలని, అవివేక వ్యక్తి ఊహాలని వాటిని త్రోసివేస్తారు. ఇది వారు ఆమోదించే పవిత్రతా భావం వల్ల కలుగుతుంది, తామే పవిత్రులమని, ఆలోచనా పరులమని, సచ్ఛీలురమని అలా ప్రవర్తిస్తారు. ఇది వారి అహంకారానికి చిహ్నం. ఇది ఒక్కొక్కప్పుడు పైకి కన్పించకపోవచ్చు. దండలో దారంలా అంతర్లీనంగా వుంటుంది ఇది సరి అయిన పద్ధతి కాదు. ఆత్మాభిమానం కావాలి కాని దురహంకారం, దురభి మానం పనికిరాదు. సీశక్తి, ఆలోచనా ప్రతిభ ఏ ఒక్కరి సొమ్ము కాదు. ఒక్కొక్క సారి ఎంతో గొప్ప ఆలోచనాపరునికి తోచని భావం సామాన్యునికి స్ఫురిస్తుంది. ఏ వ్యక్తిలోను సంపూర్ణత్వం కనిపించదు. కనుక ప్రతివ్యక్తి ఎల్లవేళల ఇతరులనుండి తెలిసికొనడానికి, నేర్చుకోవడానికి సిద్ధంగా వుండాలి. జీవితాంతం విద్యార్థిగా వుండటం మంచి లక్షణం. దానికి ఉదారత, త్యాగం, సచ్ఛీలం, ఋజుప్రవర్తనలే వ్యక్తి వ్యక్తిత్వానికి తోడ్పడతాయి.

ఈ అంశాన్ని మరొక దృక్పథంతో గమనించవచ్చు, ఒక వ్యక్తిని తనతో సమానంగా చూడటం అంటే ఆ వ్యక్తియొక్క భావాలను లెక్కలోకి తీసుకోవడం అభిప్రాయాలకు విలువ వాటిని వెలిబుచ్చిన వ్యక్తి హోదా, పదవి, పేరుప్రతిష్ఠలు

పీటిపై ఆధారపడకూడదు. పేద వ్యక్తి పలికినా, అధికారంలోవున్న మనిషి చెప్పినా, పేరుప్రఖ్యాతులు లేని పౌరుడు అన్నా ఒకటిగానే వుండాలి. ఆ భావం యొక్క విలువ అంతర్గతమయిన అంశాలపైన ఆధారపడాలి ఈ సూత్రాన్ని ఎప్పుడూ గమనించడం ప్రజాస్వామ్యంలో నమ్మకం వున్నవారు చేసే పని. ఒక మాటను భార్య చెప్పినా, తల్లి పలికినా, సంతానం అన్నా ఖాతరు చెయ్యడం కుటుంబంలోని పురుషుని విధ్యుక్త ధర్మం 'నీకేం తెలుసు అనే నిరసన భావంలో దాన్ని త్రోసిరాజనటం తగని పని.

మరొక్క అంశాన్ని గురించి ప్రస్తావించటం అవసరం. పరిగణించడం వేరు ఆమోదించడం వేరు. ఒకరి ఆలోచనలను, ఒకరి భావాన్ని, ఒకరి పధకాన్నీ ఓపికగా వినడం వేరు; దానిని యధాతధంగా అంగీకారం తెలపడం వేరు. ఆలోచించి పనికి రాదని నిరాకరించవచ్చు లేక కొంత భాగం ఉపకరిస్తుందని స్వీకరించవచ్చు. అంతేగాని ఫలానివారు చెప్పారు కనుక తప్పక తమ సమ్మతి తెలపాలనుకోవడం క్షంతవ్యంకాదు వ్యక్తులమధ్య పరస్పర గౌరవం మీద, భావాల విలువ మీద ఆధార పడే సహకారం కావాలి కాని గ్రుడ్డి అనుకరణ కాదు. కుటుంబ యజమాని అభిప్రాయాన్ని ఆలోచనా రహితంగా స్త్రీలు - భార్య, తల్లి, అప్పచెల్లెళ్లు - వెంటనే ఒప్పుకోవడం, అలా వారు అంగీకరించాలని ఆశించడం అసమంజసం. ఈ సందర్భంలో మరో హెచ్చరిక చేయడం ఆవశ్యకర్తవ్యం, కుటుంబ యజమాని అభిప్రాయం కనుక దానిని గ్రుడ్డిగా, బండగా నిరసించకూడదు; ఆమోదించకూడదు కూడాను. అలా చేయడం ఆత్మవంచన పరవంచన అవుతుంది. ప్రతి వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలి. వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే తాపత్రయంతో సందర్భం లేకుండా అర్ధంతో నిమిత్తం లేకుండా మరొక వ్యక్తితో విబేధించరాదు. విశిష్టత్వం వ్యక్తిత్వ లక్షణమే కాని అది సహజమయినదిగా వస్తుపరమైనదిగా వుండాలి. కృత్రిమంగా వుండరాదు. కేవలం మరో ప్రయోజనాన్ని ఆశించి 'వ్యక్తిత్వ వికాసం కొరకు' అ ముసుగులో వ్యవహరించరాదు.

ఎదుటి మనిషిని వినటం, అర్ధం చేసుకోవటం, ఆ మనిషి మాటలకు భావాలకు విలువ యివ్వటం ప్రతి వ్యక్తి చేయవలసిన పనులు. అలా అత్యధిక సంఖ్యాకులు సంచరిస్తే కుటుంబంలో, సమాజంలో అసంతృప్తి నశిస్తుంది; ప్రశాంత వాతావరణం వస్తుంది. అపుడే కుటుంబం, సమాజం శాంతి సౌఖ్యాలతో విరాజిల్లుతవి. ఏది ఏమయినా కుటుంబ వ్యవస్థ ఈనాటిది కాదు. మానవ నాగరికత ప్రారంభం కుటుంబం లోనే ఏర్పడింది. ఇదొక విధమైన ప్రయోగశాల.

ఎరిక్ ఫ్రామ్, రిచర్డు విలింగ్‌స్టన్ లాంటి సైకాలజిస్టుల అభిప్రాయంతో ఒక కట్టడానికి ముందు నమూనా గీసినట్లు, ఒక చిత్రపటాన్ని ఒక మోడల్ నిర్మించినట్లే ఉన్నత సమాజాన్ని నిర్మించడానికి, అందులో మానవ విలువల్ని ప్రోది చెయ్యటానికి కుటుంబాన్ని మించిన ప్రయోగశాల లేదు అన్నారు. ఇక్కడ నేర్చిన విద్యకాని. విద్వత్తుకాని, భావఘర్షణగాని, ఆప్యాయతలు, అనురాగాలు, విద్వేషాలు, విధ్వంసాలు, మరెక్కడా దొరకవు. మానవ జీవితం, కుటుంబ వ్యవస్థ, అందులోని వ్యక్తుల నడత, గుణగణాలు, ఆచార వ్యవహారాలు చిత్రాతి చిత్రం వర్ణనాతీతంగా వుంటాయి. హిరణ్యకశిపుడికి ప్రహ్లాదుడు పుట్టినట్లు ఎవరి రూపురేఖలు వారివి ఎవరి గుణగణాలు వారివి. అయినా పూసలోని దారంవలె అనేకత్వంలో ఏకత్వం, ఏకత్వంలో అనేకత్వం వున్నట్లే కుటుంబ వ్యవస్థ పునాది సడలి పోలేదు. కాకపోతే గ్రామికీకరణవల్ల ఉమ్మడి కుటుంబాలు చెదిరిపోయి అణు కుటుంబాలు పెరిగిపోతున్నాయి. అయినా జాయింటు ఫ్యామిలీలకంటే సింగిల్ ఫ్యామిలీల్లో పేచీలు, తగాదాలు, హత్యలు, ఆత్మహత్యలు, విడిపోవటాలు తగ్గిపోలేదని మనకు తెలుసు. కారణము మానవ మస్తిష్కంలో పుట్టిన భావాల పరిణామమే మనలోని స్పర్థలకు కారణాలు. ధనవంతులైనా, బండగాళ్ళయినా మనశ్శాంతి లోపించటానికి పొరపొచ్చాలు వుండటానికి మూలం మన మనోగత లక్షణాలేమూలం. కనుక మనం మారాలి. పుర్రెన పుట్టిన బుద్ధి పుడకలతోకాని పోదంటారు. అది పొరపాటు అవగాహన. ఈనాడు ఎన్నో అసాధ్యాలు సాధ్యాలయినాయి. మానవ శక్తి అమోఘం, అద్వితీయం. పట్టుపడితే కొండలనైనా పిండి చెయ్యవచ్చు. అలాగే మనం మన దుర్గుణాలను సద్గుణాలుగా మార్చుకోవటం అంత కష్టసాధ్యమేమీ కాదు. మనం కోరేది శాంతి, సుఖం, ఆనందం, సంతోషం. ఇవి కలిగివున్నవారే మహామనిషులు. కనుక సాధన ద్వారా మనలోని ఈర్ష్యా అసూయలను, లోభం మోహం, అవనీతి అక్రమ ధనాపేక్ష లాంటి దుర్మార్గ హీనకృత్యాలు రూపుమాపుకొని వాటి స్థానంలో దయ, సానుభూతి, ప్రేమ, అభిమానం, సేవాదృక్పథం, త్యాగం, నీతి నిజాయితీ లాంటి కొన్ని సద్గుణాలను అలవర్చుకుంటే మనకు మనమూ, మనపిల్లలతోటివారు, తద్వారా కుటుంబం, సమాజం, దేశం సుభిక్షంగా మనగలవు. కనుక ఏ కార్యసాధనకైనా మూలం మానవ ప్రవృత్తి. దానిని సాఫీగా నడిపించగల బుద్ధి ఒక్క మానవునికే వుంది. ఆ బుద్ధిని దుష్టత్వం నుండి సత్యం శివం సుందరం అనే సూక్తు వైపు మరల్చగలిగితే కుటుంబ పునాది గట్టిపడుతుంది. దాని వ్రేళ్ళు శాఖోపశాఖలై విరాజిల్లుతాయి. అది మన చేతుల్లో పనే. అనాడే యుద్ధాలు పోయి శాంతి కలుగుతుంది. ద్వేషాలు పోయి ప్రేమాభిమానాలు కలుగుతాయి. స్వార్థాలు నశించి పరార్థం మనగల్గుతుంది.

4వ అట్ట తరువాయి

విస్తారంగా వస్తున్నాయి. ప్రసిద్ధులయిన రాజకీయవేత్తలు, కవి పుంగవులు, సంఘ సేవకులు, క్రీడాకారులు, రచయితలు తమ ఆత్మకథలను ప్రజలకు అందిస్తున్నారు. అయితే జనాభాలో సగందాకా వున్న స్త్రీలు ఆత్మకథలు వ్రాయటం అరుదుగా జరిగే సంఘటన. అలా వ్రాసే స్త్రీలు అక్కడక్కడ దర్శనం యిచ్చినా వారి ఆత్మకథలకు ప్రాచుర్యం లభించటంలేదు. ఇలాంటి పరిస్థితిలో మల్లాది సుబ్బమ్మ తన ఆత్మ కథను వ్రాయటం, ముద్రించుకోవటం ముదావహమే కాదు ఒక విధంగా సాహసమే. అసలు ఆమె ఆత్మకథ ఎంత రసవత్తరంగా ఉంటుందో ఎంత ప్రబోధాత్మకంగా ఉంటుందో చదివిన వారికిగాని తెలియదు.

ఆమె తన జీవితంలో మహిళా జాగృతికి, స్త్రీ జనోద్ధరణకు, ఆందోళనా ఉద్యమాలకు, నిర్మాణ కార్యక్రమాలకు సంఘాల స్థాపనకు ట్రస్టుల నిర్వహణకు, పత్రికా రచనకు, ప్రబోధ ప్రయత్నాలకు, సారస్వత సృష్టికి చోటు పెట్టింది. అంతటితో ఆగక రాజకీయాలలోకూడా ఆమె ఐక్యం చేసుకున్నది. 1968లో మునిసిపలు ఎన్నికల్లో, 1980లో లోక్ సభ ఎన్నికలలో అభ్యర్థిగా నిలిచింది. స్వాతంత్ర్యమైన జీవితాన్ని గడిపే ఆమె రాడికల్ హ్యూమనిస్టు. హేతువాద, నవ్యమానవవాద ఉద్యమాలలో జాతీయ కార్యనిర్వాహక సభ్యత్వ స్థాయికి ఆమె ఎదిగారు. 1978లో లండనులోని ప్రపంచ హ్యూమనిస్టు సభకు ప్రతినిధిగా వెళ్ళి యూరపు పర్యటన చేశారు. వైవాహిక సంబంధ కౌన్సిలర్‌గా ఆమె పేరు చిరపరిచయం. 'వ్యక్తిగత సమస్యలు: సమాధానాలు' అనే శీర్షికను ఒక మహిళా పత్రికలో నిర్వహించటం ద్వారా తెలుగు స్త్రీలకు ఆమె పేరు బాగా తెలును. ఆమె ముఖ్యంగా వ్యాసకర్త. అయితే మహిళా సమస్యలపై ప్రజల దృష్టిని ఆకట్టే నిమిత్తం ఆమె నవలలు, కథలు కూడా రాశారు. క్రొత్తగా చదువు నేర్చుకునే వారికోసం పుస్తకాలు రాసి ప్రచురించారు. 'స్వామూఝ్ఞి రుద్రమదేవి' పై 10,11 సంవత్సరాల బాలల కొరకు చిన్న నవల రాశారు మొత్తానికి సుమారు 60 పుస్తకాలు, 40 కరపత్రాలు రచించారు. స్త్రీ విమోచనోద్యమ కార్యకర్త ప్రసిద్ధ సంఘసేవకురాలు అయిన సుబ్బమ్మగారు ప్రత్యేక ఆంధ్రోద్యమం, జె.పి. ఉద్యమం, కూరగాయల ఎగుమతి నిషేధ ఉద్యమం లాంటి ఆందోళనలలో భాగస్వామ్యం వహించారు హేతువాదం, కుల నిర్మూలనం, అభ్యుదయ వివాహం వీటిని ప్రోత్సహిస్తున్నారు. పార్టీయేతర రాజకీయాలను, వోటర్ల సమతుల ఉద్యమాన్ని ఆమె అభిమానించారు. మహిళలలో జాగృతి, చైతన్యాల కోసం విశేషంగా మహిళా సాహిత్యాన్ని సృష్టించారు. మహిళా కార్యకర్తలకు శిక్షణ ఇస్తున్నారు. "స్త్రీ స్వేచ్ఛ" మాసపత్రిక ద్వారా మహిళా ప్రబోధం సాగిస్తున్నారు. వైవాహిక కుటుంబ సలహా కేంద్రం ద్వారా భర్తతిరస్కృతులకు భర్త పరిత్యజక్తులకు అండగా ఉంటున్నారు.

# రచయిత గురించి



తెలుగునాట నవలా కారులుగా, కథా రచయితలుగా. గేయ కవులుగా రాణించిన స్త్రీలున్నారు. చిత్రకారిణులుగా, నట సామ్రాజ్యానికి అధినేతలుగా, నట్టువరాండ్రుగా నాట్యగత్తెలుగా, సంగీత విద్వాంసులుగా ఖ్యాతి చెందిన వనితామణులు ఎందరో ఉన్నారు. కాని వ్యాస కర్తలుగా వాసికెక్కిన వారు బహు స్వల్ప సంఖ్యలో కనిపిస్తారు. అందులోనూ స్త్రీ స్వేచ్ఛకు జీవితాన్ని ధారపోసేవారు చాల తక్కువ మంది. అలాంటి వారిలో శ్రీమతి మల్లాది సుబ్బమ్మ అగ్రశ్రేణికి చెందినవారని చెప్పటం అతిశయోక్తి కాదు.

ఆమె సారస్వత సేవకు వ్యాసం సాధనం. ఆమె వ్యాసాలు ఉపన్యాసాలలాగా ఉంటాయి. ఆమె వస్తుతః వక్త. ప్రబోధం ఆమె ప్రవృత్తి. కోటి స్త్రీలలో జాగృతిని, ఉత్సాహాన్ని రేకెత్తించటం ఆమె ఆదర్శం. మహిళలకు ఆత్మ విశ్వాసాన్ని కల్గించటం ఆమె ధ్యేయం. అతివలను ఆదుకోవటం ఆమె నైజం. తన విధ్యుక్త కర్తవ్యాన్ని నిర్వహించే నిమిత్తం ఆమె అనేక సారస్వత రీతులను చేపట్టింది. విమర్శ, చరిత్ర, వ్యాసం, నవల, కథ, బాలసాహిత్యం, వయోజన సారస్వతం అన్నీ ఆమెకు అభిమాన పాత్రమైన విషయాలే మత వ్యవస్థలు స్త్రీకి నష్టదాయకంగా పరిణమిస్తున్నాయని నిరూపించడానికి హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మత సమాజాలను ఆమె విమర్శిం చారు. స్త్రీ విముక్తికి ముఖ్య అవసరమయిన మానవ వాద ఫెమినిజాన్ని ప్రతిపాదిం చారు. నిద్రాణమై వున్న స్త్రీ జాతిని మేల్కొలిపే నిమిత్తం ఆమె 'స్త్రీ స్వేచ్ఛ' అనే మాస పత్రికను నడుపుతున్నారు. స్త్రీ జనాభ్యుదయం కోసం పది సంస్థలను స్థాపించారు. రెండు ట్రస్టులను నెలకొల్పారు. ఇలా 40 ఏళ్ళుగా యథోచిత రీతిగ సంఘసేవ చేస్తూనే ఉన్నారు.

వారికి అభినందన సంస్థవారు ప్రప్రథమంగా దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ అవార్డు యివ్వడం, ఆమె పుస్తకం 'ఆం. ప్ర. మహిళోద్యమం [1860-1988]'కు తెలుగు విశ్వవిద్యాలయం వారు బహుమతి యివ్వటం. అఖిలభారత మహిళా సభవారు సన్మా నించటం అబ్బురపడవలసిన విషయాలు కాదు.

ఆమె రాజకీయ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక ఉద్యమాలలో కృషిచేసిన వ్యక్తి. కనుకనే ఆమె ఆత్మకథ వ్రాయటానికి సాహసించాను. ఈనాడు ఆత్మకథలు

మిగతా శివ అట్టమీద

కుటుంబాలు సర్వవిధాలా సుఖసంతోషాలకు ఆలవాలమవుతాయి. తద్వారా శాంతి సామరస భావాలు పెరిగి భార్యా భర్తల మధ్య సహజీవనం, అత్తమామలయెడ గౌరవం, బిడ్డలయెడ అవ్యాజానురాగం సిద్ధించి కుటుంబం మూడు పువ్వులూ ఆరు కాయలుగా విరాజిల్లుతుంది. అలాంటి కుటుంబాలున్న సమాజంలోనే సంతృప్తి, ఆనందం వెల్లివిరుస్తాయి. కనుక కుటుంబానికి, సమాజానికి కూడా వ్యక్తే మూలం. ఈనాటి మానవుడు విశ్వమానవుడయినాడు కదా! కనుక కుటుంబం కూడా వసుధైక కుటుంబం అయిననాడే జాతులు, మతాలు, కులాలు, భాషలు హద్దులు అంతరించి పోతాయి, యుద్ధాలు నశిస్తాయి, సత్యాహింసల సాధనాలతో మానవాళి వికశిస్తుంది. అయితే మనం సచ్ఛీలురమైనా కుటుంబ సభ్యులు కొందరు స్వార్థం, పేరాశ, లోభత్వం, ధనాపేక్షలు కలవారై తోటివారిని హింసిస్తుంటే ఏం చెయ్యాలి అనేదొక భావం, దుర్మార్గులను సన్మార్గులను చెయ్యటం ఎంత కష్టమో వారితో సహజీవనం నెరపడంకూడా అంతకన్నా కష్టమే. అయితే మనం మాత్రం వారి దారిన నడవడం, వారిని దూషించడం అర్థరహితం, అవివేకము, మన సత్ ప్రవర్తనతో వారిని మార్చుకోగలగాలి. మరీ శృతిమించితే వారికి దూరంగా మెలగాలి. కొన్ని ముఖ్యలక్షణాలను సహనం, సచ్ఛీలం, సత్ ప్రవర్తన, సమరస భావన, కుటుంబ సభ్యులు అలవర్చుకోక తప్పదు.

1. నిజాయితీ:- (HONESTY) కుటుంబములో, సమాజంలో సమంజసంగా మెలగడానికి ప్రతి వ్యక్తికి కొన్ని లక్షణాలు వుండాలి. అందులో ముఖ్యమయినది సచ్ఛీలం. శీలం అంటే చాలమంది లైంగికంగా ఆలోచిస్తారు. అది సరికాదు. శీలం విషయంలో నిజాయితీ అంటే వ్యక్తి నడవడి అనే లక్షణం ప్రముఖ పాత్ర వహిస్తుంది నిజాయితీ అంటే మనోవాక్కాయ కర్మల పరిశుద్ధంగా ప్రవర్తించటం. ఆలోచించడం మాట్లాడటం, చేయడం ఒకే పద్ధతిలో వుండాలి. ఒకటి అనుకొని మరొకటి చెప్పడం, చెప్పేదానికి భిన్నంగా నడుచుకోవటం సరికాదు. దీనినే త్రికరణశుద్ధి అని పిలుస్తాం. చాలమంది నోటితో పొగడి నొసలుతో వెక్కిరిస్తారు. లేక మనిషి ఎదుట ప్రస్తుతించే పద్ధతిలో మాట్లాడి ఆ మనిషి కనుమరుగవగానే, అపహాస్యంగా మాట్లాడటం, ఆ మనిషిని నిందించటం తగని పని. ఒక వ్యక్తి భావాలు నచ్చకపోతే నిష్కర్షగా ఆ విషయం వెలిబుచ్చటం ఉత్తమ లక్షణం. కనీసం మెచ్చుకోకుండా వుండటం ద్వితీయ శ్రేణిది. ఒక్కొక్కపుడు రెండవ పద్ధతికూడా మాటలకన్నా శక్తివంతంగా వుంటుంది. ఏదైనా, యీ రెండు రకాల నడతలలో దేనిని అమలు చేసినా ఈసు, కార్పణ్యాల, ద్వేషం లేకుండా చేయగల్గాలి. భయానికి లోనయి, మరేదో ప్రయోజనాన్ని ఆశించి

రపడకూడదు. పేద వ్యక్తి పలికినా, అధికారంలోవున్న మనిషి చెప్పినా, తులు లేని పౌరుడు అన్నా ఒకటిగానే వుండాలి. అభిప్రాయం యొక్క విలువ యిన అంశాలపైన ఆధారపడాలి ఈ సూత్రాన్ని ఎప్పుడూ గమనించడం త్యంలో నమ్మకం వున్నవారు చేసే పని. ఒక మాటను భార్య చెప్పినా, , సంతానం అన్నా భాతరు చెయ్యడం కుటుంబంలోని పురుషుని విధ్యుక్త కేం తెలుసు అనే నిరసన భావంలో దాన్ని త్రోసిరాజనటం తగని పని.

గొక్క అంశాన్ని గురించి ప్రస్తావించటం అవసరం. పరిగణించడం వేరు డం వేరు. ఒకరి ఆలోచనలను, ఒకరి భావాన్ని, ఒకరి పథకాన్నీ ఓపికగా ; దానిని యథాతథంగా అంగీకారం తెలపడం వేరు. ఆలోచించి పనికి గాకరించవచ్చు లేక కొంత భాగం ఉపకరిస్తుందని స్వీకరించవచ్చు. ఫలానివారు చెప్పారు కనుక తప్పక తమ సమ్మతి తెలపాలనుకోవడం కాదు వ్యక్తులమధ్య పరస్పర గౌరవం మీద, భావాల విలువ మీద ఆధార కారం కావాలి కాని గ్రుడ్డి అనుకరణ కాదు. కుటుంబ యజమాని న్ని ఆలోచనా రహితంగా స్త్రీలు - భార్య, తల్లి, అప్పచెల్లెళ్లు - వెంటనే సం, అలా వారు అంగీకరించాలని ఆశించడం అసమంజసం. ఈ సందర్భంతో స్పరిక చేయడం ఆవశ్యకర్తవ్యం, కుటుంబ యజమాని అభిప్రాయం కనుక ద్దిగా, బండగా నిరసించకూడదు; ఆమోదించకూడదు కూడాను. అలా ఆత్మవంచన పరవంచన అవుతుంది. ప్రతి వ్యక్తి తన వ్యక్తిత్వాన్ని కాపా వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే తాపత్రయంతో సందర్భం లేకుం నిమిత్తం లేకుండా మరొక వ్యక్తితో విభేధించరాదు. విశిష్టత్వం వ్యక్తి కాని అది సహజమయినదిగా వస్తుపరమైనదిగా వుండాలి. కృత్రిమంగా . కేవలం మరో ప్రయోజనాన్ని ఆశించి 'వ్యక్తిత్వ వికాసం కొరకు' అనే వ్యవహరించరాదు.

దుటి మనిషిని వినటం, అర్థం చేసుకోవటం, ఆ మనిషి మాటలకు భావాలకు ఇవ్వటం ప్రతి వ్యక్తి చేయవలసిన పనులు. అలా అత్యధిక సంఖ్యాకులు కుటుంబంలో, సమాజంలో అసంతృప్తి నశిస్తుంది; ప్రశాంత వాతావరణం అపుడే కుటుంబం, సమాజం శాంతి సౌఖ్యాలతో విరాజిల్లుతవి. ఏది కుటుంబ వ్యవస్థ ఈనాటిది కాదు. మానవ నాగరికత ప్రారంభం కుటుంబ ృడింది. ఇదొక విధమైన ప్రయోగశాల.

## వ్యక్తిగా గుర్తించక పోవటం

ఈ వైఖరి దాంపత్యంలో అనేక అనర్థాలకు కారణభూతమవుతుంది. అవతలి వ్యక్తిని మనిషిగా గుర్తించకపోతే అవతలి వ్యక్తి కసిమీద మృగంగా సంచరించే ప్రమాదముంది. "నీవు నన్ను మనిషిగా చూడటం లేదు కదా! నేను జంతువుతో సమానమేగా! కనుక నేను జంతువులాగా ప్రవర్తిస్తాను" అని అతడు / ఆమె ప్రవర్తిస్తే ఆ కాపురంలో ప్రేమానురాగాలు ఎక్కడ వుంటాయి? ఇలా వివరించి విశదంగా చెప్పగల వ్యక్తి సలహాదారు.

## లైంగికతలో వైషమ్యం

దంపతుల మధ్య లైంగిక విషయాలలో సామరస్యం లేకపోతే సంబంధం చిక్కులకు లోనవుతుంది. జంతువుల మధ్య సెక్సు వాసనా ప్రేరితం. మనిషిలో ఆలోచనాశక్తి,బుద్ధి వగయిరాలు పని చేస్తున్నాయి. మనిషిలో హేతుత్వం(Reason) భాసిల్లుతున్నది. ఒక్కమాటలో చెప్పాలంటే సెక్సు భావన మెదడులో పుడుతుంది. ఇంద్రియాలద్వారా అనుభూతి పొందుతుంది. సెక్సు అనుభవంలో అనేక దశలుంటాయి. వీటిని విస్మరించినా చిక్కే. వీటిని తీవ్రతరం చేసినా బాధే. కనుక శారీరక మానసిక శాస్త్ర పరిజ్ఞానం కొంతగా కొంత దంపతులకు అవసరం.

## వాడుకోవటం (Exploitation)

దాంపత్య సంబంధంలో పురుషుడూ స్త్రీ ఒకరికొకరు చేదోడు వాదోడుగా ఉంటారు. ఒకరికొకరు సహచరులుగా, స్నేహితులుగా, ప్రేయసీ ప్రియులుగా, భార్యాభర్తలుగా ఉంటారు. ప్రేమలో అవతల మనిషిపై శ్రద్ధ, జీవితాన్ని అనుభవాన్ని పంచుకోవాలనే తహతహ, ఒకరికోసం మరొకరు త్యాగం అన్నీ ఉన్నాయి. అయితే ఇవన్నీ ఇష్టంమీద చేసేపనులు. అవతల వ్యక్తి తనని పనిముట్టులాగా, సాధనంలాగా వాడుకుంటున్నది లేక వాడుకుంటున్నాడు అనే భావం ఒక వ్యక్తికి వస్తే మొదటి వ్యక్తికి రెండవ వ్యక్తిపై వైముఖ్యత ఏర్పడుతున్నది. అంటే మొదటి వ్యక్తి రెండవ వ్యక్తికోసం ఇష్టపూర్వకంగా త్యాగం చెయ్యటం చాల కష్టమవుతుంది. ఈ భావం ఆవిర్భవించరాదు. ఈ భావం ఉదయిస్తే దాంపత్య సంబంధం సడలిపోతుంది.

## లోపాలు

లోపాలు లేని వ్యక్తి ఉండటానికి అవకాశంలేదు. సంపూర్ణ మానవుడు లేక సంపూర్ణ మానవి లేరని చెప్పడం అతిశయోక్తికాదు. అయితే ఈ లోపాలు ఎలాం